# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్

ఆగస్టు 1957

సంపుటము 34 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1957


| | | | |
|---|---|---|---|
| అభిజ్ఞాపిక | శ్రీ శనగన నరసింహస్వామి | ... | 1 |
| విశ్వనాథవారి రామలక్ష్మణులు | పావకి | ... | 3 |
| స్వీకారము | కావ్యశ్రీ | ... | 14 |
| వక్రగతులు | శ్రీ మధురాంతకం రాజారాం | ... | 33 |
| నన్నెచోడుని కవితాశక్తి | శ్రీ సి. నారాయణరెడ్డి | ... | 51 |
| ఇల్లు జాగ్రత్త | శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ | ... | 62 |
| కవల జీవితములలోని వ్యత్యాసములు | శ్రీ రాళ్ళపల్లి గోపాలకృష్ణమాచార్యులు | ... | 74 |
| 1857 భారతీయ సైనిక విప్లవం | శ్రీ కాలిన్ వెల్చ్ | ... | 81 |
| రాత్రివేళ | బాలగంగాధర తిలక్ | ... | 91 |
| కలగూరగంప | | ... | 92 |
| గ్రంథవిమర్శనము | | ... | 97 |

# అభిజ్ఞాపిక

శ్రీ శనగన నరసింహస్వామి

* * "మోదకైస్త్రాడయ" నాందీ భూతంగా ప్రజాప్రభుప్రబంధం విడివడింది. అటు కవిరాజు నిష్క్రమణం; ఇటు ఋతురాజు ఆగమనం. గుణాఢ్యుడు లేని తెలుగుకొలువులో జీవకళ చెరిగింది. అఖిలాంధ్రపథం ఆంతరంగికంగా స్తంభించి పోయింది. నాటి పుంస్కోకిలస్వామి విషాదకంఠంలో వసంతగీతి చిక్కుపడింది. తదభిజ్ఞాపికయే ఈ కావ్యఖండిక.

## 1

స్వాగతమోయి! మాంసల రసాల కిసాల కవోష్ణ భోజనా
భ్యాగత! చైత్ర సుందర సభావన మాగధ మండల ప్రభూ!
స్వాగతమోయి! ఆంధ్రజన సాగర హర్షపయోతరంగ రే
ఖా గురుదాహా! కోకిలసఖా! మధురామృతగాత్ర మోహనా!

## 2

తెలుగుతోటల మీదుగా తెగబడి అవె
పొంగి వచ్చిన దోకసారి పూలకారు
లోకము తదాభిముఖ్య ప్రలోభమూన
ఏల వినిపించవోయి నీ ఈలపాట ?

## 3

అకటా! ఏమిది? కన్నుదోయి సుడివో అశ్రూదకం బింతలో
సకలాంగమ్ములు ముద్దగా ముడిచి నిశ్శ్వాసింతు వెట్టెట్టులో
ప్రకటింపంబడె పంచమస్వరము ప్రభ్రష్టమ్ముగా; తెల్గు నే
లకు శుష్కించున రాగభోగలహరీ లాభమ్ము పక్షి ప్రభూ!

## 4

ఎన్ని వసంతముల్ గడచి ఈ మధుమాసము ప్రాప్తమయ్యెనో !
నిన్ను గుణాఢ్య సత్కవి గణించిన రోజులు, ఆంధ్రరాజ సం
పన్న సభాస్థలమ్ము మఱువం దరమయ్యెనటో ! కృతజ్ఞతా
స్విన్న మనోజ్ఞరాగములు చిందవదేమి తెనుంగు భూమిపై ?

## 5

అవునవు నర్థమైనది మహాత్మ ! గుణాఢ్యుని కొల్వులో పరా
భవమును పొంది మాతృభువి బాయుట; నేటికి జ్ఞప్తికెక్కు నీ
రవమగు నీ ప్రవర్తనము రమ్యము లెమ్మిక ఎప్పుడైన నీ
ప్రవిమల గాన మాధురులు పంటకు వచ్చున ? పోయి వత్తువా ?

## 6

దవ్వుల శాతవాహన శతక్రతు నిశ్చల నేత్ర వీథిలో
నవ్వులు లేవు; తద్రసమనః ప్రమదా కబరీ భరమ్ము పై
పువ్వులు లేవు; తజ్జన వపుస్స్ఫలాను వచోవరమ్ములో
రువ్వులు లేవు; ఆమని పురోగమనమ్ము తిరోగమించునో !

# విశ్వనాథవారి రామలక్ష్మణులు

**పావకి**

పై పేరుతో భారతిలో వచ్చిన వ్యాసం చూసే సరికి హడలిపోయాను. అది వారు ఏనాడో వ్రాసివుండాలిసిందట! ఏదో ఇప్పటివరకూ ఇలా ఉండాలిసిన యోగం వుందికాబట్టి సరిపోయిందికాని అది ఇంతకుముందే వచ్చివున్నట్లయితే హృదయనిర్భేదనం అయివుండేది. మరి వ్రాసినవారు సామాన్యులా! ప్రతివాది భయంకరులు! ఒక్క వీరేకాదట! ఆంధ్రదేశంలో ఈ విషయం తెలిసినవారు (ఒక్కరూ ఇద్దరూ కాదు) సహస్రాధికులు ఉన్నారట! వారంతా దయతలచి వూరుకున్నారుట! వీరైనా ఇన్నాళ్ళూ వూరుకోవటం అనుగ్రహబుద్ధి ఎక్కువ కాకపోవటంవల్లనే. అయితే ఇప్పుడీ ఉపక్రమం దేనికి? అంటే - 'అపమార్గంలో పడిపోయినభాషకు ప్రాధాన్యంవచ్చి అది ఉపాదేయమే అనే అపోహ జనాల్లో వ్యాపించి ఇహ సన్మార్గంలో నడిచే రచనకు స్థానం వుండకపోతుందని య్యేవే!, చూడబోతే వీరూ ఏదోకొంత రచన చేసిన వారల్లేనే అవుపడుతుంది. అది ఏదో బయట పడవేస్తే బాగుంటుంది. ఏమంటే రచనకైనా నేటి తెనుగు దేశీయులలో స్థానం అంటూ ఉండకపోవటం ఉండదనుకుంటాను. కాబట్టి భయపడనక్కరలేదు. కాదు - వీరు ఏరచనా చేసివుండరు. 'ఈనాటి తెనుగునాటి రచనలకు పట్టిన దుర్గతి రాబోయే పరంపరకు పట్టకుండా ఉండాలి' అనే వ్యవస్థా రక్షణాభినివేశంతోనే విభూషణమైన మౌనాన్నికూడా వదలుకొని వీరి ప్రకృతోద్యమం! అని అనుకుందాం. ఎంత ఉదారమైన సంకల్పం! నన్నయ్యనాటి పరిపక్వతలేకా వ్యవస్థలేకా భాష చెడిపోతోందే! అని ఇహ విజ్ఞులెవ్వరూ విచారించనక్కరలేదు. ప్రతివాది భయంకరులు వూనుకున్నారు. మనకాభయం అక్కరలేదు. బాగుంది. అయితే-ఈ పనికి వీరు ఎవరితో ఉపక్రమించారయ్యా! అంటే వారితోనూ వీరితోనూ కాదు. నేటి తెనుగు కవుల్లో ఒడ్డోలుడని పేరుమోసిన సత్యనారాయణగారితోనే! మరి 'ప్రధాన నిబర్హణన్యాయం' తెలిసిన వారైవుంటారు ఆచార్యులుగారు! తర్వాత ఒపి.'నాపక లోహ వైభవసనాథము నాథకథన్ రచింపెదన్' అని ఆయన ప్రతిజ్ఞచేసి రచిస్తూవున్న రామాయణ కల్పవృక్షంలోనే ఉపక్రమించారు. విమర్శలువస్తే సమాధానం చెప్పికొని ఆదుకోవడానికి 'శిష్య వాత్సల్యనుస్థ చెలువుదీర్చినమూర్తి!' పెద్దదిక్కు వెంకన్నగారు కూడా ఇప్పుడు లేరాయె. వెంకన్నగారంటే ఏమిటో మనవి చేస్తాను. 'కాకవికంఠంబు కత్తిగోత.' సత్యనారాయణగారు చిక్కుల్లోనే పడ్డారు. మరి ఈవచ్చిన విమర్శసామాన్యమైనదా? తట్టుకోవడానికి వీల్లేనిదాయె! అదైనా గ్రంథం యావత్తునూ వుద్దేశించి కానేకాదు. ముప్ఫైరెండుపద్యాలు వున్న భాగాన్ని గూర్చి మాత్రమే. ప్రతి పద్యమూ వుదాహరించి ప్రయోగాల క్రింద గీట్లుపెటి భిన్నాభిన్నంచేసి మిగిలిన గ్రంథం అంతా కూడా యీలాగే వుండి వుంటుందనటానికి ముచ్చటనకగా ఆయీ విమర్శను వలయించారు ప్రతివాది భయంకరులు! పేరు తలుచుకుంటేనే గుండెలవిసిపోతున్నాయి. భయం వేస్తోంది కాబట్టి 'భయంకర' మినహాయించి ప్రకృతం ప్రతివాదిని మాత్రమే గ్రహించి (లాఘవానికే సుమండీ!) సమాధానానికి యథాశక్తి వుపక్రమిస్తాను. యశోవా, మృత్యుర్వా!

ప్రతివాదుల వుపక్రమ వాక్యం ఇది—"పై పాత్య భాగములోని ప్రతిపద్యము నుదహరించి (ఉదహరించి—తప్పు. ఉదాహరించి అని వుండాలి) యందలి యౌచిత్యానౌచిత్యములను నా యోపినంతవఱకు సహృదయముతో (సహృదయముతో తప్పు. సహృదయునిగ అని, లేదా సహృదయతతో అని కాని వుండాలి.) విమర్శించుటకు ప్రయత్నించెద."

సహృదయత మాట అలా వుంచుదాం. అది దేవుడికే తెలియాలి. ప్రతివాదులు పద్యాలన్నీ లెక్కపెటి మేలుచేశారు. సమాధానాలివ్వడానికి క్రమం వెతుక్కోనక్కర్లేకుండా సరిపోయింది.

మొదటి ఆక్షేపం—

(1) వ. రామలక్ష్మణు లిరువురు గాధేయపాదాభి
వందనం బాచరించిన-

కం. రాముఁడు నమస్కరించుచు
నా ముని పాదములు తాఁకినంతటన తనూ
రోమాంచము లానంద
శ్రమత్పులకాంబుభంగస్ఫూర్తి ముని పొంగెన్.

"ఈ వచన భాగమును నీ కంద పద్యభాగమును గలిపి యొక వాక్యముగా నూహింపఁబడియున్నది."

అసలు యీ వాక్యం సరిగ్గా వుందా? అని విచారించాలి. ఊహించిన వానిచేత అవి కలపబడ్డాయి కాని అవి స్వతహా కలిసి లేవు. రెండూ విడివిడిగా నే వున్నాయి. "రామలక్ష్మణులు—ఆచరించిన" అన్నది కథానుసంధాయకమైన వాక్యం. అది సమాపక క్రియతో వుండి తీరాలన్న నిర్బంధం లేదు. భారతాద్యనుశీలనం యేమాత్రమైనా వుండివుంటే యీలాంటి సందేహం పుట్టదు. ఆచరణ సమకాలంలో ఒక విశేషం కవిచేత వివక్షితం కాబట్టి 'ఆచరించిన' అని అసమాపకక్రియ వాడబడింది. నమస్కార రూపక్రియకు పాదస్పర్శనం అనేది కాయికాంగం మాత్రమే. నమస్కారమంటే కాళ్ళు పట్టుకోవడమే కాదు. గురు పితృ స్వనామములను ఉచ్చరించడం మొదలైన వాచికాంగం కూడా అందులో వుంటుంది. (ఏష ప్రాచేతసాంతేవాసీ లవః ప్రణమతి. ఉ—రా.) సంప్రదాయం తెలియాలి. కాగా—ఒకే వాక్యంలో 'పాదాభివందనము' 'నమస్కరించుచు' 'పాదములు తాఁకినంతటన' లేవు. ఇక పోతే నమస్కరించుచు పాదములు తాఁకుటలో విరోధం ఏముంది? నమస్కరించుచు—గురు పితృ స్వనామకథన రూపమైన వాచికక్రియ చేస్తూ—సమకాలికంగా పాదస్పర్శ రూపమైన కాయికక్రియ చేయవచ్చును. అలాగే చేయాలికూడా.

రాముడు తాఁకినప్పుడే మునికి వొళ్ళు గగుర్పొడవడమున్నూ, చెమర్చడమున్నూ. ఏమంత వుపద్రవం వచ్చిందంటే మరి ముని దృష్టిలో రాముడు ప్రాకృత శిశువు కాడు. లీలాగృహీత మానుష రూపుడైన సాక్షాన్నారాయణుడు! పాఠకుఁడైనవాడికి సన్నివేశాన్ని భావించుకోగలిగిన శక్తి వుండాలి. ఒక్క భాషా జ్ఞానం చాలదు.

లక్ష్మణస్వామి రాముడికన్నా తక్కువై పోవడం లేదా? అని విచారించడం అప్రస్తుత ప్రసంగం అవుతుంది. తక్కువా అంటే మరి తక్కువే అని అనుకోవలసి వస్తుంది. ఇంతకూ సారాంశం యిది—నమస్కార క్రియ రామలక్ష్మణోభయాశ్రితం. అందులో రామాశ్రయమైన నమస్కార క్రియవల్లనే మునికి పులక స్వేదోద్గమాది వికారం కలిగింది. కనుక 'రాముఁడు నమస్కరించిన' అనే పద్యంలో రాముఁడు పునరుక్తుఁడైనాడు. పోతే—'తాఁకినంతటన' అనేచోట అలంకారధ్వని వుంది. ఏలాగంటే, రామస్పర్శ కారణం. పులక స్వేదములచేత తెలియబడుతూవున్న ముని ఆనందం కార్యం. కారణం ఎప్పుడూ కార్యం కంటే పూర్వకాలికం. అలాంటి కారణంతో కార్యానికి యౌగపద్యం చెప్పినట్లయితే 'అక్రమాతిశయోక్తి' అనే అలంకారం అవుతుంది. ఆ అక్రమాతిశయోక్తిని యీ 'తాఁకినంతటన' అనే అవధారణార్థకం ధ్వనింపఁజేస్తోంది. విచారిస్తేనేకాని తెలిసే విషయం కాదిది. విశేష్యాన్ని వాడిన తర్వాత సర్వనామాన్ని వాడడమే సామాన్యం. కాని నియమం లేదు. ఇచ్చట సర్వనామం వాడితే-అది 'రాముఁడు' అనే శబ్దానికికూడా ఆక్షేపకమయ్యే చిక్కు వుంది. అది అలా కారాదు. ఇచ్చట ముని పొందిన ఆనందమే వివక్షితం. సందేహనివారణకే పునః మునిశబ్దప్రయోగం! అదీకాక—యిచ్చట సర్వనామం కంటే మునిశబ్ద ప్రయోగంలోనే ఔచిత్యం వుంది. యేలాగంటే—రామస్పర్శకు పూర్వం వున్న మునిరూపం వేఱు. ఇప్పటి రూపం వేఱు. ఇప్పటి రూపం రామస్పర్శ జనితమైన ఆనందంవల్ల పులకితమున్నూ స్విన్నమున్నూ అయింది. ఆ పూర్వరూపంలో వున్న మునికి—ఇప్పటి యీ పులకిత స్విన్నరూపంలో వున్న మునికి—కల అభేదాన్ని కేవలసర్వనామం కంటె ఆవృత్తమైన మునిశబ్దమే సమర్థంగా స్ఫురింపఁజేయుగలదు. కవి యీ ప్రయోజనంకోసం యిచ్చట రెండుచోట్ల మునిశబ్దాన్ని వాడారు కాని విశేష్యము నుపయోగించిన తరువాత సర్వనామమును వాడాలన్న సామాన్య నియమం తెలియక కాదు. అలా అనుకోవడం పొరబాటు. ప్రౌఢ రచనలో పద ప్రయోగౌచిత్యం యీలా వుంటుంది. ఇది బాలబుద్ధులకు అందేది

కాదు. మాచేకన్నా వుండాలి. ఇంతవఱకూ చాలనను కుంటాను.

"తనూరోమాంచువు లానంద శ్రీమత్పులకాంబు భంగధృతి' అనునది వాక్యమా, సమాసమా",

ఇది వాక్యమే. రోమాంచువులు—రోమాంచువుల యందు అని అర్థం. 'ఏకోక్తిచో జశంబు సప్తమికిన్ బ్రథమయగు' ప్రౌ—వ్యా. కా. సూ 20. ఉదా. 'భావంబుల్ భయముజ్జగించి యొగుడీ భివ్యాద్రి చాటందగున్' (హరివంశము) భావంబుల్—భావములయందు. చాలకపోతే తిక్కన్నగారు కూడా వున్నారు. 'పారిఁజోరి మోము బాష్పజలపూరము గ్రమ్మగ—' శల్యప. మోము-మోమునందు.

"ఆనంద శ్రీమత్పులకాంబుభంగ ధృతి ముని పొంగెన్" యిదేమీ దేశవాళీసమాసం కాదు. ఆలోచించకుండా తెలిసిపోవడానికి! కవిత్వం ఆలోచనామృతం. ఆలోచించినకొలదీ విశేషాలు తెలిసే అవకాశం వుండాలి. వివరిస్తాను.

ఆనంద శ్రీమత్—ఆనంద సమృద్ధిమంతములైన (సమృద్ధిమత్త్వం అంటే వ్యంజకత్వం చేతనని తాత్పర్యం. పులకాదులు వ్యంజకాలు. వాటిచేత ఆనందం వ్యజ్యమానం అవుతుంది. అంతే కాని ప్రతివాది అనుకొన్నట్లు రోమాంచువుల కానందమంటూ వుండదు.) పులక - గగుర్పాటుయొక్క - అంబు భంగ-స్వేదాంబు తరంగములయొక్క - ధృతిన్ - ధరణముతో - ముని పొంగెను. అని చెప్పుకోవాలి.

స్వామీ! యిలా చెప్పుకోవడం చేత 'శ్రీమ' ద్విశేషణం సకల కల్యాణగుణ పరిపూర్ణుడైన శ్రీరామచంద్రుడికి తప్పిపోయిందే! అని మీరు నిర్వేదించనక్కరలేదు. ఓపిక చేసి రామాయణ కల్పవృక్షమంతా చదవండి. (ఈ ముప్పై రెండు మాత్రమే చదివితే ఎలా?) కావలసినన్ని విశేషణాలు దొరుకుతాయి. సత్యనారాయణగారికి మీకంటే తక్కువ రామభక్తిలేదు. ఇంతకీ ముఖ్యవిశేషం ఏమిటంటే—

"సన్న్యాసియైన విశ్వామిత్రుని నెమటకా విశేషణము?" అనే మీ జుగుప్సాకరమైన సంశయం నివర్తిస్తుంది.

"ఇంతకి నీపద్యవచనసంకుల సారాంశము శ్రీరాముడు విశ్వామిత్రుని పాదములను స్పృశించుటచే నామునికి గగుర్పాటు కలిగెను" అని. అంతకన్న సాధారణ భాషాజ్ఞానము గలవానికిఁ దెలియని మహోన్నతి భావనాబల మిందేమియు లేదు. "ప్రసన్నగుణము సున్న."

పై వివరణవల్ల సాధారణ భాషాజ్ఞానమైనా లేదనీ, సంప్రదాయ విజ్ఞానం బొత్తిగా లేదనీ, పాఠకులకు తెలిసిపోకుండా వుండడం ఎలా సంఘటిస్తుంది? ఒకవేళ సాధారణ భాషాజ్ఞానం ఉన్నట్లయితే, (లేదు అని ముందు ఋజువవుతుంది) శబ్దార్థమాత్ర ప్రవణులకు గోచరించని విశేషాలుకూడా కొన్ని మరి పై పద్యంలో మనవి చేశాను. ఇప్పటి కింతవరకూ చాలననుకుంటాను. మరి 'ప్రసన్నగుణం' మాట సెలవిచ్చారు. మీరనుకున్న అర్థంలో అది తప్పు. ప్రసాదగుణము అని కాని ప్రసన్నతాగుణము అని కాని అనాలిసివుంటుంది. కర్మకర్తృభావమైనా తెలిసినట్లు కనబడదు. (ఇది సాధారణ భాషాజ్ఞానంలోనిదే) స్వాములు పాపం పెద్ద పని పెట్టుకున్నారు!

గ్రంథం పెరిగేట్టుంది. స్థాలీపులాక న్యాయంగా ప్రతివాదుల ఔచిత్యానౌచిత్య విమర్శశక్తి ఆ యీ మొదటి ఆక్షేపంలోనే పాఠకులకు తెలిసి వుంటుంది. ఔచిత్య విచారానికి కావలిస్తే మళ్ళీ వుపక్రమిస్తాను. ముందు శాబ్దిక దోషాలనుండి బయటపడితే ఇప్పటికి అంతే చాలు.

3. గాధేయు కన్నులు కమలపత్రాభిరాములైన
రాము నేత్రములఁ గలియు
గాధేయు కన్నులు కదలి వసిష్ఠుల
స్తిమిత నేత్రములను జేరఁబోవు
గాధేయు చూపులు కమనీయ రామ మే
ఘము మేన శంపాభకాంతు లొలయు
అందుగన్నను

"ఏమి విశ్వామిత్రుఁడో కాని తనకు నమస్కరించిన రామలక్ష్మణుల నెంతమాత్రము నాశీర్వదింపక నెత్తిచూపులు ప్రారంభించినాడు. 'గాధేయ' పదము పైవచనములో నొక్కమారు ఉపయోగింపఁబడి యదే యీ పద్యములో నాలుగుసార్లు ప్రయోగింపఁ బడుటలో సారస్యమేమియు లేదు."

నాలుగు పాదాల్లోనూ గాధేయపదానువృత్తికి—నమస్కరించిన రామలక్ష్మణులను, విశ్వామిత్రులు

ఆశీర్వదింపక పోవడానికీ. కారణాలు తరవాత ఆలోచిద్దాం. ముందు పెద్దచిక్కు వచ్చిపడింది. యీ శింపాథ కాంతులవద్ద. ఏమిటీ శింపాథ కాంతులు? ప్రతివాదుల బాధయిది.

"అందమైన రాముని యొక్క మేఘమువంటి శరీరమునందు గాధేయుని చూపులు 'శింపాథి కాంతులాలయు' అని యున్నది. శింప- మెఱుపు. ఆభకును కాంతికిని అర్థభేదము లేదు. 'ఆభ' శబ్దము స్త్రీలింగము ఆకారాంతము. 'ఆభ కాంతులు' సరియేనా? పండితులు యోజింపవలసినది."

వ్యుత్పత్తి యెంత క్లిష్టస్థితిలో వుందో తెలిసికోవడానికి యిది మచ్చుతునక! యీ మాత్రం పరిశ్రమతో యీ పనికి పూనుకోకపోతే నిర్బంధించేదెవరు? 'అపండితుణ్ణి' అనే స్వస్వరూపావబోధనమే వుండివుంటే గ్రంథం యింత పెరిగేదికాదు! అస్తాం తత్ — 'శింపాథ కాంతులను' వ్యాఖ్యానిస్తాను. శంపేవ- ఆభాతీతి- శంపాభా- సా- కాంతిః- శంపాభకాంతిః. 'ఆతోనుపసర్గే' 'ఆతోలోపఇటిచ' 'అజాద్యతష్టాప్' 'పుంవత్కర్మధారయ జాతీయ దేశీయేషు' యీ సూత్రాలవల్ల పై రూపం నిష్పన్నమవుతుంది. యీ భాగ్యానికి కౌముదిదాకా పోనక్కర్లేదు. రఘువంశం ప్రథమసర్గ పూర్తిచేసి, ద్వితీయసర్గ యెనిమిదో శ్లోకం వరకైనా చదివి గ్రంథ పరిపూర్తి చేసివున్నా, చాలు.

'మరుత్ప్రయుక్తాశ్చ మరుత్సఖాభం'

యిక్కడి విగ్రహం యెల్లాగో మల్లినాథులు వివరించే వున్నారు.

'అందుఁగన్నను'

ప్రత్యయంపై ప్రత్యయం కూర్చుట తగదని ప్రతివాదుల శాసనం! కాని కొన్ని ప్రత్యయాలు కేవల ప్రత్యయ మాత్రము లేకాక స్వతంత్ర వ్యవహార యోగ్యములై వున్నాయన్న విషయం తెనుగువ్యాకరణాలు చూచివున్నవారికి తెలియకపోదు. 'అందు' స్వతంత్ర వ్యవహారయోగ్యమే! నిత్యవ్యవహారంలో కూడా మనం 'అందుచేత' 'అందువల్ల' 'అందుకొఱకు' 'అందుండి' మొదలైనవి వాడుతూనే వున్నాం.

(4)కం. మునిదృష్టిలోన మలఁచుచు
మనుజేశ్వరుఁ గని వసిష్ఠ మౌనిం గని త
క్కినవారిం గని యొక త్రో
త్తినవ్వు నవ్వు చిటులనియె ధాత్రీపతితోఁ.

యీ పద్యంలో "విశ్వామిత్రుఁడు మూడుసారులు 'కని'నాఁడు" అని ప్రతివాదులకు వేదన! మూడుసార్లు కన్నది ఒక్కణ్ణేకాదు. ముగ్గుర్ని! (మనుజేంద్రుని, వసిష్ఠమౌనిని, తక్కినవారిని.) బాధే. అయినా తప్పదు. విడివిడిగానే 'కని'వలసి వుంటుంది. వసిష్ఠులవారిని చూచిన చూపులో అర్థం వేరు. దశరథుణ్ణి చూచిన చూపులో అర్థం వేరు. తక్కినవారిని చూచినచూపులో అర్థం వేరు.

"'నవ్వు' కందపద్యమునకుఁ గావలసిన శరవేగము భగ్నపఱచినది"

'యీ పద్యానికి' — 'యీ వేగం' — అంటూ ఏకోక లక్షణ గ్రంథంచేసి వ్రాసిపెట్టినట్లు వుంది! సమర్థుఁడైన కవిచేతిలో యే పద్యమైనా భావానికి అనురూపమైన నడకే నడుస్తుంది కాని దాని నడకంటూ అది నడవదు. కందపద్యంలో 'శరవేగం' వుండాలనుకోవడం, భావానుసారంగా రచన వుంటుందని తెలియకపోవడం!

(5)మ. ఎవరయ్యా! రఘురామచంద్రులకుఁ
గానీ యస్త్రవిద్యాగుణుల్
నవబాహాపటుదీర్ఘదండమునకు నీ
నావద్ద శిష్యత్వ మొ
ప్పవలెన్, శ్రీ రఘురాము బాహు
పటిమల్ ప్రాశస్త్యమందన్ వలెన్
వివృతంబుల్ మునికోటి యజ్ఞతతి
నిర్విఘ్నత్వ మొప్పన్ వలెన్.

"రామచంద్రులకుఁ గానీ" ప్రతివాదులకు పదచ్ఛేదమే రానప్పుడు సమాసాలు తెలియకపోవడంలో ఆశ్చర్యం లేదు. 'రామచంద్రులకు గా, నీ యస్త్రవిద్యాగుణుల్' అని విరుచుకొని తికమక పడ్డట్లు కనపడుతోంది.

"శ్రీరాములకుఁ దక్కిన విద్యలన్నిటివలెనె యింతవఱకు నస్త్రవిద్యయందును వసిష్ఠులే గురువు."

యీ మాట కాధారం యెక్కడ వుంది? వాల్మీకంలో లేదు "గజస్కంధేఽశ్వపృష్ఠే చ, రథచర్యాసు సమ్మతః। ధనుర్వేదే చ నిరతః పితృశుశ్రూషణేరతః" అని మాత్రమే వుంది. రఘువంశపు రాజులకు వసిష్ఠుల గురుత్వం ధనుర్విద్యావిషయంలో కాదు. ఆ రాజు!

ఇంకా బాల్యంలో తమ తమ తండ్రుల వద్దనే ధనుస్సు పట్టినట్లు తెలుస్తుంది.

"త్వచం స మేధ్యాం పరిధాయ రౌరవీ
మశిక్షతాస్త్రం పితు రేవ మంత్రవత్
న కేవలం తద్గురురేకపార్థివః
క్షితావభూ దేకధనుర్ధరోఽపి సః"

రఘువంశం.

వాల్మీకాన్ని పఠిమాస్తే శ్రీరాములకు విద్యలన్నీ 'ప్రపేదిరే ప్రాక్తన జన్మ విద్యాః' అన్నట్లు స్వయం ప్రకాశములైనట్లే తోస్తుంది. అప్పటికి ధనుస్సులో అంతో యింతో గురుత్వమంటూవుంటే అది దశరథునిదే అయివుండాలి. 'ధనుర్వేదనిరతః పితృశుశ్రూషణేరతః' అనేకదావుంది! ఇహ రామాయణ కల్పవృక్షాన్ని బట్టిమాస్తే శ్రీరాములకు ధనుర్విద్యాగురువు కైకేయి. చదివితే తెలుస్తుంది.

"రాముసకు గురువుగా నుండుట కితనులు తగరనియుఁ దానే తగుదుననియు నధిక్షేపించుచున్నాఁడు" (వసిష్ఠుల్ని!) యీ ఆకాశసౌధం యెలా నిలుస్తుంది? అంతవఱకూ శ్రీరాములకు ధనుః పరిచయంమాత్రం వుండివుండవచ్చును. ఆ ధనుః పరిచయానికి దశరథుడో! కైకేయియో (అర్జునునికి కృపాచార్యులవలెనే) గురువులై యుండవచ్చును.

ఇహ అస్త్రవిద్యలకు గురువు కావలసి వున్నాడు. ఇందులో వసిష్ఠునకు తగిలే అధిక్షేపమంటూ ఏమీ లేదు.

"రఘురామచంద్రులు — అని బహువచనములో నొకతూరియు 'రఘురాము'— అని యేక వచనములో నొకతూరియుఁ బునరుక్తి దోషముతో నుపయోగింపఁబడి యున్నది."

'అది బహువచనంతో', వుంది. 'ఇది యేకవచనంలో' వుంది. అని ఒప్పుకుంటూ యింకా పునరుక్తి దోషం ఏమిటి?

'మీరఘురామచంద్రులను గానీ! గురువులెవరయ్యా?' అన్నది 'భోగట్టా' చేయడానికి దశరథుణ్ణి విశ్వామిత్రులడిగిన వాక్యం. అప్పటికింకా శిష్యుడు కాలేదు కాబట్టి 'రఘురామచంద్రులు' అని మన్నించడమే మర్యాద.

ఇహ తాను గురువు కాదలచుకున్నాడు కాబట్టి యిచ్చట 'రఘురాము' అనడమే వుచితం. ప్రసంగమర్యాద తెలిస్తే యిది తెలుస్తుంది.

"నవబాహా పటుదీర్ఘదండుఁడు"

విగ్రహ వాక్యం వ్రాసి చూపెస్తాను.

పటుశ్చాసౌ - దీర్ఘశ్చ - పటుదీర్ఘః - పటు దీర్ఘశ్చాసౌ - దండశ్చ . పటుదీర్ఘదండః - బాహూ - పటుదీర్ఘదండావివ - బాహోపటుదీర్ఘదండౌ - నవౌ - బాహోపటుదీర్ఘదండౌ - యస్య - సః - నవబాహోపటుదీర్ఘదండః - అని

కాస్త కావ్యశిక్ష అంటూవుంటేనే కాని మరి యిలాంటి గండాలు గడవడం కష్టం!

"మునికోటియజ్ఞతతి నిర్విఘ్నత్వము ఇదియొక్క సమాసము. 'వివృతంబుల్ ' అను విశేషణము 'యజ్ఞతతి' అన్న సవిమిపదమునకుఁ జెందినది; కుదురునా?"

పైది ఒక్క సమాసం కాదు. 'మునికోటియజ్ఞతతి' వరకే సమాసం యజ్ఞతతిన్-యజ్ఞములయందు-నిర్విఘ్నత్వము. విఘ్నాభావము-ఒప్పవలెను. అని యర్థము. 'వివృతంబుల్ ' 'రఘురామ బాహుపటిమలకు' విశేషణంకాని, యజ్ఞతతికి కాదు. ప్రకటితములై రాముని బాహుపటిమలు ప్రాశస్త్యంలోకి రావాలి! అని విశ్వామిత్రులు ఆశిస్తూ వున్నారు. మరి యే అర్థం చెప్పాలని ప్రతివాదులు 'వివృతంబుల్ ' యజ్ఞతతికి విశేషణంగా విరిచి వున్నారో! బ్రహ్మరహస్యంగా వుంది.

(6) చం. మొనసి భృశాశ్వదత్తములు
మూల్గుచు నున్నవి నాకడన్ మహా
స్త్ర నిభృత విద్యలన్నియు
రఘురామునకై యవి యెల్లనిచ్చెదన్
మనుజమహేంద్ర! పంపుము
కుమారుని నా వెనువెంట; నూరకే
యనలము దాఁచుకొన్న ఫలమా?
క్రతుయోగ్యము కావలెన్ జుమీ!

"ఉత్తమ కవులు ప్రతిపదము వర్థయుక్తముగ నుపయోగించియున్నారు. ఇచ్చట 'మొనసి' యట్టిది కాదు. 'మహాస్త్ర నిభృత విద్యలు' వ్యర్థపదమైన 'మొనసి'తోఁ బద్యము ప్రారంభింపఁబడినది గాన ప్రాసకొఱకు

నింకొక వ్యర్థపదము 'నిభృతి' కావలసి వచ్చినది. ధార కుంటినది."

ఇలాంటి విమర్శకులు పుట్టుకువస్తూ వున్న కాలంలో పుత్తడి కవుల్ని నిర్ణయించుకోవడం సామాన్య జనులకు కష్టమే అవుతుంది. 'మొనసి' యేలాంటిదో విచారిద్దాం. మొనయు - ధాతువు. క్త్వార్థకం మొనసి - మొనతీరి - ఉన్ముఖమై అని కదా అర్థం! అస్త్ర విద్యలు మొనయడం దేనికి? కొంచెం ఆలోచించి వుంటే - 'ప్రయోగ వేళామనుపాల్య-ప్రయోగ వేళను ప్రతీక్షిస్తూ' అని గోచరిస్తుంది. మరి కామ క్రోధాల్ని జయించి బ్రహ్మర్షియై కూర్చున్న ఆ విశ్వామిత్రులవద్ద వాటికి వినియోగం ఎలా వుంటుంది? పూర్వాశ్రమంలో విశ్వామిత్రులకు ఆ అస్త్ర విద్యలు 'భృశాశ్వ(ఁ)డు' నే ముని యిచ్చినవి. అవి శ్రీరాముల దగ్గరకు వచ్చి రాక్షసుల మీద ప్రయోగింపబడడానికి వేచివున్నాయి. అస్త్ర విద్యలు వేచివుంటాయా? అంటే వుంటాయి. అవి చేతనావంతములు! ఇన్నాళ్ళ నుండి అవి ఆ మునియందు నిభృతములై వున్నాయి. నిశ్చలములై వున్నాయన్నమాట! యింత తాత్పర్యం మనకోసం వేచివుంటే - 'మొనసి' 'నిభృతి' వ్యర్థ పదాలెలా అవుతాయి? 'ధారకుంటినది' ధారకుంటకు. తెగుతుంది. కుంటేది నడక. ఏదో వికటి! అది యిక్కడ కుంటిన మాటే నిజమైతే-యిక్కడ పడితే అక్కడ ప్రాసల్లోకి విరిగిపోయే తిక్కన సోమయాజులవారి ధార యావత్తూ కుంటిందనే అనుకోవలసివస్తుంది.

"అనలము దాఁచుకొన్న ఫలమా? క్రతుయోగ్యము కావలెన్ జుమీ!-రాముఁ డనలముతోఁ బోల్పఁబడినాఁడు. అనలము దాచుకొన్న ఫలము లేని మాట నిజమేకాని యది దాఁచుకొన్నవారిని దహించివేయును. రాముఁ డట్టివాఁడు కాఁడు."

యెంత సూక్ష్మదర్శిత్వం! దాచుకోవడమంటే బహుశా వొళ్ళోననని వీరి తాత్పర్యం అయివుంటుంది. అలాగే అయితే అది దహించివేసే మాటే నిజం. వీరి మార్గానికి మనమేమి చేయగలం?

'గుప్తూ—రక్షణే.' దీనికి సరైన తెనుగు ధాతువే 'దాఁచు' అన్నది. దశరథుఁడు యాజ్ఞికుడు; అనేక యజ్ఞాలు చేసినవాడు. యాజ్ఞికులకు అగ్నిగోపనం నిత్యానుభవసిద్ధమైన విషయం. అయినాపై యగ్నిమాట అలావుంచి కొంచెం లోతుకు దిగితే—అప్రకటితమైన క్షాత్రతేజం—రాముడనే అగ్నిని దాఁచికొన్న శమీవృక్షం దశరథుడు! విశ్వామిత్రులూ యాజ్ఞికులే. అయినా అగ్నిని ఆహరించడానికిగాను దశరథుని వద్దకు రాక! శమీవృక్షంలో వున్న అగ్ని శమీవృక్షాన్ని దహించేదికాదు. యాజ్ఞికులు శమీవృక్షంనుండి అగ్ని నాహరిస్తారన్నది ముందు తెలియాలి. యింతులో వున్న ఔచిత్యం మనస్సుకి పట్టకపోతే! తస్మైనమః!

(7) ఉ. చిత్తము చిత్తమంచు నృపశేఖరుఁ
డానమ దాస్యహాసుఁడై
యుత్తిగిలెన్ విషణ్ణతను; నొత్తిడి చేసెను
మౌని; రాజులో
నుత్తిల మందుచున్ ప్రభు! ప్రభూ!
బ్రతుకంతయు వాచికన్న యీ
పొత్తులబిడ్డఁ బాసి నిలుపోపనయా!
నిముసంబు నేనియున్.

"తెనుఁగు కవిత్వము వ్రాయునపుడు సంస్కృత సమాసములు కూర్చుట సాధారణమే. అయిన నవి సహజముగా నుండవలెను. 'ఆనమదాస్యహాసుఁడు' అట్టిది కాదు."

'తెనుగు కవిత్వం వ్రాసేటప్పుడు సంస్కృత సమాసాలు కూర్చుకోవచ్చు' అని అనుమతి ప్రసాదించారు. యీ నవభాషావ్యవస్థాపకులు! బ్రతికాం. అయితే ఒక నియమం వుంది. అవి 'సహజంగా' వుండాలిట! యీ సహజంగా వుండడమంటే ఏమిటో తెలియడం లేదు. వివరించివుంటే బాగుండేది. మనకు అర్థం కానిదల్లా అసహజమే నంటేమాత్రం మళ్ళీ విగ్రహవాక్యం వ్రాయవలసివస్తుంది! అంత శ్రమ కలిగించడానికి యిష్టంలేకనే దీన్నిమాత్రం 'అసహజం' అనేదాన్ని వివరించకుండా వీరిలా విడిచేసి వుంటారు. కాని యిది విచారించవలసిన విషయం మాత్రం ఔను.

సంస్కృతంలో వాల్మీకి కాళిదాసులు సమాసాలు కూర్చారు. భవభూతికీ సమాసమంటే యిష్టమే. శ్రీహర్షమురారులూ సమాసగ్రథనంలో పేరుమోసినవారే. వీరందరూచేసే సమాసగ్రథనంలో అంతిసమైన వైవిధ్యం వుండి వుంటుంది. ఒక్కొక్క

కవి ఒక్కొక్క ప్రయోజనంకోసం సమాసం చేస్తాడు. అయితే పూర్వాలంకారికు లెవరూ వీరివీరి సమాసాలు సహజాలనీ—వీరి వీరివి అసహజాలనీ—ప్రకృత నవభాషా వ్యవస్థాపకులకు మల్లే కేటాయించి నిష్కర్ష చేసినట్లు కనపడదు. సంస్కృతంమాట మన కెందుకు గాని తెనుగులో చూద్దాం. నన్నయగారి సమాసాలు వేరూ, తిక్కనగారివి వేరు. మరి శ్రీనాథుడొక డున్నాడు. పోతన్నగారున్నారు. నాచన సోమన్న, రామకృష్ణకవీ, రాయలూ, వున్నారు. వీరందరికంటే పెద్దన్నగారి కూర్పు వేరుగా వుంటుందిట! అయినా చెప్పిన పెద్దలందరూ భాషా మహా సౌధానికి స్తంభాల వంటివారు! నేడు సత్యనారాయణగారూ సమాసాలు చేస్తున్నారు. వీటిలో వున్న వైవిధ్యమేమిటో, ఎవరు ఏ ప్రయోజనంకోసం సమాసం చేస్తారో, ఇందులో సహజాలేవో, అసహజాలేవో, నిష్కర్ష చెసి పెడితే—రాబోయే 'సంపద'కు వుపయోగిస్తుందనుకుంటాను. ఇంత బెడద దేనికిగాని— 'ఆనమదాస్యహాసు'డికి విగ్రహం వ్రాసి వూరుకుంటే సరిపోతుంది. ఆనమత్-ఆస్యం—ఆనమదాస్యం—ఆనమదాస్యే—హాసో—యస్య—సః. ప్రకృతంలో దశరథుడికి కొంబోలు. ఆ యీ విశేషణం! ఆస్యానమనం (మోము వంచికోవడం) అనేమాట తప్పవలసి వచ్చిందే! అని—హాసం మునిప్రసాదనానికి—(రాముణ్ణి విడిచి నేనుండలేను. స్వామీ! దయయుంచి నన్ను నిర్బంధించవద్దు. అని) ప్రయత్నపడి తెచ్చికొన్నదై వుండాలి! కవి హృదయం ఏమిటో సమకాలికులే కాబట్టి అడిగి తెలిసికోవచ్చును.

"'ఒత్తిగిలెన్ నిషణ్ణను' నిషణ్ణతయనఁగా విషణ్ణతయని రచయిత యుద్దేశమా కాకున్న 'నిషణ్ణత' కర్థము లేదు."

యిలా అనపెంకంటే దుస్సాహసం అంటూ వుండేదు. సింహాసంమీద కూర్చున్నవాడు కూర్చున్నట్లే దశరథుడు ప్రక్కకు ఒత్తిగిలెనని దీని తాత్పర్యం.

"ఈ పద్యరచయిత గణపరిపూర్తికొక్కకే నైనను నిరర్థకముగ ద్రుతము నుపయోగించుచుండును,"

పద్యరచయితా? యెంత 'కితాబు' కటాక్షం చారు స్వాములు! యీ ప్రతిజ్ఞమీద నిలబడాలి!! ఉత్తమకవు లెవరో, వారెలా ఉత్తమకవులయ్యారో, ముందు నిరూపించగలిగితే—వారిగ్రంథాల్లోంచే వుదాహరణలు వస్తాయి. ఇది వూరికే రాలేదు! మాట పీఁకి పోవద్దు! ప్రకృతమనుసరామః.

"'నిషణ్ణతను నొత్తిడిచేసెను' అట్టిద"

ఎట్టిది? మనకు పదచ్ఛేదము కూడా తెలియదని నిరూపించుచున్నట్టిది! తొందర లేదు; మనవి చేస్తాను.

నిషణ్ణతనున్—అత్తమిల్లిన శరీరముగలవానిని—(నిషణ్ణా - తనుః - యస్య-సః) వానిని యొత్తిడి చేసెను.

'ఒత్తిగిలెన్' సమాప్తక్రియ. 'నిషణ్ణతను'తో అన్వయించదు. దీనికి ప్రతివాది భయంకరులు తిట్టుకోవడం కష్టం! వదిలేస్తాను.

"బ్రతు కంతయు వాచికన్న యీ పాత్రులబిడ్డ" దశరథుని యత్యంతమమకారమును సూచించుచున్నది"

నిజమే! అంతే పనికిరాదు. ఆ దశరథుడన్నవాడికి వివేకంలేదు. ఆ మమకారంతోనే ప్రాణంతీసుకున్నాడు!

"మన మింకను పాండిత్యమును సంపాదించుకొని యా స్థాయినందుకొని విచారింతమన్న జిజ్ఞాస యవసరము లేదు" మన మింకను పాండిత్యమును సంపాదించికొనవలెను! ఆ స్థాయినందుకొనవలెను! విచారింపవలెను! జిజ్ఞాస యవసరము! జిజ్ఞాస యవసరము లేదనుకొంటే!—యీలాంటి కావ్యాలజోలికి రాకూడదు.

"ఈ పద్యమునుబట్టి దశరథుడు. రామునిఁబంపుటకు వాగ్దానము చేయలేదనుట స్పష్టము."

స్పష్టపడి ఏం సాధించి పెడుతోంది?

(8) ఉ॥ రాముఁడు నాకు స్నానము
రాముఁడు నాకు జపంబు ధ్యానమున్
రాముఁడె యెల్లనా బ్రతుకు
రాముఁడు నన్నును గన్నతండ్రి యీ
రాము వినాని మేషముపుర!
మనఁ జాలను. కౌదయేని; నీ
రాముని వీడి యీ యఖిలరాజ్యము
గాధిసుతా! గ్రహింపవే!

"ఇన్నిసార్లు 'రాముఁడు' అని ప్రయోగించుటచే యతిప్రాసలు సులభమైనవి. పద్యమునకుఁ గావ్యలక్షణము తక్కువైనను పలుసార్లు రామనామ స్మరణము చక్కనది; అది మంచిదే కదా!" యతిప్రాసలవల్ల కలిగే యిబ్బంది యీ వ్యాసరచయితకు (యీయన పద్యరచయిత కూడా అయివుండాలి!) బాగా స్వానుభవంలో వున్నట్లు గోచరిస్తుంది. లేకపోతే యిన్నిసార్లు వాటి 'వూసు' రాదు. భాస్కరుడీయనకు అభిమానకవై వుంటాడని యీ వ్యాసం చివరి భాగాన్నిబట్టి తెలుస్తోంది. అందులోంచే ఒక వుదాహరణ యిస్తే యీ ఘోష కొంత తప్పేట్టు వుంది. అయినా పద్యం యెక్కడిదో అనుకుంటారేమో! సరిగ్గా యిదే ఘట్టంలో వుంది. దశరథుడే అంటున్నాడు—

కం. రాముం డగ్రతనూజుఁడు
రాముఁడు కులవర్ధనుండు రాముఁడు ప్రియుఁడే
రాముని బుత్తేఁ జాలను
రామునిఁ బాసి క్షణము బ్రతుకఁగఁ జాలన్
భాస్క. రా.

దేవుడు యీయనకు ప్రసాదించివున్న వ్యుత్పత్తి వైభవమే మనకూ, ప్రసాదించి వున్నట్లయితే! అయీ పై పద్యంలో 'రా, ముందు' అపరిహార్యములే అయ్యేవి. సందేహం లేదు. పూర్వ ఘట్టాల్లో చూశే వున్నాం కదూ! వీరి పదచ్ఛేదనైపుణ్యం!

ఇంతకూ యీ రామపదావృత్తి వల్ల కావ్య లక్షణం తక్కువయ్యే మాట యెల్లా వున్నా, పుణ్యం భాస్కరుడి కెక్కువ దక్కిందా? ప్రకృతకవి కెక్కువ దక్కిందా? అన్నదే ప్రకృతం విచారణీయాంశం అనుకుంటాను! అలా చూసుకున్నా ప్రకృత కవిదే పైచెయ్యిగా కనబడుతోంది. భాస్కరుడు వ్రాసింది కందం (శరవేగం కలది!) చిన్నది. ఎక్కువ పుణ్యం తీసుకు రాలేదు. మరి వాల్మీకుల దగ్గరకు పోతే, ఆయన దక్కించుకున్నంత పుణ్యం ఎవ్వరూ దక్కించుకోలేరు. ఇదే ఘట్టం వాల్మీకంలో 'నరామం నేతుమర్హసి' 'నరామం నేతుమర్హసి' ఏడెనిమిది సార్లైనా అనువృత్తమయింది.

కథా ఘట్టం యెలాంటిదో, పాత్ర యేలాంటి మనస్థితిలో వుందో, హృదయం పెట్టి తెలుసుకుంటే, యీలాంటి నీరసప్రసంగం నాలుకకు రాదు.

"ఎల్లనా బ్రతుకు' అపసవ్యము. 'నా బ్రతుకెల్ల' సవ్యము" సవ్యమో! అపసవ్యమో! 'ఎల్లన శిష్యుల' ప్రయోగించిన శ్రీనాథుణ్ణడగాలిసివుంటుంది, అపసవ్యాన్ని సవ్యంగానో, సవ్యాపసవ్యంగానో, యెల్లాగో ప్రయోగించి వుండే వాడు!

'నన్నును గన్నతండ్రి'

"ఈ 'ను' గణము కొఱకేర్పడినది" నాకు స్నానమును, జపమును; ధావనమును; ఎల్లనా బ్రతుకునను; వెనక యిన్ని వున్నాయి. నన్ను 'ను' గన్నతండ్రి ఇక్కడ సముచ్చయం వుండితీరాలి.

కాదయేని; "గణముకొఱకు ఏవార్థకముజేసి విసంధి సేయుటలో విశేషము లేదు"

ఏవార్థకంచేసి సంధి విరవడంలోనే విశేషం వుంది. మరి యిది 'విశ్వామిత్రిప్పట్టు'!

'గాధిసుతా!'

"అన్న సంబోధన పాదపూరణార్థమే." యింత నిశ్చితజ్ఞానం పనికిరాదు. యెటువచ్చి యెటు పోతుందో! శాస్త్ర ముందూ వెనకా వుండాలి. విశ్వామిత్రుల పూర్వులకున్నూ, ఆయీ ఐక్ష్వాకులకున్నూ స్నేహ సంబంధాలు వుండివుంటాయి. అనునయంలో దాన్ని గుర్తుకి తీసుకురావడమే దశరథుడి వుద్దేశం.

ఈవ్యాసకర్త చూపించిన దోషం వంటిదే మళ్లీ మళ్లీ చూపించి చాలా విసుగు కలిగిస్తున్నారు. దోషాలే చూపదలుచుకొన్నప్పుడు వాటిని జాతి వారీగా కేటాయించి, జాతికి ఒక్కొక్కటిగా చూపించి వుంటే బాగుండేది. యెన్ని చూపించినా, నిలిచే భాగ్యానికి ఒక్కటి నోచుకున్నట్టు కనబడడం లేదాయె! యీయనకు 13 వ పద్యంలో గానీ విసుగు రాలేదు. చెప్పిన సమాధానం వంటిదే తిరిగీ చెప్పవలసి వస్తున్నందుకు నాకిప్పటికే విసుగ్గా వున్నది. యింతా అయితే మనం యెనిమిదో పద్యంలోనే వున్నాం. ఇంకా యిరవైనాలుగున్నాయి. ఇప్పటికే గ్రంథం చాలా పెరిగింది. అయీ సమాధానం చెప్పిన అంశాల్లో యేదక్కడైనా ప్రతివాదులు నిలబెట్టుకో గలిగితే— ప్రత్యుత్తరశోధనగా మిగిలిన యిరవైనాలిగింటికీ సమాధానం వ్రాస్తాను. లేనిపక్షంలో నాకీ వృథాశ్రమ దేనికి? అయినా గచ్ఛద్వ్యాఖ్యానంగా మరి కొన్నింటికి వ్రాసి విసుగు మరీ యెక్కువై దుర్భరమవుతుందో అక్కడికి నిలిపేస్తాను.

(9) <u>చిళ్లిచిళ్లలయి;</u>

"అనవ్వు 'చిళ్లిచిళ్ల'లయినదట అనుకరణ శబ్ద ప్రయోగములు <u>మూఢియై</u>యున్నవి; (రూఢములైవున్నవి అనాలి) వాని నెవరియిష్టము వచ్చినట్లు వారు వ్రాయుటకు హక్కు లేదు"

'చిళ్ళ చిళ్ళలు' అనుకరణశబ్దమా? యెవరైనా చెప్పిన బాపతో, స్వబుద్ధి వైభవమేనో!

చిళ్ళ—శకలము. యిది శబ్దరత్నాకరంలో వుండదు. మరో దాన్ని ఆశ్రయించాలిసివుంటుంది. (చూ—చిళ్ళపెంకు) సూర్యరాయాంధ్ర నిఘంటువులో వుండవచ్చును.

"ఆ విశ్వామిత్రుని నవ్వు 'ముసరి'నదట. 'ముసరుట' ఈగలు క్రమ్ముటకే వాడుదురు. తపోనిష్ఠాగరిష్ఠుడైన విశ్వామిత్రుని బహుధారాశమైన నవ్వునకీ <u>నీచ</u> శబ్దము తగదు."

నీచములు కావడానికి పదాలు చేసికొన్న పాపమంటూ వుండదు. మన బుద్ధివిశేషాన్ని బట్టి రమ్య భావాలు తోస్తాయి! 'ముసరుట' విన్నవెంటనే స్వాములకు 'ఈగలు ముసరిన' దృశ్యమే స్ఫురణకు రావాలా? వెన్నెలలు గుర్తుకురాకపోతే మానీ, చీకట్లు ముసరడమైనా గుర్తుకువస్తే—కొంత బాగుండేది. ఆ దశరథుడి సభాభవనాంతరాళంలో ప్రతిధ్వనించి శకలితమైనట్లు వినవస్తోందేకాని, స్వాములు చూచివున్నట్లు విశ్వామిత్రుల నవ్వు 'బహుధారాశమయిందే!" "ఎవరి యిష్టము వచ్చినట్లు వారు వ్రాయుటకు హక్కు లేదు"

సరిగా సంస్కృతమూ రాక-తెనుగురాక కనీసం పదచ్ఛేదమైనా తెలియని యీలాంటి 'అవ్యుత్పన్న ప్రాతిపదికలకు' కవిలో కొన్నింతా శాసించే యీ నియంతృత్వాధికారం యెవరు కట్టబెట్టారో!

"ఏదియైన నిష్ఠునని దశరథుఁడనినట్లే పాశ్యములో చెప్పుటను జెప్పఁబడియుండలేదు"

పాశ్యంలో అంటే—యీ సుప్తైవరెండు పద్యాల్లో అని కాబోలు! వస్తున్నా; మరి వ్యాసారంభంలోని—

"మూలములోని కొన్ని పద్యములు విడువఁబడినవి. ఆ సంగతిని గమనించి దీనికిఁ బూర్వరంగమును బఠించి ముద్రణ స్ఖాలిత్యములను ఘర్తైతీఁగి—"

యిత్యాది ప్రతిజ్ఞాపరంపరలో వున్న 'దీనికిఁ బూర్వరంగమును బఠించి' అనేదానికి భంగంవస్తోందే!

పూర్వ రంగాన్ని పఠించినమాటే నిజమైతే— యీ క్రింది పద్యం ఆ మూలంలో లోపంవుంటే తప్పక కనపడకపోదు. యిది దశరథుని వాక్యం;

కం. ఇది యాతుగవమ్ము గాదిలి
మది నెంచకు డేదియైన మామక పుణ్యా
స్పదము హఠాత్ స్ఫురితము మీ
వదనంబుననుండి రా నెవలయును స్వామీ!

'మీవదనంబుననుండి రానెవలయును' మీనోటినుండి వచ్చి తీరాలి! అంటే. వెంటనే యిస్తున్నాను. అని తాత్పర్యం!

(10) "మాకాఁకలియుం దఁదింగుమా?"

ఆంధ్రదేశీయుడెవ్వడూ ఆయీ జాతీయంలో వున్న అచ్ఛత్వాన్ని గూర్చి శంకించి వుండడు అయినా విశ్వామిత్రులకు 'ఆకలి' యెక్కువే! అని పురాణాల్ని బట్టి తెలుస్తూనేవున్నది. పైగా దశరథుని మమకారం 'రాముడె నాకు స్నానము' అన్నంత సంకాశ్యంలో వుంది. స్నానమే అయినవాడు భోజనం కాకూడదని యెక్కడ వుంది? దశరథుని మాటమీద విశ్వామిత్రులు చమత్కరించి వుంటారనుకున్నా సరిపోతుంది. 'నీకు స్నానమయితే అవునేమో కాని భోజనమని మేము తినడానికి నీకొడుకును తీసుకుపోవడం లేదు' అని, యిలా స్నానమూ, భోజనమూ, అనడానికి ఆ 'రామయ్య' చల్లదనమూ, తియ్యదనమూ, ఏలాంటివో ఆ దశరథ విశ్వామిత్రులకే తెలియాలి!

'పిచ్చి ప్రేమా!'

వీతరాగుడైన యేమునికైనా, అంత పుత్రమోహ పరవశత్వం పిచ్చిగానే గోచరిస్తుంది. 'పిచ్చి వాడా!' అని అనుకోవడం స్నేహాతిశయంలో కూడా కనబడుతుంది.

(11) "అస్త్ర విద్య నేర్పుటకే ముఖ్యముగా రామునిఁదోడ్కొని పోయెద నని విశ్వామిత్రుఁడు దశరథుని మభ్యపెట్టుచున్నాఁడన్న మాట."

"విద్య నేర్పుటకే తీసికొనిపోవుచున్నాను. తరువాత నాకొక సూక్ష్మమైన కార్యమును జేసిపెట్టవలెను.' అని కృత్రిమముగా నే యనుచున్నాఁడు."

ఆ విశ్వామిత్రుల రాకకు ప్రయోజనం ఏమిటో, దశరథుణ్ణి ఆశ్రయించడానికిగాను వచ్చిన—మాట ముందు చెప్పకుండా—'మీ వాడికి చదువు చెబుతాను. నా వెంట పంపవలసింద'ని దశరథుణ్ణి మభ్యపెడుతున్నాడో! ఏం చేస్తున్నాడో! వాల్మీకంలో వున్న వసిష్ఠుల యీ వాక్యం చూస్తే తేలిపోతుంది.

"ఏవంవిధో మహాతేజా విశ్వామిత్రో మహాయశాః
న రామగమనే రాజన్! సంశయం కర్తుమర్హసి
తేషాం నిగ్రహణే శక్త స్స్వయం కుశిక నందనః
తవ పుత్రహితార్థాయ త్వాముపేత్యాభియాచతే"

పిమ్మట; నీవుగా నతని విడువలెన్ మరిమాకు నేటికిన్.

"తుది పాదము పద్యపూరణకే వ్రాయఁబడియున్నది" యిది పద్యపూరణకే వ్రాయబడివుందో! విధివిధానం అలావుంద కాబట్టే వ్రాయబడివుందో! తెలిసికోవాలి. తెలిసికోవడానికి—

'ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి' వరకూ (ఉత్తర రామచరిత్రందాకా) ప్రయాణించాలిసి వుంటుంది. మరి మనం రఘువంశం ద్వితీయ సర్గ యెనిమిదో శ్లోకం 'సుదక్షిణాభిం' దగ్గరే నిలిచి పోయినట్లు సర్దు!

(12) దైత్యజంతువులు.

"ఈ రూపకము పటువుకాదు. దైత్యగుణము లేని జంతువు లెన్నో కలవు"

యెంత 'జంతు' పరిశీలనా! పటువో, కాదో! ముందిది రూపకమని చెప్పిందెవరు? దైత్యో-జంతురివ-దైత్యజంతుః. దీన్ని వుపమిత సమాసం అంటారు.

'సుబాహు మారీచులు'

"లక్ష్మణ రాము లెటు సరికాదో యట్లే 'సుబాహు మారీచులను ద్వంద్వము సాధువుకాదు" సాధుత్వంమాట అలావుంచుదాం. ముందు - యీ

సామ్యం మాత్రం అతిలోకంగావుంది. మరి 'మారీచ సుబాహువులవంటివారు 'రామలక్ష్మణులు' అని స్వాముల తాత్పర్యం అయివున్నట్లు గోచరిస్తోంది. యిన్నాళ్ళనుంచీ తెలియలేదు. అయినా పాణిన్యాచార్యులవారినే కనుక్కుంటే సరిపోతుంది. ద్వంద్వ సమాస ప్రకరణంలో పూర్వ నిపాత విధాయక శాస్త్రాల్లో యీ రెండూ ప్రకృతానికి చాలు. 'అల్పాచ్తరం పూర్వం' 'అభ్యర్హితంచ' అనేవి. రామ శబ్దంలో లక్ష్మణ శబ్దంలో కంటే అచ్చులు తక్కువగా వున్నాయనో! లేక 'రాముడికన్నా లక్ష్మణస్వామి' తక్కువై వుంటాడా! అన్న సందేహం ప్రకృతాచార్యులకు మల్లే పాణిన్యాచార్యుల వారికి తెగలకపోవడంవల్లనో, మరెందుకో గాని ద్వంద్వ సమాసంలో రాముడికే 'ముందుపీట' వేశారు. ఇహ 'మారీచసుబాహు'లమాట; వీరిలో ప్రాణాలు (అచ్చులు) సమానంగా నేవున్నాయి. హెచ్చుతగ్గ లేవు. అయినా పిల్ల రాక్షసులైన పాపాన్నగాబోలు వీరిలో 'అభ్యర్హితులు' ఎవరూ? అన్న వివక్ష రాలేను. "వలసినట్లు కూర్చవచ్చియుండు" ముందు వెనకలతారతమ్యం లేకుండా పిలైనట్లు కూర్చొమన్నారు. అప్పుడు 'సుబాహు మారీచులు' తయారైనారు. యీ సమాధానం తెలియకపోతే—యిదిగో ప్రయోగం!

"శూరౌ సుబాహుమారీచౌ శైలశోణితవర్షిభిః"

దీనికి రఘువంశందాకాకూడా పోవలసినపనిలేదు. శబ్దమంజరి-చివర్లో 'రామాయణ సంగ్రహం' అని వుంటుంది. ఆ యీ ప్రయోగం బాలకాండలోనే వుంది. ఆ రామాయణ సంగ్రహం వ్రాసిన ఆచార్యుల వారు 'ప్రతివాది భయంకరులు' కాకపోనే మాని—గొప్పవైయాకరణులుమాత్రం ఔను.

(16) "అబ్జాసన సదృశుఁడైన మేధావియు మహా తేజస్వియునైన మానిచంద్రుఁ డీ గ్రంథకర్త చేతిలో నసభ్యప్రవర్తనగల—" వ్యాసకర్త విశ్వామిత్రులనుగూర్చి ముచ్చటిస్తూవున్నారు. ఆ యీ 'మానిచంద్రుఁడు' విశ్వామిత్రుడే!

యింతకుపూర్వమే చెముటవాసన వేస్తూ శ్రీరాములకు దక్కవలసిన 'శ్రీమ' ద్విశేషణం కౌశేయార్యులని చూసి అనవసరంగా స్వాముల ఆగ్రహానికి గురియైన 'సన్న్యాసి,' యింతలోనే 'మానిచంద్రుఁడు' గా యేలాగు మారిపోయాడూ? అన్నది పరమాశ్చర్యకరమైన విషయం. అయినా ఆ విశ్వామిత్రులు పట్టుదల మనిషి. 'బ్రహ్మర్షిని' కావాలంటే—అయితీరేవాడు. యీలాంటి చిన్నవిషయాలు ఒక లెఖ్ఖలోనివి కావు.

(24) ఆ సుందోపసుందుల కొడుకులు యమసదృశులు; నా కొడుకును బంపించను. వారిలో నొక్కనితోనైన నా సైన్యములతో యుద్ధమాడనేర్తునని రాజారకుంచిన.

"ఇదివరకు రాముఁడు యమునితోఁ బోల్పఁబడినాఁడు. ఇప్పుడు మారీచసుబాహు లిరువురును 'యమసదృశు' లైనారు. స్వభావములో శ్రీరామచంద్రుఁడును మారీచసుబాహువులు నొక్కటియే యన్నమాట."

స్వభావంలో ఒక్కటవటంమాట యెలావున్నా, సమాసంలోమాత్రం 'రామలక్ష్మణులు' 'మారీచసుబాహువు'లవంటివారు! అని ప్రతివాదులు సెలవిచ్చిన మాట అప్పుడే మరచిపోయేటంత బుద్ధిహీనుణ్ణి నేను కాను.

"నా కొడుకను బంపించను' అని మూర్ఖుఁగా నవినయముతో దశరథుఁడని యుండెఁడు"

మూర్ఖంగా అన్నాడో, యెలా అన్నాడో! యిదిగో వాల్మీకం!

"బాలం మే తనయంబ్రహ్మన్! నైవదాస్యామి పుత్రకం"

"అథ కాలోపమౌ యుద్ధే సుతౌ సుందోపసుందయోః యజ్ఞవిఘ్నకరౌ, తౌ, తేనైవదాస్యామి పుత్రకం సుతం"

నైవదాస్యామి-నైవదాస్యామి-ఇవ్వ నేయివ్వను-ఇవ్వ నేయివ్వను-అని కదా!

"ఒక్కనితోఁ దాను యుద్ధము సేయుటకు సిద్ధమైన రెంపితవాని నెవరు డీకొందురు. వాఁడు వెనుకనుండి తన్నకుండునా?"

యివేవీ (సందేహాలు సుమండీ!) వాల్మీకులకు కూడా తగిలివున్నట్లు లోచదు. తగిలితే తప్పజాగ్రత్తలో వుండేవారే! చూడండి-

"తయో రన్యతరేణా ౽ హం యోద్ధాస్యాం ససుహృద్గణః"

ఎలాగు డంటున్నాడుకదా—

తయోః - ఆ మారీచసుబాహుల్లో - అన్యతరేణ- ఒక్కనితో మాత్రం-ససుహృద్గణః-సుహృద్గణ సాహాయ్యం కలవాడనై. అహం- నేను -యోద్ధా-యుద్ధము చేయగలవాడను-స్యాం-అవుదును.

(26) మునిని 'ప్రసన్నుని గావించి తెమ్మని పంచిన-

"'తెమ్ము' వస్తువుల కుపయోగింపవలెను గాని మానవులకు గాదు. 'తీసికొనిరమ్ము' అనుట యుక్తము"

'భవత్ సూనునిమతియతిలోభము
మానిచి పాండవులఁదెమ్ము మనుజాధీశా!'
భార.ఉ-ద్యోగం.

పాండవులు మానవులైనా కాకపోవాలి. తిక్కన్నగారికి తెలియకనైనా పోవాలి.

(28) నీవు తొలుత మాట నొసగితా
వెనుక వెనుకొనె నేటికి? యినకుల మర్యాదయను నశే యిది తాతా!

"దీనిలోని 'తా' కేవలము వ్యర్థపదము. అనుచిత ప్రయోగము."

పసివాడికైనా తెలుస్తుంది. 'మాట నొసఁగితి-వెనుక' అని.

"తాత యనఁ దండ్రియని సంస్కృతమున నున్నది. రచయిత తనకుమాత్రమే యీ విషయము తెలియునని ప్రకటించుటకు గాబోలు దీనిని ప్రయోగించెను"

యెంత పరేంగిత జ్ఞానశక్తి! స్వాములు సెలవిస్తేకాని యిది తెలిసేదేకాదు. దీన్ని దుర్విదగ్ధత్వం అంటారు. దశరథుఁడు వయోవృద్ధుడైనా వసిష్ఠులంతకంటే ప్రాచీనులు. తరతరాలనుండీ సూర్యవంశానికి గురువులు! వారిద్దరి మధ్యా తాతా మనుమలవున్నంత వ్యత్యాసం నిరాక్షేపంగావుంది. కవి దీన్ని తెనుగర్థంలోనే వాడారు. అంటే వివరించాలి. తెనుగు దేశంలో తాతగార్లు మనమల్ని 'తాతా'! అనే సంబోధిస్తారు. పోతే మరో విశేషం తెలిసింది. యీ 'వ్యాసరచయితకు' కూడా సంస్కృతంలో 'తాత' శబ్దానికి 'తండ్రి' అని అర్థంవున్నట్లు 'తెలిసిపోయిందే' అనియ్యేవే!

(32) 'తాకొని' "అర్థమేమో?" శబ్దరత్నాకరం చూస్తే తెలుస్తుంది. ముందు క్రియాగేమిటో తెలియాలి. అది 'తాకొని' కాదు. 'దాకొని' అని. మన పదచ్ఛేదశేముషివల్ల 'తాకొని'గా మారిపోయింది. యిప్పుడు శబ్దరత్నాకరం చూసినా కనబడును! (దాఁకొను-సమీపించు-మా-శ-ర)యేలాగైతేనేం చిట్టచివరికి ప్రతివాదులు వున్న విషయం బయటపెట్టినందుకు వారిని యింతా మరచి, మనఃపూర్తిగా అభినందిస్తున్నాను. అదేమిటంటే—

"ఈ రచయితయొక్క చిన్న సమాసమునకును విగ్రహము కష్టసాధ్యము"

వారే ఒప్పుకొంటున్నారు. యీ కవి చిన్న సమాసాలతోకూడా విగ్రహం తమకు కష్టసాధ్యంగా వుంటుందని! యీ చిన్న వ్యాసంలో నాచేతనైనంత వరకూ విగ్రహవాక్యాలు వివరించి వారికి సాహాయ్యం చేశాను. యిక్కడ యింతకన్నా అవకాశంలేదు. ముఖాముఖీ అయితే యెంతయినా చేసే అవకాశం వుంటుందనుకుంటాను. అయితే ఒకదానికిమాత్రం విగ్రహం వ్రాయటం మరిచిపోయాను. ప్రకృతకవినిపీరు 'ద్రుతశరణ్యాలు' అని అనివున్నారు. వీరి స్వోపయోగార్థం దీనికి విగ్రహవాక్యం వ్రాయాలి. 'ద్రుతం-శరణ్యాః' అని!

వినమ్రదేహాలు.

"సరికాదు. 'వినమ్రశీర్షు'లు అని తోచలేదు" తోచకపోవడంకాదు. అది (శీర్షం) వినమ్రం కాందే! "గాత్రములు ఘూర్ణిలినగా మాత్రములుగ" తిక్కన్న గారు. భారతి. ఆశ్రమ

యిప్పటికి చివరిపద్యం కూడా అయినట్టుంది. అన్నింటికీ సమాధానం చెప్పకుండా వదిలివేశానని సంకోచమేమైనా వుంటుందేమో స్వాములకు! యింతకుపూర్వం మనవిచేశాను. 'మొదటి యెనిమిది పద్యాల్లో చేసిన ఆక్షేపాల్లో యే ఒక్కటైనా నిలబెట్టుకోండి!' అని. ఒక్కటి చాలును. మళ్ళీ వుపక్రమించి ప్రత్యక్షరశోధగా మిగిలిన యిరవైనాలిగింటికీ— వ్రాస్తాను. 'గచ్ఛవ్యాఖ్య' అంటూ యీవరకేచాలా విషయాలకు వ్రాసివున్నాను. ఒక్క ఆక్షేపం నిలబెట్టికోండి! మళ్ళీ వ్రాస్తాను.

అయ్యలారా! యీ వ్యాసంచివర కవినిగూర్చి తూలిక ప్రసంగం చాలావుంది. అదంతా 'నందానుగోధేనా' విషవిషం అయింది. యీ విమర్శ ప్రతివిమర్శల్ని బట్టి నేటి 'విమర్శ' అనేది యెంత దుస్థితిలో వుందో! వాఙ్మయంలో 'వ్యవస్థ' అనేది యెలా లేకుండా పోయిందో! మీకు స్పష్టపడివుంటుంది. నేటి ప్రభుత్వంచేత అనధికారులు వాఙ్మయం జోలికి రాకుండా వుండేట్లు ఒక శాసనం చేయిస్తే భాషకు మహోపకారం చేసినట్లవుతుంది. వ్యవస్థను రక్షించినట్లవుతుంది. యిది చాలా ముఖ్యమైన విషయం. తగిన ప్రయత్నాలు చేయిస్తారని ఆశ!

వ శబ్దబ్రహ్మోఖ్యం పరిమళమవాప్నోతు చ జనః
కవీనాం గంభీరే వచసి గుణదోషాన్ రచయతు!

# స్వీకారము

## కావ్యశ్రీ

పాత్రలు : రంగనాథం, కృపాబాయి, గోపాలం, ముసలయ్య, రహమాన్.

* * రంగనాథం యింటిలో మధ్యహాలు. హాలులో ఒక సోఫా, దాని కటూ ఇటూ రెండు కుర్చీలు-ముందు టీపాయి వుంటాయి. ఎడమప్రక్కగా రేడియో - దానిమీద కృపాబాయి ఫొటోస్టాండు వుంటాయి. కుడి ప్రక్కగా పుస్తకాలరాకు దాని ముందొక కుర్చీ వుంటాయి. ద్వారాలకు ఆకుపచ్చని సిల్కు తెరలుంటాయి. వెనుకగోడకు కళాప్రాధాన్యతగల రెండు ప్రకృతి దృశ్యాల చిత్రాలు మాత్ర ముంటాయి. ప్రభాతం; రేడియోలోనుంచి "జనగణమన" ప్రారంభము కాగానే తెర లేస్తుంది. మొదటి చరణం పూర్తికాగానే కృపాబాయి వచ్చి రేడియో కట్టేస్తుంది. అప్పటికి కృప పేరంటానికి వెళ్లే వేషంలో పట్టు బట్టలతో వుంటుంది.

కృపా : (రేడియో కట్టేసి) ముసలయ్యా!......ముసలయ్యా!

ముస : (లోపలనుంచి) వస్తున్నానమ్మా! (వచ్చి) పిలిచారా అమ్మా!

కృపా : ఆ! ప్లీడరుగారింటికి పేరంటానికి వెళ్ళాలి. ఒక రిక్షా పిలు.

ముస : రిక్షామీద వెళతారా అమ్మా?

కృపా : వెళ్ళక తప్పుతుందా! సరిగా సమయానికి మన కారుకు డ్రైవర్ లేకుండా పోయాడు.

ముస : అవును. డ్రైవర్ వెళ్ళిపోయాడు కదూ!

కృపా : ఎల్లుండి సుజాత పుట్టినరోజు పండుగని రమ్మని మరీమరీ చెప్పింది. అక్కడికంతా కార్ల మీదనే వస్తారు.

ముస : మీరు—

కృపా : అదే అర్థం కావటంలేదు. మనకు కారువుండీ కూడా అక్కరకు రాకుండావుంది.

ముస : కారు నడపటం రాకన్నా నేర్పించారు కారు—!

కృపా : సరిపోయింది. నువ్వు కారు నడిపితే కడకు చేరినట్టే! అరంటంటే ఆరవవాటికి తిరిగి వచ్చే మందమతికి కారుడ్రైవింగు కూడాను.

ముస : బాబుగారు కూడా వూళ్ళో లేరు.

కృపా : ఉంటే మాత్రం యేం లాభం? ఆయన డ్రైవింగ్ లైసెన్సు కాన్సిలయ్యిందిగా!

ముస : మీరు కారుక్రింద పడకపోతే బావుండును.

కృపా : పడకపోతే నేనిలా వుండనే వుండను...అది సరేగాని ముందు నేను చెప్పిన పని చూడు. (గడియారం చూచి) వేళ కావచ్చింది.

ముస : అలాగేనమ్మా! (బయటకు వెళతాడు)

కృపా : (పైటచెంగుతో తన ఫొటో తుడిచి చూచి తనలో తాను నవ్వుకొంటూ వుంటుంది.)

ముస : (తిరిగివచ్చి సంకోచంగా) అ...మ్మా...

# స్వీ కా ర ము

కృపా : (వెనక్కి తిరిగి ఆశ్చర్యంగా) ఇంకా వెళ్ళనే లేదా?

ముస : (నసుగుతూ) వెళ్ళి వచ్చానమ్మా!

కృపా : రిక్షా వచ్చిందా?

ముస : (జ్ఞాపకం వచ్చినట్లుగా సంతోషంతో) ఆ! రిక్షాకదూ (గబగబా బయటకు వెళ్ళిపోతాడు)

కృపా : (అతనివైపు జాలిగాచూచి నవ్వి) ఎలా వస్తుందో యింత మాయదారి మతిమరుపు. (ఫోటో పెట్టేసి పుస్తకం తెచ్చి సోఫాలో కూర్చుని చదవకుండా ఆలోచిస్తూవుంటుంది)

గోపా : (వస్తూనే) ఏమిటి వదినా - తెలిసీ తెలియని మందులిచ్చి రోగి ప్రాణంమీదికి తెచ్చిన డాక్టరులాగ యేమిటో దీర్ఘంగా ఆలోచిస్తున్నావు.

కృపా : (నవ్వుతూ) రా గోపీ! కూర్చో!

గోపా : (కుర్చీలో కూర్చుంటాడు)

కృపా : ఇవాళ సుజాతను వెంటబెట్టుకు రాకుండా ఒంటరిగా వచ్చావేం? కొంగువిడిచి గడప దాట నిచ్చిందా?

గోపా : కాస్సేపటిలో వచ్చి వాలిపోదూ! పుట్టిన రోజు పండుగని ఏర్పాట్లన్నీ దండిగావుండాలని - ఇల్లంతా పాలవెల్లి చేసేస్తూవుంది మీ చెల్లాయి.

కృపా : అవున్లే! దండుగ కాకుండా సందుగాం అవుతుంది మరి!

గోపా : కరెక్ట్! అత్తగారి మీద కోపంవచ్చి కూతురు నెత్తిని మొత్తే పల్లెటూరి కోడలులాగ ఖచ్చితంగా చెప్పావు. ఈసారి నూటికి నూరుపాళ్లు వ్యాపారస్తుని భార్యవనిపించు కొన్నావు వదినా!

కృపా : లక్షాధికారి ఏకైక పుత్రికి వలపుల భర్తవు కాబట్టి యెన్ని వేళాకోళాలైనా చేస్తావు: అదృష్టవంతుడివి!

గోపా : ఆమాటకు వస్తే నువ్వే అదృష్టవంతురాలవు వదినా! కారుక్రింద పడినదానవు పోస్టల్లో చేరినట్లే చేరి యింటికిమారి—యిల్లాలివై కారు యజమాని పిల్లానివి కావటం అదృష్టం కావంటావా?

కృపా : నిజమే గోపీ! నా అదృష్టంలాంటిది మన స్త్రీకి రాదేమో!

గోపా : వదినా! యిక ఆట్టే వేదాంతంలోకి దిగకు! ఆ! ప్రయాణం మీద వున్నట్టుగా పట్టుచీర బనాయించావు—

కృపా : అవును గోపీ! ప్లీడరుగారింటికి వెళ్లాలి.

గోపా : బాజా భజం త్రీలవారంటూ?

కృపా : (నవ్వి) ఆ! పేరంటం!

గోపా : పెంపుడు పిల్లికి పెళ్లి చేస్తున్నారా?

కృపా : పుట్టిన పిల్లాడికి పేరు పెడుతున్నారు.

గోపా : పేరుపెట్టేటప్పుడు కాస్త ఆలోచించమని చెప్పు వదినా. కొంచె ముచ్చులా వున్నవాడికి విశ్వసుందరరావని పేరు పెడితే వినటానికి ఆ పేరుకూడా అసహ్యంగా తయారవుతుంది. అనువాతినంలో వున్న మన ఆచరణ లన్నీ ఆదర్శప్రాయంగా వుండాలి.

కృపా : గోపీ! నీ ఆదర్శా లన్నీ ఆచరణకు అందవనే సంగతి అర్థం కావట్లుంది. మరీ యథార్థవాది వయ్యావంటే తిరోగమనం తప్పదు సుమా!

గోపా : ఆదర్శప్రాయంగాని జీవితం అనర్థకరం! ఆ మాటకేంగానీ అన్నగారి ఆగమనం?

కృపా : ఆఖరు బస్సులో!

గోపా : అయితే ఆనకవస్తా! (వెళుతూ వుంటాడు).

కృపా : (నవ్వుతూ) సుజాత ప్రక్కను లేకపోతే మనస్సు సజావుగా పనిచేయదనుకొంటాను?

గోపా : (వెనక్కి తిరిగి) ఎన్నికలలో ఓడిపోయిన పూర్వమంత్రిలా అనుభవంమీద చెప్పావు! అదే నిజం! వస్తా! (వెళ్ళిపోతాడు).

కృపా : (పుస్తకం రాక్‌లో పెట్టి ముసలయ్యకోసం చూచి టయిము చూచి విసుగ్గా నిట్టూర్చి లోనికి వెళుతూ వుంటుంది.

ముస : (బయటనుంచి గబగబా వచ్చి) వచ్చాడమ్మా!

కృపా : (వెనకకు తిరిగి అనుమానంగా) ఎవరు ముసలయ్యా?

ముస : ఆ దేవమ్మా! మంగలి పద్దయ్యా!

కృపా : (కోపంగా చూచి-చూచి-ఫక్కున నవ్వి) ముసలయ్యా నీకు మరీ మతిపోతూ వుందేం!

రిక్షాను పిలుచుకు రమ్మంటే మంగలిని తీసుకు వచ్చావా? చెప్పినదానికీ చేసినదానికీ యేమైనా సంబంధ ముందా?

ముస : (సిగ్గు పడుతూ) మన్నించండి!

కృపా : ఎన్నిసారు లీ మన్నించడాలు?

ముస : (జాలిగా) అయ్యగారు తిరిగి వచ్చినట్టు— గడ్డం మాసివున్నట్టు ఏదో అనుకొంటూ మీ మాట మరచిపోయి మంగలిని పిలిచానండి!

కృపా : మహాఘనకార్యం చేశావులే గాని—యిప్పటికైనా త్వరగావెళ్ళి రిక్షాపిలుచుకురా. టయిము కావచ్చింది.

ముస : అలాగేనండి! (వెళుతూవుంటాడు)

కృపా : ముసలయ్యా!

ముస : (వెనక్కి వచ్చి) ఏవంటమ్మా?

కృపా : చెప్పింది జ్ఞాపకముందా?

ముస : ఇంతలోకే మరిచిపోతానా అమ్మా? రిక్షా కదూ కొని తెమ్మన్నారు!

కృపా : (చిరాకుగా) కర్మ! కొని తేవటం కాదోయ్! ఒక రిక్షా పిలు. అవతలివీధికి వెళ్ళివచ్చి అద్దె యిచ్చేదాం.

ముస : అలాగేనండి! (వెళ్ళిపోతాడు)

కృపా : (రేడియో ట్యూన్ చేస్తూవుంటుంది—అస్పష్టమైన పెద్ద పెద్ద ధ్వనులు వస్తూవుంటాయి)

రహ : (బయటనుంచివచ్చి) సలాం హండీ హమ్మాగార్!

కృపా : (రేడియో కట్టేసి వెనక్కి తిరిగి) ఎవరూ?

రహ : హమ్మాగార్ మాకీ మర్చారూ క్యా?

కృపా : (కంగారుగా) ఏమిటి?

రహ : హింద్లో హమ్మాగార్ గాబ్రాచేస్తున్నార్.

కృపా : (సంకోచంగా) ఎవరు నువ్వు?

రహ : దేఖ్నా నైతూ? (ముందుకువచ్చి) కళ్ళు కనిపించటం లేదా?

కృపా : (సీరియస్‌గా) నోరుముయ్!

రహ : (వెటకారంగానవ్వి) మళ్లాకుయ్!

కృపా : (భయంగా) ఎవరికోసం వచ్చావ్?

రహ : (నిర్లక్ష్యంగా) తమరికోసమే! వచ్చావ్!

కృపా : ఏమిటీ త్రాగుబోతు పేలాపన?

రహ : ప్రేమకోసం వేగిన మనసులోని ఆలాపన!

కృపా : (కోపంగా) పళ్ళుపొగరెక్కిందా?

రహ : (బింకంగా) వళ్ళు తెలియని గగనంలో గుల్లుతూ వున్న నీకళ్ళప చిల్లిగవ్వకు కాకుండా వెల్లినవాళ్లు కనిపిస్తే పొగరెక్కదూమరి? కాళ్ళదగ్గరకు వచ్చాననా పళ్ళుకొరికి మాట్లాడుతున్నావు.

కృపా : ఎందుకు నీరాకడ?

రహ : మనుపురాని పోకడ—

కృపా : వాగకిక్కడ బయటకుపో

రహ : దాగుడుమూతలాడకు, నాతో రా!

కృపా : (భయంగా) ప్రసంగాన్నావు-ఎవరునువ్వు?

రహ : (లాలనగా) నిజంగామరిచావా కృపానువ్వు?

కృపా : (ఉడికిపోతూ) తెలివితప్పి యేమిటాపిలుపు?

రహ : (నవ్వుతూ) అలవాటుతప్పని వలపులపిలుపే!

కృపా : (బెదురుతూ) వలపులా? కళ్లు తెరచే మాస్తున్నావా?

రహ : కలలు కాదు. చూస్తూవుంటే కళ్లు మూసుకుపోతున్నాయి. (ముందుకు వస్తుంటాడు)

కృపా : (గట్టిగా) పోబయటికి!

ముస : (బయటనుంచి గట్టిగా) వస్తున్నానమ్మా! (బయట కారుహారన్ వినబడుతుంది. ముసలయ్య వస్తాడు)

రహ : హమ్మాగార్ మాకీ జర్రా దయా సూపాయ్లా హండీ మాకీ నౌక్రీ హిస్తే మీకీ సేవా సేస్తాం! హుస్టీ ధఫా మాకీ సూసండీ మీకీ తెలుస్తుంది!

కృపా : (బెదురుతూ కోపంగా చూస్తూ వుంటుంది)

ముస : (రహమాన్ వంక అదోక మాదిరిగా చూచి) అరుగోనమ్మా సుజాతమ్మగారు మీకోసం కారేసుకు వచ్చి వీధిలో వున్నారు. మిమ్మల్ని త్వరగా రమ్మంటున్నారు. కారులో తీసుకువెళతాను సైకిలెందుకులే అన్నారమ్మా!

కృపా : (వింతగా) సైకిలా?

ముస : అదేనమ్మా సైకిలురిక్షా!

కృపా : (చురచుర చూచి బయటకు వెళుతూవుంటుంది)

ముస : (రహమాన్‌తో) ఎవరు నువ్వు ?

కృపా : (ఆగి వెనక్కి తిరగకుండానే) ఎవడో తప్ప దాగి తప్పి వచ్చిన ముష్టివెధవ ! పాలేరును పిలిచి బయటకు గెంటించు. (వెళ్ళిపోతుంది. వీధిలో కారు హారన్ దూర దూరంగా విన బడుతుంది)

ముస : (నెమ్మదిగా లోనికి వెళ్ళిపోతూవుంటాడు)

రహ : క్యాజీ ! హెందుక్కా సార్ అంత భయం చేస్తార ?

ముస : (అనుమానంగా) దాగికూడా బాగానే మాట్లాడుతున్నావే !

రహ : నైజీ ! మై తాగ్వ లేదయ్యా !

ముస : అమ్మగారెప్పుడూ అబద్ధమాడరు.

రహ : ఆ సంగతీ హాళ్లాకు తెల్వాలా ! (ఫొటో దగ్గరకు వెళతాడు)

ముస : నువ్వెవరసలు ?

రహ : క్యాబోల్నా సాబ్ ! దారి తప్పిన ఫకీర్ను వయ్యా !

ముస : అయితే ఫకీరూ యిక్కడి కెందుకొచ్చావ్ ?

రహ : కుచ్ నైసాబ్ ! నౌక్రీ దొరుకుతుందీ హానీ—

ముస : ఏంచేస్తావు నువ్వు !

రహ : హలాక్టీ యేంటండీ—హన్నీ చేస్తాంసార్ :

ముస : పిల్లల్ని చేస్తావా ?

రహ : (అనుమానంగా) పిల్లలీక్కి క్యాచెయ్‌వాలా సాబ్ !

ముస : పిల్లలను ఆడించటమయ్యా! (ఆలోచించి) మాయింట్లో పిల్లలెవరున్నారు? ఓ! అన్నట్టు పిల్లలు లేరుగా! పోనీ కారునడుపుతావా?

రహ : బహుత్ అచ్ఛాగా నడుపుతాం సార్! (ఫోటోతీస్తాడు)

ముస : అయితే అయ్యగారితో చెపుతాను! ఆనకరా!

రహ : హేమ్టిా చెబ్తారుసార్!

ముస : ఓ సన్నాసి వచ్చాడు!-

రహ : సన్నాసిక్యాజీ! సాయీబూ అని చెప్పండి!

ముస : గెడ్డంచూచి సన్నాసి. అనుకొన్నానులే! సాహేబు వచ్చాడు-చాలా మంచోడు-

రహ : మనకారు మీదా హుంటాడు-

ముస : అంటాను!

రహ : అచ్ఛాజీ! (పటంజారి క్రిందబడి పగిలి పోతుంది)

ముస : ఏం జరిగింది! (దగ్గరకు వస్తాడు)

రహ : చేయికీ జారిపోయింది సాబ్!

ముస : చేతులారా జారవిట్టావు! ఇకలాభం లేదు. (పెంకులు ఏరుతూ వుంటాడు) ఫ్రాద్దుటే పగిలిపోయింది.

రహ : హదివాంతా మేరా నశీబ్ లేవయ్యా!

ముస : అసలీ ఫోటో యెందుకు తీశావు? (యెప్పటి చోటులో పెట్టేస్తాడు)

రహ : (బాధగాచూచి) హమ్మగార్ . . .

ముస : ఎరుగుదువా అమ్మగారిని.

రహ : నై! నై! నాకీ యింతక్కా ముందూ పన్జేసిన ఆఫీసర్ కా హమ్మగార్ హచ్చంగా హిట్లాగే వుండేవార్! ఎన్నపూసలాంటి తల్లి క దయ్యా! పాపం చచ్చి హెక్డా వుందో హేమ్టో! (పటంవంక కోపంగా మాస్తుం టాడు)

ముస : అందుకు ఏడుస్తా వెందుకు ఆనందించక! ఓ! అన్నట్టు చచ్చిపోయింది కదూ! నీపేరేమిటి?

రహ : రహమాన్.

ముస : రసగుల్లాలా వుంది.

రహ : ఏక్ బాత్ హైజీ!

ముస : నాపేరా?

ముస : హదికాద్వయ్యా! మనహయ్యగారికీ దర్గా హేమాత్రం నిల్వాహుందంటావ్!

ముస : రెండు లక్ష లంటారు!

రహ : అల్లాహో అగ్బర్!

ముస : అంటే ఏమిటిసాయిూబూ!

రహ : హది మీకీ హెందుక్కా లేవయ్యా! పోనీక వస్తాం హయ్యగారికి చెప్పివుంచండి!

ముస : వచ్చేటప్పుడు బూరెలమూకుడు పట్టుకురా!

రహ : (వింతగా) క్యాజీ?

ముస : ఓహో! నువ్వు సైతానువు కదూ!

రహ : సైతాను క్యాజీ - రహమాన్ కా బోలో రహమాన్.

ముస : అదేలేవయ్యా! కారు డ్రైవర్ అనుకొన్నాను

రహ : అరె వాల్లా మై డ్రైవర్నే సాబ్!

ముస : అబ్బబ్బా : నా మతిపోగొట్టకు! సుజాతమ్మకు పంపించటానికి మిఠాయి చేయించాలంటే బంగారమ్మను బూరెల మూకుడు పట్టుకు రమ్మన్నాను! సరే నువ్వు వెళ్ళు!

రహ : అచ్ఛా! మైజావుంగా! (వెళ్ళిపోతాడు)

ముస : అసలు మా కారుకే డ్రైవర్ లేక చస్తూవుంటే వీడొక డొస్తాడట! (కూనిరాగాలు తీస్తూ పగిలిన అద్దం పెంకులు ఏరుతూవుంటాడు.)

గోపా : (వస్తూనే) ఏమిటి ముసలయ్యా! ఒకటో తారీఖు సాయంకాలం వున్న గుమాస్తా పెళ్ళాం లాగ ఊహాగానం చేస్తున్నావు!

ముస : మీరా?

గోపా : అబ్బేకాదు! (కూర్చుంటాడు)

ముస : ఫరవాలేదు కూర్చోండి!

గోపా : (వెటకారంగా) ఉహూ! పడుకొంటాను!

ముస : పైలా పచ్చీసులో వున్నారు పరాచి కాలాడరూ మరీ?

గోపా : చాలా మంది పెద్దలకు లాగే నీకు కూడా చెవులేగాని కన్నులు పనిచేయటం మానేసి నట్టున్నాయి.

ముస : ఏం బాబూ?

గోపా : ప్రత్యక్షంగా చూస్తూ మీరా అని అడగటం కూర్చున్న వాడి నింకా కూర్చోమనటం-యేవిటి దంతా నిద్రపోయే కుర్రాడికి కునికి పాట్లుపడే మేష్టారు చెప్పే పాఠం లాగ!

[వీధిలో కారు హారన్ మ్రోగుతుంది]

ముస : బాబుగారు వచ్చినట్టున్నారు! (పెంకులు పట్టుకొని వీధిలోకి వెళతాడు)

గోపా : (ముసలయ్యవంక చూస్తూ) ఇన్నాళ్ళకు నీ మెదడు ఇంత చురుకుగా పని చేయటం యీ నాటికి చూశానురా నాన్నా!

[రంగనాథం ముసలయ్య తిరిగివస్తారు]

గోపా : అదేమిటి బ్రదర్! జూదంలో ఓడిపోయిన ధర్మరాజులాగ విచారంగా ప్రవేశిస్తున్నావు.

రంగ : జీవితంలో ఓడకుండా వుంటే జూదంలో ఓడినా ఫరవాలేదు. (లోనికి వెళతాడు)

గోపా : సరే! మొదలుపెట్టావా వేదాంతం! ముస లయ్యా!

ముస : బాబూ!

గోపా : మీ అయ్యగారు నవ్వటం నువ్వెప్పుడైనా చూశావా?

ముస : ఆయననిది కనపడని నవ్వుబాబూ! నివురుగప్పిన నిప్పు.

గోపా : చచ్చాం! నువ్వూ ప్రారంభించావా వేదాంతం?

రంగ : (కోటు తీసివేసి వస్తాడు) ముసలయ్యా!

ముస : బాబూ!

రంగ : కృప యేది?

ముస : అమ్మగారు గోపాలంగారబ్బాయికి పేరుపెట్ట టానికి వెళ్లారండి!

గోపా : వాట్? మా అబ్బాయికా? ఎవడువాడు? ఎక్కడనుంచి వచ్చాడు? ఎలా వచ్చాడు? క్షణం క్రితంలేని అబ్బాయి యిప్పుడెలా వచ్చాడయ్యా నాయనా?

రంగ : ముసలయ్య సంగతి నీకు తెలుసుగా! యే క్షణంలో యేది జ్ఞాపకంవస్తే అదే అనే స్తాడు! అలాగే చేసేస్తాడు! ఇంతకూ మీ వదిన యేది?

గోపా : మై గాడ్! ఆవిడ ప్లీడరుగారింటికి పేరంటా నికి వెళ్ళిందయ్యా!

ముస : (సిగ్గుపడుతూ) అవునండి! ప్లీడరుగారింటికే నండి!

గోపా : ఎలా వేగుతున్నావోయ్ రంగనాథం యీ మితిమీరిన మతిమరుపు ముసలయ్యతోటి?

రంగ : ముసలయ్యా! కాఫీ తీసుకురా!

ముస : (లోపలకు వెళ్ళిపోతాడు)

రంగ : గోపీ! ముసలయ్య యెంత మతిమరుపువాడో అంత మంచివాడు కూడాను. అందుకనే అత నితో వేగలేకపోయినా అతన్ని వదులుకో లేకపోతున్నాం!

ముస : ఏమిటి రంగనాథం! నువ్వీమధ్య ఒక్కరోజు కూడా యింటిదగ్గరుండకుండా తిరుగు తున్నావు?

రంగ : ఏముంది-వ్యాపారం గురించే!

ముస : వేలకు వేలు లాభాలు వస్తున్నా యింకా వ్యాపార వ్యాసంగమేనా?

రంగ : మాకంతకంటే చేయవలసిందీ చేయగలిగిందీ మరేముంది గోపీ?

గోపా : అదేంమాట రంగనాథం! బి. కామ్ పాస య్యావు! బిజినెస్ అంటావా లక్షలమీద సాగుతూవుంది నిక్షేపంగా!

రంగ : అందు కేమంటావ్ !

గోపా : ఇక సంపాదన సంగతి చాలించి జీవితం సంగతి భావించమంటాను.

రంగ : అంటే—?

గోపా : జీవితాన్ని ఆదర్శవంతం చేసుకోవాలి! ఆదర్శ వంతుడు కానివాడు మానవుడనిపించుకోడు.

రంగ : వలచివచ్చిన లక్షాధికారిణికి వలపుల మగడవైన ప్రియురాలిమీద ప్రేమగీతాలు పాడుకునే భావకవివైన నీకుగానీ నావంటి వాళ్లకవన్నీ ఎలా తెలుస్తాయి గోపీ?

గోపా : తెలిసికోవాలయ్యా రంగనాథం! ప్రచండ వేగంతో పురోగమిస్తున్న ప్రపంచంతో బాటు మనం కూడా పరుగెత్తాలి. మారి పోవాలి.

రంగ : మారి-ఏంకావాలి?

గోపా : మానవులం కావాలి?

రంగ : నేనిప్పుడు మనిషేనని నా ఆత్మవిశ్వాసం.

గోపా : ఆదర్శాలకు అంకితం కానివాళ్ళకు ఆత్మ ఎలావుంటుంది?

రంగ : (అతనివంక జాలిగాచూచి నిట్టూర్చి వెళ్ళి రాక్ దగర కూర్చుని పుస్తకంతీసి చదువుతూ వుంటాడు.)

గోపా : ప్రియుడువ్రాసిన ప్రేమలేఖ పెళ్ళాడిన పెనిమిటిచేతిలో పడ్డ పిల్లలాగ అలా చల్లబడి పోయావేం రంగనాథం?

ముస : (ట్రేతో కాఫీతెచ్చి గోపాలం ముందున్న టీపాయిమీద పెడతాడు.)

గోపా : (కప్పు అందుకోబోయి తెల్లబోయి) దేవా! మహానుభావా! శంభోశంకరా! చంపావురా భయంకరా! (సోఫాలో వెనక్కి పడి పోతాడు.)

రంగ : (వింతగా) ఏమిటి గోపీ! (దగ్గరకు వస్తాడు)

గోపా : ఏముంది-చూడు. కాఫీని కమ్మగా పోపెట్టి పట్టుకువచ్చాడు. వెల్లుల్లి, యెండు మిర్చి - జీలకర్ర, శెనగపప్పు - ఓహోహో కాఫీ తాలింపు ఘుమఘుమలాడిపోతూవుంది.

రంగ : (ముసలయ్యవంక జాలిగా చూస్తాడు)

గోపా : చంపావురా నా తండ్రీ.

ముస : (సిగ్గుపడి కాఫీట్రే పట్టుకుపోతాడు)

రంగ : గోపీ! ఈ ముసలయ్య విషాదగాథవిన్నావా?

గోపా : ఏమిటది?

రంగ : ఇరవై సంవత్సరాలక్రితం (బాధగా నిట్టూర్చి) ముసలయ్య భార్యకు జబ్బుచేసి ప్రాణంమీదికి వస్తే మందుకు వెళ్ళటానికి మరెవరూ లేక ముసలయ్యనే పంపించారట మానాన్నగారు. మందుకు బయలుదేరిన ముసలయ్య మందు మాట మరచి దారిలోవున్న సర్కసు దగ్గర ఆగిపోయి మర్నాడు ప్రొద్దుట వట్టిచేతులతో తిరిగివచ్చాడట!

గోపా : అప్పటికి—

రంగ : (బరువుగా నిట్టూర్చి) అప్పటికే జరగవలసింది కాస్తా జరిగిపోయింది. ఉన్న ఒక్క కొడుకూ పసివాడు కావటంవల్ల—తల్లి లేని పిల్లాడయ్యాడని ముసలయ్యకు మళ్లా పెళ్లి చేశారట మా నాన్నగారు:

గోపా : మరి—ఆయిల్లాలేమయ్యింది?

రంగ : వెంకటరామయ్యతో లేచిపోయింది:

గోపా , వెంకటరామయ్యా? అత నెవరు?

రంగ : మా నాన్నగారితో వ్యాపారంచేసే ఒక భాగస్థుడు! నమ్మకంగావుంటూ వ్యాపారంలోని డబ్బంతా పట్టుకొని ముసలయ్య భార్యను తీసికొని రంగూన్ పారిపోయాడు!

గోపా : స్త్రీఆరాధనీయు! ఆమె నలా పతితనుచేసిన మగవాడు పశువు! స్త్రీని అర్థంచేసికోలేని పురుషుడు పరమనీచుడు!...ఇంతకూ ముస లయ్యకొడు కేమయ్యాడు?

రంగ : అంతర్వేది తీర్థం తీసుకువెళ్ళి అక్కడే మరిచి పోయి వచ్చాడట ముసలయ్య! ఆ కుర్రాడి కోసం మా నాన్నగారు చాలా వెదికించారు. కానీ కనుపించలేదు...నీలాగే వాడుకూడా యే పేదరాసిపెద్దమ్మకో దొరికి యే ధన వంతులపిల్లకో ముద్దులమొగుడై వుంటాడు!

గోపా : కానీ నువ్వు చేసిన త్యాగంలాంటి ఘనకార్యం నేను చేయలేకపోయానే అని నా విచారం!

రంగ : త్యాగమా? నేనేం చేశాను?

గోపా : నీవంటి విద్యాధికుడు ధనవంతుడు దిక్కూ మొక్కూ లేని ముష్టిదాన్ని పెళ్ళాడి ఒక జీవితాన్ని సముద్ధరించటమంటే మహాత్యాగం కాదా? లేకపోతే లక్షలు కట్నం తెచ్చే సీతాకోకచిలుకను చేపట్టి వుందువుగా!

రంగ : నేనేదో త్యాగం చేస్తున్నాననీ ఆమె నుద్ధరిస్తున్నాననీ నే నెప్పుడూ అనుకోలేదు గోపీ! కృపాబాయి కారుక్రిందపడి దెబ్బలు తగిలి హాస్పిటల్లోవున్న ఆ పదిరోజులలోనూ ఆమెమీద నాకు జాలితోబాటు అనురాగం కూడా కలిగింది. అందుకే పెళ్ళాడేను.

గోపా : ప్రేమించే పెళ్ళాడేవన్నమాట!

రంగ : ప్రేమసంగతి నాకు తెలియదు! కృప అంటే నా కిష్టం అంతే!

గోపా : అయితే ప్రేమనుగురించి నువ్వింకా త్వరగా తెలిసికోవాలి! నా దగ్గర కొన్ని గ్రంథాలున్నాయి! ఇస్తాను చదువు. ముఖ్యంగా నా గేయ సంపుటి చూడు! మానవతకు, మహోన్నతికి ఆధారమైనదీ, ఆత్మకు సంబంధించినదీ ప్రేమ! అందుకనే అది తప్పక తెలిసికోవాలి!

రంగ : ఏమిటంటావ్ ప్రేమంటే!

గోపా : ప్రాణాలను కూడా త్యాగం చేయించేదే ప్రేమ! నా సుజాతను నేనెలా ప్రేమించానంటావ్? ఆమెకోసం నా ప్రాణాలను కూడా నవ్వుతూ బలిచేయగలను. కానీ అటువంటి అవకాశం నాకు రావటం లేదే అని నా విచారం.

రంగ : నీవటువంటి ప్రేమమూర్తివని—నీ గేయాలు చదివిన వాళ్లు ప్రతివారూ యిట్టే గ్రహిస్తారు.

గోపా : రచనలంటే అలాగే వుండాలి. జీవిత ప్రభావాలు రచనల్లో ప్రతిఫలించాలి. రచయిత తాను ప్రబోధించే ఆదర్శాలను అక్షరాలా ఆచరించాలి. నా రచనల్లో యెక్కడైనా చూడు—స్త్రీ మాతృదేవి ప్రణయమూర్తి! స్త్రీని గౌరవించని సంఘం పూజించని వ్యక్తి పతనం కావలసిందే! మనం ఉన్నతికి రావాలంటే స్త్రీలకుసర్వస్వాతంత్ర్యాలుఇవ్వాలి! అదే మహాదర్శం

రంగ : గోపీ. నీకులా నేను చెప్పలేనుగానీ మహాత్ముడు చెప్పిన వాక్యం మాత్రం జ్ఞాపకం చేయగలను వింటావా?

గోపా : ఏమిటది?

రంగ : మహాత్ముడు – ఆదర్శాల నేవి చెప్పబడవు చేసి చూపించబడుతాయి-అన్నాడట. విన్నావా గోపీ!

[బయట కాలింగ్ బెల్ మోగుతుంది]

రంగ : ముసలయ్యా!

ముస : (వచ్చి) ఏం బాబూ!

రంగ : ఎవరో పిలుస్తున్నారు చూడు!

[మళ్ళా మోగుతుంది]

ముస : (బయటకు వెళ్ళిపోతాడు)

గోపా : అభ్యుదయానికి ఆదర్శాలు అత్యంత అవసరం అని అంగీకరిస్తావు కదూ!

రంగ : కానీ ఆదర్శాల నేవి పుస్తకాలలో చదివితే రావు!

గోపా : చదవకుండా యెలా తెలుస్తాయి.

రంగ : హృదయమున్నవాడు తెలియకుండానే ఆచరిస్తాడు! లేనివాడు తెలిసినా ఆచరించ లేడు.

గోపా : పట్టాలేని చెట్టు క్రింద ప్లీడరులాగ గట్టిగానే వాదిస్తున్నావుగానీ యిక ఆట్టే వేదాంతంలోకి దిగకు!

ముస : (వస్తాడు)

రంగ : ఎవరు ముసలయ్యా వచ్చింది?

ముస : అతనేనండి ఆ గెడ్డం సాయిబు.

రంగ : ఎవరతను?

ముస : మొన్న — ఉహూ — నిన్న — కాదండీ ఇవాళ ప్రొద్దున్న వచ్చి అద్దం బద్దలు కొట్టాడు కదండీ — అతనే!

రంగ : ఎందుకు వచ్చాడు? (పటం పట్టుకొని చూస్తుంటాడు.)

ముస : పిల్లల్ని — (నాలుక కరచుకొని) కారు డ్రైవరంటండీ!

రంగ : అలాగా! రమ్మను! టాక్సీ సమయానికి దొరక్క చాలా యిబ్బందిగా వుంది!

ముస : (బయటకు వెళ్లిపోతాడు.)

గోపా : రంగనాథం! డ్రైవర్ని ఎన్నుకోనే టప్పుడు జాగ్రత్త!

రంగ : ఎందుకని?

గోపా : ఒక్కొక్క డ్రైవరు కారును మానేసి ఓనర్నే డ్రైవ్ చేస్తాడు.

రంగ : కారులాగే ఓనరుకూడా హృదయం లేని యంత్రమైనప్పటి మాట కదూ!

[ముసలయ్య రహమాన్ వస్తారు. ముసలయ్య లోపలకు వెళ్లిపోతాడు.]

రహ : ఆదేకో సలామ్ హుజూర్!

రంగ : నమస్తే! (దీక్షగా చూచి) మొన్న రాత్రి మమ్మల్ని సినీమానుంచి యింటికి తీసుకు వచ్చిన రిక్షావాడివి కదా నువ్వు!

రహ : హావును సార్! మిల్టరీమే, డిస్‌చార్జి అయినాకా మాకీ నౌక్రీ లేక రిక్షాకా లాగుతున్నా సాబ్!

గోపా : స్వేచ్ఛాజీవివి! స్వయంకృషి! తప్పేముంది.

రహ : మీకీ డ్రైవర్ కీ కావాలనీ హినీ—

గోపా : మళ్లా బానిసత్వపు సంకెళ్ళకు బద్ధుడవౌతున్నావ్!

రంగ : నీ పేరేమిటి?

రహ : ఖాన్ రహమాన్ సార్!

గోపా : పేరు దర్జాగా వుంది. సారమెలా వుంటుందో! ఫరవాలేదు. చురుకుగానే వుంటుంది. నవాబుగారి పేరం — ఓహో — నవాసారం!

రంగ : జీతం యెంత కావాలి!

రహ : హదీ మీకీ హిష్టం సార్! లేకిన్ తిండీ బట్టా ఔర్ యిల్లూ హన్నీ మీకే హివ్వాలా సాబ్!

రంగ : అలాగే! నీకింక యెవరూ లేరా?

రహ : నై! కోయీ నై సాబ్!

గోపా : నీకు పెళ్లి కాలేదా?

రహ : నైజీ!

గోపా : అందుకే నీ గెడ్డం అంతబాగా పెరిగింది.

రంగ : వస్తానుండు రహమాన్! (లోనికి వెళతాడు)

రహ : (కృపాబాయి ఫొటోవంక చూస్తుంటాడు.)

గోపా : సిటీ బస్సులో పడుచుపిల్ల ప్రక్కను కూర్చున్న కాలేజిస్టూడెంటులాగ యేమిటో పరాకుచిత్తగిస్తున్నావు.

రహ : (పరధ్యానంగా) జీః హాఁ!

గోపా : రహమాన్!

రహ : సార్!

గోపా : ఒకసారి నవ్వు!

రహ : (అర్థంకానట్లుగా) క్యాబోలే ఆప్?

గోపా : నీకు నవ్వటంచేతకాదా?

రహ : కాదుసార్!

గోపా : నేర్చుకో! నవ్వటంచేతగానివాడు జీవితాన్ని అనుభవించలేడు! పోనీ ఏడవటమైనావచ్చా!

రహ : రాదుసార్! మీకీ నేర్పిస్తారా సాబ్!

రంగ : (వచ్చి) రహమాన్! ఇవిగో వందరూపాయలు. బట్టలు కొనుక్కో! ఇదిగో కారుతాళం! (యిస్తాడు).

రహ : అచ్ఛాజీ! (పుచ్చుకొని) సలాంసాబ్! (వెళ్లిపోతాడు)

గోపా : జీవితమంటే అర్థం తెలుసా?

రంగ : ఏమిటి చెప్పు!

గోపా : నందనవనంలా నవ్వగలిగిందే జీవితం! నవ్వలేని జీవితం నరకం!

రంగ : నరకంలోకూడా నవ్వగలిగిందే నిండుజీవితం!

[కృపాబాయి వస్తుంది.]

కృపా : (వస్తూనే నవ్వుతూ) ఓ! వచ్చారా! ఎంత సేపయింది?

రంగ : ఇంతక్రితమే కృపా! ఎలావున్నాడు పాపాయి?

కృపా : తల్లిపోలిక పిల్లాడు - బంగారంలావున్నాడు.

గోపా : ఓహో! పేరంటంలోని ఆరాటమంతా పాపాయిలమీది అప్యాయతచేత నన్నమాట!... శీఘ్రమే...

కృపా : (నవ్వి) ఆ! ఆ! అది సరేగాని గోపీ! సుజాతను మరీ సీతాకోకచిలుకలా తయారుచేస్తున్నావే!

రంగ : స్త్రీలకు చిలుకలకూ తేడా యేముందాఅనీ! అయినా అక్కయ్యే రామచిలుకయితే చెల్లెమ్మ సీతాకోకచిలుక అవటంలో తప్పేముంది?

కృపా : మీరు స్టేషన్నుంచి యెలావచ్చారు?

రంగ : వైజాగ్ నుంచే కారులో వచ్చాను!

కృపా : ఎవరికారులో!

రంగ : మాస్నేహితుడు రాజారావు ఇక్కడ సి. ఐ. డి. ఇన్స్పెక్టర్ గా పని చేస్తున్నాడని చెప్పానుగా. అతనికారులో—

గోపా : అబ్బా అతనికారులో యెలా కూర్చున్నావోయ్! సి. ఐ. డి. పేరు వింటేనే నాకసహ్యం!

రంగ : ఏం?

గోపా : నమ్మకమనేది వుంటుందని వాళ్ళెప్పుడూ నమ్మరు.

కృపా : మీ కిలా యెరువుకారులు దొరుకుతున్నంతకాలం మనకారుకు డ్రైవర్ దొరకడు! ఎల్లుండి సుజాత పుట్టిన రోజు పండుగ! అక్కడికి నేనెలా వెళ్ళాలి? ముసలయ్యను రిక్షా పిలవమంటే—

గోపా : కంగారు పడకు వదినా: డ్రైవరు దొరికాడులే!

కృపా : (సంతోషంగా) నిజంగానా?

రంగ : నిజమే కృపా!

కృపా : (పగిలిన పటం చూచి—త్వరత్వరగా దాని దగ్గరకు వెళుతూ) అరే అద్దం పగిలిపోయిందే! (పట్టుకొని సర్దుతూంది)

రంగ : అవును కృపా! రహమాన్ పోగొట్టాడట!

కృపా : రహమాన్? ఎవరతను?

రంగ : అతనే మనకారు డ్రైవర్: ఇంత క్రితమే వచ్చి పనిలో కుదిరాడు!

కృపా : (సంతోషంగా) అమ్మయ్యా! ఇన్నాళ్ళకు మళ్ళా యివాళ కారులో షికారు వెళతామన్నమాట! గోపీ సుజాతనుతీసుకుని మీ కారు వేసుకురా! చూదాం యెవరి డ్రైవరు తెలివైనవాడో!

గోపా : వదినా! నీ పుణ్యమా అంటూ రంగనాథం డ్రైవింగు లైసెన్సు కాన్సిలయ్యింది కాబట్టి నువ్వే డ్రైవింగు నేర్చుకొంటే యీ డ్రైవర్ల బాధ తప్పేదిగా వదినా!

రంగ : మీ వదినకు డ్రైవింగు నేర్పి ఆశ్రయం దొరికిన యీ అనాథునికి అన్నం లేకుండా చేయాలనుకొంటున్నావా గోపీ!

కృపా : మీ అన్నగారికారు— ఎన్ని దిక్కులేని జీవితాలకు ఆశ్రయ మిస్తూ వుందో చూశావా గోపీ! ఆ నాడు నేనలా కారు క్రింద పడకపోతే—

గోపా : అది సరేగాని వదినా యింత పెద్దదానవు కారు క్రింద యెలా పడ్డావ్?

కృపా : (బరువుగా నిట్టూర్చి) ఏం చెప్పమంటావ్ గోపీ! (పటంవంక చూస్తూ దగ్గరకు వెళుతూ) ఆ నాటికి నేనన్నం తిని యెన్నాళ్ళయిందో! (రేడియో మీద చేయివేసి ముందుకు వస్తూ) ఆ ఆకలి నీరసంలో పరుగు పరుగున వస్తూవుంటే స్పృహతప్పి — (దుఃఖంతో రేడియోమీద తలవాల్చి పడిపోతుంది. చేయి తగిలి రేడియో మీద వున్న పటం క్రిందపడి పోతుంది)

గోపా : (పటం వంక చూస్తూ) పోయిందా?

రంగ : (పటం తీసి) పోయేది యింతకుముందే పోయింది! ఇక యిందులో పోయేదేమీ లేదు: (పటాన్ని యెప్పటిలా పెట్టేస్తాడు)

గోపా : వదినా! అసలు పరుగెత్తటం దేనికి?

రంగ : నేను చెపుతాను విను. కూతురును పెళ్ళాడుతా డనుకొన్న దూరపు బంధువు అకస్మాత్తుగా మాయం కావటంతో కృపాబాయి తల్లి పిల్లకు పెళ్ళికాదనే బెంగతో — దారిద్ర్యంతో - కృంగిపోయి చనిపోయింది. ఆకలితో అలమటించే కృపాబాయికి అన్నమైనా పెట్టని పాడుసంఘం రక్షించలేని ఆమె నిండుయౌవనాన్ని అనుభవించటానికి ప్రయత్నించింది. ఫలితం దక్కలేదని బలవంతాని కుపక్రమించింది. వెంటాడింది. ఆనాటి అర్ధరాత్రి యింటిలో జొరబడ్డ ఒక పెద్దమనిషి మదాంధకార మలినహస్తాలనుంచి తప్పించుకొని పారిపోతూ పరుగెత్తుకువచ్చి వీధి మలుపులో మనకారు క్రింద పడిపోయింది యీ కృపాబాయి!

గోపా : అయితే వదినా—నాన్న కొట్టినందుకు అమ్మదగ్గర అణా పుచ్చుకొన్న కుర్రాడిలాగ తన్నితే బూరెలబుట్టలో పడ్డావన్నమాట!

కృపా : ఇక లేవండి! భోజనం చేదాం! రా గోపీ!

గోపా : వెరీ సారీ వదినా! సుజాత లేకుండా ఒంటరిగా భోజనం చేయుటమే? ఇంపోజిబుల్!

కృపా : అయితే భోజనంచేసి సుజాతను తీసుకురా! ఇవాళ తప్పకుండా మన కారుమీద రొయ్యవర్ క్రీక్ గార్డెన్సుకి షికారు వెళ్లాలి!

గోపా : అలా అన్నావు బావుంది! వస్తా! (వెళ్ళిపోతాడు)

రంగ : (రేడియో ట్యూన్ చేస్తుంటాడు)

కృపా : రండీ! చేయి పట్టుకొంటుంది)

రంగ : (ఆమె నడుం చుట్టూ చేయి చుట్టి లోనికి తీసుకు వెళతాడు) ముసలయ్య కృపాబాయి పటం మరొకటి—పెద్దది తెచ్చి గోడకు తగిలిస్తూ వుంటాడు. వెలుపలనుంచి రహమాన్ కొత్త కాకీ యూనీఫారమ్‌లో వస్తాడు!)

రహ : అరె! ఛోటా పటంకి పోతే బడా పటంకి వచ్చింది భయ్యా!

ముస : ఆ! ఆ! ఆ పేరు కాస్తా నీకే దక్కుతుందిలే!

రహ : నాకీ యేముందీ లేవయ్యా (దగ్గరకు వెళుతూ) (తీయబోతాడు—రాదు) ఘట్టీగా ఖట్టినావ్ సాబ్!

ముస : లేకపోతే నీయంటివాళ్ళ చేతి కందితే క్రింద పడేసి పాడుచేయరూ!

రహ : (వెటకారంగా) అచ్ఛా ముసలయ్యాసాబ్! యీ సార్కీ లాగితే తాడుకీ తెగకుండా మేక్కీ ఊడిరావాలయ్యా. బహుత్ ఘట్టీగా ఖట్టీనావ్ సాబ్!

రంగ : (వచ్చి) రహమాన్!

రహ : సార్! కారు తీయమంటారా సార్!

రంగ : అక్కరలేదు! ఇక్కడికే సి. ఐ. డి. ఇన్‌స్పెక్టరు రాజారావు దగ్గరకు వెళ్ళివస్తాను! సైకిలు బయటపెట్టు!

రహ : (కంగారుపడి ముఖం దాచుకొంటూ) జీ! (బయటకు వెళ్ళిపోతాడు)

రంగ : (బయటకు వెళతాడు)

ముస : (చిన్న పటం పట్టుకొని లోనికి వెళుతూ వుంటాడు)

కృపా : (ఎదురు వచ్చి) అయ్యగారు కారుమీద వెళ్ళారా!

ముస : లేదమ్మా సైకిలుమీద వెళ్లారు!

కృపా : డ్రైవరున్నాడా?

ముస : షెడ్డులో వుంటాడు! పిలవమంటారా?

కృపా : (టయిముచూచి) అప్పుడే అక్కరలేదులే! నీపని చూచుకో!

ముస : (పటంపట్టుకొని లోనికి వెళ్ళిపోతాడు)

కృపా : (పుస్తకంతీసి చదువబోతుంది. మనస్కరించక పుస్తకంవూసి రేడియో ట్యూన్ చేయబోతుంది గోలగోలగా వుంటుంది. రేడియోకట్టేసి వీధిగుమ్మందగ్గరకు వెళ్ళి) డ్రైవర్......డ్రైవర్......(వెనక్కి తిరిగి వచ్చేస్తూవుంటుంది.)

రహ : (వచ్చి) పిలిచారనుకొంటాను అమ్మగారు!

కృపా : (చటుక్కున వెనక్కి తిరిగి చూచి-భయపడి కంగారుగా) నువ్వా!

రహ : ఆ!

కృపా : నువ్వా!

రహ : ఆ—ం!

కృపా : నువ్వా మా కారుడ్రైవర్ !

రహ : అవును నేనే!

కృపా : (కంగారుగా) ఏమిటీమోసం?

రహ : జీవితపథాల వ్యత్యాసం!

కృపా : (బెదురుతూ) కపటవేషం—!

రహ : అవును—నీకోసం! మందహాస సుందరమైన నీ అరవిందవదనం చూచి యెన్నాళ్లయింది! (ముందుకు వస్తాడు.)

కృపా : (భయంతో చూస్తుంటుంది పెదవులు వణకుతూ వుంటాయి.)

రహ : నవ్వితే గులాబిపువ్వులా విరిసే నీ సొంపులు నింపే వంపుల పెదవులు భయంతో వణకే టప్పుడుకూడా యెంత వయ్యారాన్ని ఒలక బోస్తున్నాయో నీకు తెలుసా!

కృపా : (కళ్ళవెంట నీళ్ళువస్తుంటాయి — వెనక్కి నడుస్తూవుంటుంది.)

రహ : చిక్కని వెన్నెలలు వెలయించే నీ కాటుక కన్నులలో కన్నీటిధారలు కనుపించనీయకు కృపా!

కృపా : (దుఃఖాన్ని దిగమ్రింగుతూ) నువ్విక్కడి కెందుకొచ్చావు?

రహ : ఎందుకొస్తానో నీకు తెలియదా? నన్ను చూడగానే నవ్వుతూవచ్చి వళ్ళో వాలి పోతావనుకొన్నానుగాని యింత మనసు లేకుండా మాట్లాడతావనుకోలేదు కృపా!

కృపా : (ఏడుస్తూ) వేణూ! నా బ్రతుకును బండలు చేస్తావా వేణు!

రహ : (వెగటుగా నవ్వి) ఇంతకాలం బావా అని పిలిచే నీ మేనత్తకొడుకు ఈనాడు నీ కారు డ్రైవర్ అయ్యాడనా బావా అనటం మాని పేరుపెట్టి పిలుస్తున్నావు. మంచిది! కాని యెందుకీ అక్కరకురాని యేడుపు?

కృపా : నిన్ను చూస్తే నాకు భయం!

రహ : ప్రణయం ప్రళయంగా మారిందా? ఎందుకు భయం!

కృపా : నువ్వెంతటి దారుణమారణానికైనా తెగించ గలవని నాకు తెలుసు. మన యిద్దరిమధ్య యెన్నడూ లేని యేకల్లబొల్లి అవినీతి సంబంధాలు కల్పించిచెప్పినా లోకంనమ్ముతుంది. నన్ను నిలువనీడలేకుండా తరుముతుంది. నీకు వెయ్యినమస్కారాలు! దయచేసి నాజీవితాన్ని నాశనంచేయకుండా వెళ్ళిపో వేణూ!

రహ : (వెటకారంగా నవ్వి) వెళ్ళిపోవాలా? యెక్కడికి?

కృపా : (ఏడుపుమాని) నీ యిష్టంవచ్చిన చోటికి!

రహ : నీకిష్టమైనచోటేదో చెప్పు!

కృపా : (అనుమానంగా) అదేమిటి?

రహ : అవును. నీకిష్టమైనచోటేదో చెప్పు! నువ్వూ వస్తావుగా!

కృపా : (గతుక్కుమని--భయంగా) వే—ణూ—!

రహ : నువ్వురాకుండా నేనెక్కడికి వెళతాను?

కృపా : (ఏడుస్తూ) వేణూ!

రహ : (వికృతంగా నవ్వి)నువ్వురాకపోతే యెలాగ? మనఅమ్మాయి నీకోసం బెంగపెట్టుకొందిగా!

కృపా : వేణూ! గట్టిగాఅరచి దుఃఖంతో సోఫాలో పడిపోతుంది)

[బయట సైకిలుగంట వినబడుతుంది]

రహ : నీమావగారు మాఆస్తినంతా దోచుకొంటే నువ్వూ నీమొగుడూ కలసి మాసగం వాటా ధనాన్నీ అనుభవిస్తున్నారు కదూ! సరే చూస్తాను! (కోపంగా కుర్చీని తన్ని పడగొట్టి చరచరా బయటకు వెళ్ళిపోతాడు.)

రంగ : (బయటనుంచి వచ్చి-చూచి— ఆత్రుతగా) కృపా! (భుజం కుదుపుతూ) కృపా!

కృపా : (భారంగా లేచి కూర్చుంటుంది)

రంగ : అదేంకృపా అలావున్నావు? ... ఇదేమిటి కుర్చీ యిలాపడిపోయి వుందేం?

కృపా : చూచుకోకుండా నడిస్తే కాలికితగిలి పడి పోయింది.

రంగ : కాలుజారిపడ్డావా ?

కృపా : లేదు. కాలుజారనూ లేదు. నేను పడనూ లేదు. నా కాలికితగిలి అదేపడిపోయింది.

రంగ : (కాలుపట్టుకొని) కాలికి గాయంతగిలిందా

కృపా : (అతనిచేతిని తనచేతుల్లోకితీసుకొని) గాయం! కనుపించేగాయం కాదులెండి!

రంగ : కళ్ళవెంట నీళ్లుకూడా వస్తున్నాయి! గట్టిగానే తగిలివుంటుంది. లే! లేడీడాక్టర్ సరోజినికి చూపిద్దాం!

కృపా : అక్కరలేదండీ! ఎప్పుడో మానిపోయిందనుకొన్న చిన్నప్పటిగాయం మళ్ళీ మెరిగింది! అంతే! ఇప్పుడేమీ లేదులెండి! (పైట చెంగుతో కళ్లుతుడుచుకొంటుంది)

రంగ : అయితే! లే! త్వరగా డ్రెస్ చేసికో! గోపీ సుజాత వచ్చేస్తారు; కారుమీద షికారు వెళదామన్నావుగా!

కృపా : (బలవంతంగా నవ్వి) ఇంత మిట్టమధ్యాహ్నం షికారేమిటి తర్వాత వెళదాం లెద్దురూ! మీ పిన్నిగారికి జబ్బుగా వుందట రండి చూచి వద్దాం!

రంగ : అలాగే! కారుమీద వెళదామా?

కృపా : (కంగారును అణచి) యెందుకండీ మూడో యింటికి కూడా కారేనా: రండి నడిచి వెళ్లొద్దాం!

రంగ : ముసలయ్యా!

ముస : (వచ్చి) పిలిచారా బాబూ!

రంగ : మేమలా మా పిన్నిగారింటికి వెళ్ళివస్తాం! గోపీ వస్తే అలా చెప్పు.

ముస : అలాగే నండి.

[రంగనాథం కృపాబాయి బయటకు వెళ్ళిపోతారు)

ముస : (పడివున్న కుర్చీ యితర పుస్తకాలు సర్దుతూ వుంటాడు]

గోపా : (వస్తూనే) ముసలయ్యా!

ముస : బాబూ!

గోపా : ఎన్నిసార్లు చెప్పినా బాబును కాని నన్ను బాబూ అంటావేం ముచ్చటయిన పేరు మచ్చుకైనా ఉచ్చరించకుండాను!

ముస : ఏదో అలవాటు బాబూ!

గోపా : అదిగో అదే పొరపాటు

ముస : తాతలనాటి మాట మారాలంటే మాటలా బాబూ!

గోపా : డబ్బు పుచ్చుకొని దొంగ సాక్ష్యం చెప్పటానికి బోనెక్కిన పెద్దమనిషిలా బాగానే చెప్పావుగాని—ముసలయ్యా—

ముస : అయ్యా!

గోపా : మారాలయ్యా! పారిజాత పరిమళాలు పరిఢవించే నాగరికతకు కరాలిచ్చి మరామత్తయి మారిపోవాలయ్యా ముసలయ్యా!

ముస : మారటమంటే కాళ్లతోమానేసి చేతులతో నడవమంటారా?

గోపా : కాదోయ్! కాళ్ళతో మాత్రమేనడిచి చేతులను చేతులుగా మాత్రమే ఉపయోగించుకోమంటాను. నేనీ గేయాలన్నీ యెందుకు వ్రాస్తున్నానంటావ్?

ముస : (పరధ్యానంగా) మతిలేక!

గోపా : (సీరియస్‌గా) వాట్!

ముస : మీకు కాదు బాబూ!

గోపా : మరెవరికి?

ముస : మాకు!

గోపా : వరీగుడ్! ఫీజుపుచ్చుకొని పెళ్లికుదిర్చే పెద్దమనిషిలా సర్దిపడేశావు.

ముస : అయితే బాబూ: అందరినీ మారమంటున్నారుకదా ముందుగా మీరుమారేరా?

గోపా : ఆ! ప్రతి అంగుళంలోనూ—

ముస : రంగు వేశారా?

గోపా : బంగారం చేశాను,

ముస : నాకో అనుమానం!

గోపా : ఏమిటూ పెనుబాణం?

ముస : ఇలామనిషిగా మారకముందు మీరెవరండి?

గోపా : (ఉలుక్కుపడి) డామిట్!

ముస : ఆ నేరకం జంతువండి?

గోపా : చెవిటి పెళ్ళాంతో మూగమగడు పెట్టే ఘోషలావుంది మన వ్యవహారం!

ముస : అపచారం! (చెంపలు వేసి కొంటాడు)

గోపా : ఇదో దురాచారం!

ముస : కాదుబాబూ గ్రహచారం!

గోపా : కర్మకిదో సహకారం!

ముస : అదే నా విచారం! అసలే కులంకాని కులం పిల్లను పెళ్ళాడేరుకదా—సుజాతమ్మ అలా తిరగటం—

గోపా : నాగరికత లక్షణం! ప్రతి ఆడది నేర్చుకోవాలి!

ముస : మార్చుకోవటం మానేశా?

గోపా : మార్చుకోవాలయ్యా! అలవాటులు కలకాలం నిలవైతే మురుగుకాలవలా బురదపేరి కరకు కడతాయి.

ముస : సుజాతమ్మ బజారులోకూడా కామరాజుతో కలసి తిరగటం—

గోపా : అధునాతన అభ్యుదయ నాగరికతా సభ్యత! పరాయి పురుషుణ్ణి పలుకరిస్తే చాలు భార్య పాతివ్రత్యం భంగపడిందని బాధపడే పరమ ఛాందసులకు పాఠం చెప్పటానికి ప్రయోగిస్తున్న ప్రథమ ప్రయత్నమిది. లోకాన్ని మరామత్తు చేస్తున్నానోయ్!

ముస : కాకికి సంగీతం నేర్పిస్తారా?

గోపా : కోకిలగా మార్పిస్తాను!

ముస : తమరు కొంగయి పోగలరు జాగ్రత్తబాబూ!

గోపా : నావంటి పురోగాముల అభ్యుదయ భావాలు నీవంటి వృద్ధులకు అర్థంకావులే! మా ఆదర్శాలు హృదయైక అనుభూతాలు!

ముస : ఏవో పెనుభూతాలు:

గోపా : ఆగని ఆదర్శ జలపాతాలు మలముకొన్న మనుగడలే పునీతాలు. మరువరాని నవనీతాలు. మీదృష్టిలో కలుషితాలు:...ఇంతకూ వదినా రంగనాథం కనుపించరేం?

ముస : అయ్యగారి పిన్నికి జబ్బుచేస్తే చూడటానికి వెళ్లేరు బాబూ! ఇంకా రాలేదు.

గోపా : అయితే ఆనకవస్తా! (వెళ్లిపోతాడు.)

కృపా : (వచ్చి) ముసలయ్యా!

ముస : బాబూ!

కృపా : నేనోయ్ నిన్ను పిలిచింది!

ముస : మన్నించండి! గోపాలం బాబు అనుకొన్నాను.

కృపా : గోపీ వచ్చాడా? (పుస్తకం తీసి సోఫాలో కూర్చుంటుంది)

ముస : ఇప్పుడే వెళ్లారు:

కృపా : నేను రమ్మన్నానని చెప్పి ఒకసారి సుజాతను పిలుచుకురా!

ముస : అలాగేనండి! (వెళుతూ వుంటాడు)

కృపా : ముసలయ్యా!

ముస : (వెనక్కి తిరిగి) ఏవమ్మా!

కృపా : ఏం చేస్తావ్?

ముస : పిలుచుకొస్తానండి!

కృపా : ఎవరిని?

ముస : మన...మన...

కృపా : సుజాతను

ముస : అవును. సుజాతగారినే

కృపా : సరే! వెళ్లిరా!

ముస : (వెళ్లిపోతాడు)

కృపా : పుస్తకం రాక్‌లో పెట్టేసి లోనికి వెళుతూ వుంటుంది)

రహ : (చరాలునవచ్చి) ఆగక్కడ!

కృపా : (త్రుళ్లిపడి ఆగిపోయి వెనక్కి తిరుగుతుంది)

రహ : (వెటకారంగా నవ్వుతాడు)

కృపా : (వెళ్లిపోబోతుంది)

రహ : కృపా!

కృపా : అలా పిలవద్దని చెబితే బుద్ధిలేదూ?

రహ : పిలవాలని ముద్దుగా వుంది కృపా!

కృపా : వేణూ! ఎందుకు నన్నిలా వేడిపిస్తావు!

రహ : నన్ను నువ్వేడిపించవచ్చా?

కృపా : నే నేంచేశాను? నువ్వే నన్ను దగాచేశావు!

రఘు : (వెటకారంగా నవ్వి) నేనా?

కృపా : కాకపోతే నేనా? ప్రేమ ప్రేమంటూ పెళ్ళి కాకుండానే నన్ను అనుభవించాలని చూశావు. నువ్వు పన్నిన పన్నాగాలు పనికి రాకుండాపోయి పెళ్ళాడవలసి వచ్చేసరికి భయపడి పారిపోయావు.

రఘు : అది నీ మంచికే అయ్యింది. లేకపోతే కారు ఓనరు పెళ్ళాని కావటంమాని యీ కారు డ్రైవర్ కమ్ క్లీనరు పెళ్ళానివయ్యేదానవుగా!

కృపా : ఇది నా అదృష్టం!

రఘు : ఇంకెంతకాల ముంటుందిలే ఈ అదృష్టం!

కృపా : (గాబరాగా) అదేమిటి వేణూ?

రఘు : నీభర్త నీ పూర్వగాథ విన్నాక కూడా ఇంకా నీకీఅదృష్టం ఉంటుంద నేఅనుకుంటున్నావా?

కృపా : వినటానికేముంది?

రఘు : వినటానికి ఎంతయినా ఉంది. మధ్యవర్తులు లేని మన ఇద్దరిసంబంధం—

కృపా : నువ్వు నన్ను పెళ్ళాడతానంటే - నువ్వెంత దుర్మార్గుడివో తెలిసీకూడా-అన్న కొడుకువు గదా అని మా అమ్మ అంగీకరించింది. తీరా ముహూర్తం పెట్టి పెళ్ళాడమనేసరికి భయపడి పారిపోయావు! అంతేగా. అంతకు మించి మరేముంది?

రఘు : (నవ్వి) లేకపోవచ్చు. కానీ ఆపదానిమీద చాడీలు చెపితే యేమగాడు వినడు? అందులోనూ అర్ధాంగిమీదయితే అమృతంలా ఆస్వాదిస్తాడు.

కృపా : (బెదురుతూ) ఏమిటి వేణూ. చాడీలా?

రఘు : (నవ్వి) నీ ఆనందానికి బేడీలు. కృపా! మన ఇద్దరకూ ఒక అమ్మాయి పుట్టిందికదూ!

కృపా : వేణూ. (తల పట్టుకొని సోఫాలో పడి పోతుంది)

రఘు : అమ్మాయిపుట్టి చచ్చిపోయిందిలే! (గట్టిగా నవ్వుతాడు)

కృపా : (కంగారుగా లేచి ఏడుస్తూ) వేణూ! నన్నిలా నాశనంచేస్తే నీకేంలాభం వేణూ!

రఘు : ఒకరు నాశనంకాకుండా మరొకరి ఆశ లెలా నెరవేరతాయికృపా? నిన్ను నీ మగడు పొమ్మనేదాకా నేను రమ్మన్నా రావుకదా!

కృపా : నన్నింత గాఢంగా ప్రేమిస్తూ వున్న ఆయన్నిలా మోసంచేయమంటావు వేణూ!

రఘు : వేషం వేయమంటాను. కంట తడిపెట్టకుండా గుండెల్లో మంటపెట్టమంటాను. ఈ అంటూనా రంగనాథం అంటు లేకుండా చేస్తాను. జంటగా ఆనందంపంట పండించుకొందాం. ఏమంటావ్?

కృపా : (భయంతో ఏడుస్తూ) బావా నీపాదాలు పట్టుకొని బతిమాలుకొంటాను. (కాళ్ళదగ్గర కూర్చుని) నా మంగళసూత్రాన్ని మసి చేయకు బావా! జీవితాలతో చెలగాటాలాడి సర్వనాశనం చేయకు బావా! బావా! నీ మేనత్తకూతురునైనా మన్నించు బావా!

రఘు : బావ! ఇప్పటికి తెలిసిందేం నీ బావలోనిచేవ! లేవులే మనకా చుటరికాలు. పోవులే నీవట్టి ప్రియాలు—రావుగా నాచేయిపట్టి కృపా?

కృపా : (ఏడుస్తూ. లోనికి వెళ్ళిపోబోతుంది)

రఘు : (ముందుకువస్తూ) మానం అర్ధాంగీకారం అన్నమాటేగా! నన్నుకూడా లోనికి రమ్మనమనా మాట్లాడకుండా వెళ్ళిపోతున్నావు?

కృపా : (ఏడుస్తూనే కోపంగా) ఆగక్కడ! యీ హాలుదాటి లోపల అడుగుపెట్టటానికి నీకు అర్హత లేదు.

రఘు : ఆ అర్హతకోసమే లోపలికి రావాలనుకొంటున్నాను. చెప్పు వస్తావా రావా నాతో.

కృపా : ఎలా రమ్మంటావ్?

రఘు : అయితే నే నడిగింది యిమ్మంటాను!

కృపా : ఏమిటది?

రఘు : డబ్బు!

కృపా : ఎంత?

రఘు : లక్షరూపాయలు.

కృపా : (చింతగా) లక్షరూపాయలా?

రఘు : అవును. లక్షరూపాయలు. అది కేవలం నాకు రావలసిన సగం వాటామాత్రమే! న్యాయంగా యిస్తావా లేక నాతో వస్తావా?

కృపా : రెండూకూడా జరగనిపనులే!

రఘు : (కోపంగా) ఊఁ! రెండూకూడా జరిగే పనులే! యెలా జరుగుతాయో నాకు తెలుసు! కృపా బీ — రెడీ నాసంగతి బయటపెట్టి నన్నేమైనా చేయించాలనిప్రయత్నించావా జాగ్రత్త! మరుక్షణం రంగనాథం శవం మావీధిగుమ్మంలో వుంటుంది.

కృపా : ఆఁ (కెవ్వున కేకపెట్టి సోఫాలో పడిపోతుంది)

రఘు : (వెగటుగానవ్వి) సిద్ధంగా వుంటావు కదూ తెల్లవారేలోపుగానే మనసంగతి తేలిపోవాలి (చరచరా వెళ్ళిపోతాడు)

రంగ : (బయటనుంచిహుషారుగా వచ్చి చూచి కంగారుగా) కృపా! (ఆత్రంగా దగ్గరకు వెళ్ళి తలనిముకుతూ) కృపా!

కృపా : (వినిపించుకోదు)

రంగ : (బుజం పట్టుకొని లేవదీస్తూ భయంగా) కృపా!

కృపా : (ఉలుక్కుపడిలేచి) వేణూ!

రంగ : (వింతగా) వేణా? ఎవరా వేణు?

కృపా : (కంగారుపడి సర్దుకొని, అబ్బే ఎవరున్నారు? ఎవరూ లేండే (రాని నవ్వు నవ్వుతుంది)

రంగ : (లాలనగా) పుట్టబోయే ముద్దులపట్టికా పేరు పెట్టదలచావా.

కృపా : (బాధగా-కంగారుగా) ఛీ ఛీ! వెధవపేరు! అదేం పేరు?

రంగ : ఏమిటి మరి యీ పగటికలల పలవరింతలు?

కృపా : (పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకొంటూ చాటుగా కళ్ళు తడుచుకొంటుంది)

రంగ : (బుజ్జగిస్తూ) పేరంటానికి వెళ్ళివచ్చినప్పటి నుంచీ ఎందుకిలా వున్నావు? అక్కడెవ రైనా యేమైనా అన్నారా?

కృపా : ఎవరైతేమాత్రం యెందుకంటారండీ?

రంగ : ఎందుకు మరి యీ వేళ ప్రొద్దుటనుంచీ యిలా వున్నావు? డ్రైవర్ దొరకనంతసేపూ ఎప్పుడు డ్రైవర్ వస్తాడా యెప్పుడు కారు మీద షికారు వెళదామా అని తహతహలాడే దానవు డ్రైవర్ వచ్చాక అసలు కారుమాటే తలపెట్టటం లేదేం? జరిగిందేమిటో నాతో మనవిచ్చి మాట్లాడరాదా కృపా! నా మనసు తెలిసీకూడా కూడా యెందుకిలా మాటదాచి మధనపడతావు? చెప్పు కృపా! (గడ్డం పట్టుకొని ముఖం తనవైపు త్రిప్పుకుంటూ వుంటాడు.)

కృపా : (కళ్ళనిండా నీళ్ళతో దుఃఖం ఆగక వెక్కి వెక్కి పడుతూ లోనికి గబగబా వెళ్ళిపోబోతుంది)

గోపా : (కంగారుగా పరుగుపరుగునవస్తూ) మోసం— మహామోసం—

కృపా : (చటుక్కున ఆగిపోతుంది)

గోపా : ఆడదంటే అమృతమనుకొన్నాను. కాదు. హాలాహలం!

కృపా : (వణక్కి తిరుగుతుంది)

రంగ : ఏమిటి గోపీ అది?

గోపా : నిలువునా విషమే! ఆడదాన్ని నమ్మితే పెదవులతీపితో ప్రాణాలనే పీల్చేస్తుంది!

కృపా : (భయంగా ముందుకు వస్తూ) ఏమిటి గోపీ నువ్వు మాట్లాడేది?

గోపా : (వినిపించుకోకుండా) కట్టుకొన్నవాడి కళ్ళు మూసి పరాయివాడితో సరాగాలాడే నీచ బుద్ధి—

కృపా : (కోపంగా) గోపీ!

గోపా : స్త్రీ హృదయం పాషాణం—బడబానలం—

కృపా : (సీరియస్‌గా) ఆపు చేయ్.

గోపా : ఛీ! ఛీ! నిలువునా చీల్చినా నిలబెట్టి కాల్చినా పాపం లేదు—పచ్చి నటన—పరమ నాటకం —తుచ్ఛ—

కృపా : (భయంగా పెద్దగా) ఆపు!

రంగ : ఆవేశపడకు కృపా! శాంతంగా చెప్పు గోపీ-

గోపా : శాంతం! యెలావుంటుంది శాంతం? నీభార్య పరాయివాడిని వలచిందనివింటే నువ్వు శాంతంగా వుంటావా?

కృపా : (ఉద్వేగంతో) గోపీ!

గోపా : చెప్పు రంగనాథం! నీ భార్య పరాయి వాడితో సరాగాలాడుతూవుంటే - వాళ్లిద్దరూ నీయింట్లోనే—

కృపా : (ఉద్రేకంతో) షటప్! (చాచి చెంపమీద కొడుతుంది).

రంగ : ఎంతపని చేశావు కృపా! అసలుసంగతి వినకుండా యెప్పుడూ లేనిది యెందుకొచ్చింది నీకీ తొందర?

కృపా : (దుఃఖం ఆపుకోలేక ముఖం దాచుకొని లోనికి వెళ్లిపోతూ వుంటుంది).

గోపా : (చెంపపట్టుకొని) తనజాతిని అన్నందుకు వదినకింత కోపం వచ్చిందిగానీ—సుజాత చేసిన పనిని యెలా సమర్థిస్తుంది?

రంగ : సుజాతా? యేం చేసింది?

కృపా : (అనుమానంగా - వెనక్కి వస్తూ) సుజాతా? సుజాత విషయమా నువ్వు చెప్పేది?

గోపా : మరొకరి విషయం నాకెందుకు వదినా?

కృపా : (బాధగా—జాలిగా) గోపీ!

గోపా : వదినా! స్త్రీలంతా నీవంటి ఆదర్శవనితలే అనుకొన్నాను గానీ—సుజాతవంటి మోసగత్తెలు, భర్తృవంచకురాళ్లు....

కృపా : (దుఃఖంతో) గోపి! (ఏడుస్తూ త్వరత్వరగ లోనికి వెళ్లిపోతుంది.)

రంగా : (నిట్టూర్చి) ఇప్పటికైనా చెప్పుతావా సుజాతచేసిన తప్పేమిటో—

గోపా : ఆ కామరాజుగాడిని వలచింది- వాడితో—

రంగా : చాలు! ఎలా ఋజువుచేశావ్?

గోపా : ప్రేమలేఖ దొరికింది!

రంగ : ఏది?

గోపా : ఇదిగో! (అంతవరకూ కసిగా నలుపుతూ వున్న కాగితాన్ని విసురుగా కోపంగా రంగనాథానికిస్తాడు).

రంగ : (చదివి) ఇందులో ఎవరి పేర్లూ లేవు! సుజాతకే కామరాజు వ్రాశాడని యెలా చెప్పగలం?

గోపా : వాడిదస్తూరీ నాకు తెలుసు! మాయింట్లో దొరికింది. సుజాతదేయిది! ఛీ! ఛీ! అడవి పులినైనా నమ్మవచ్చుగానీ ఆడదాన్ని మాత్రం నమ్మకూడదు.

రంగ : అలాగని—

గోపా : సుజాతతో తెగతెంపులు చేసికొని వీపు చిట్లగొట్టి వచ్చేశాను—

రంగ : హుఁ! అభ్యుదయ వాదివి! ఆదర్శ జీవివి! ఇంత ఆలోచించకుండా తొందర పడతావనుకోలేదు గోపీ!

గోపా : నువ్వే నాస్థితిలోవుంటే చేస్తావా ఆ ఆలోచన?

రంగ : చేసేవాళ్ళు ఏ స్థితిలోవున్నా చేస్తారు! అదే జన్మ సంస్కారానికీ పుస్తక పఠనానికీ వుండే తేడా!

గోపా : వనోన్మాదించాలని చూస్తున్నావు కదూ! సరే వస్తా! (విసుగుగా బయటకు వెళ్లిపోతాడు)

రంగ : కృపా!

కృపా : (వస్తుంది).

రంగ : ఏమిటి యీ వేళ ప్రొద్దుటనుంచీ మన యింటి వాతావరణం యిలావుంది? సుజాత నిజంగా తప్పుచేసిందా? గోపాలం తొందరపడ్డాడా! ఏదీ అర్థంకాకుండా వుంది! నిన్ను చూస్తే నాకు మరీ భయంగావుంది!

కృపా : (బలవంతంగా పేలవంగా నవ్వి) ఎందుకని?

రంగ : నిర్మల నీలాకాశంలోని ధృవనక్షత్రం లాగా చిలిపి నవ్వుల చిన్నెలతో తళతళ లాడే నీకౌతుక కళ్ళు ఇవాళ ఇలాగ కారు మేఘాలు క్రమ్మిన కాళరాత్రిలా విషాదచ్ఛాయలతో తుషారబంధురమైపోవటానికి గల కారణం నాకెలా తెలుస్తుంది కృపా? ఈ వేళ నీముఖంలో కనుపించే అర్థం కాని ఆవేదన-అంతులేని ఆలోచన తూచిచెప్పగల మాటలు నాకు తోచటం లేదు కృపా! (టయిము చూచి—దగ్గరకువచ్చి గడ్డంపట్టుకొని) అయిదు కావచ్చింది. పోనీ ఒకసారి అలా బీచికి వెళ్ళి వద్దామా కారులో!

కృపా : సుజాత సంగతి యేమయినట్టు? మీరొకసారి వెళ్లి నిజనిజాలు తెలిసికోవటం మంచిదండీ? గోపీవట్టి తొందర మనిషి!

రంగ : ఇవాళ గోపీనే మించి పోయావుగా తొందరలో!

మున : (బయటనుంచి వచ్చి) బాబూ! సుజాతమ్మగారు మిమ్మల నొకసారి వెంటనే రమ్మన్నా రండి.

రంగ : అలాగా! సరే! పదవెళదాం! (ఇద్దరూ బయటకు వెళ్ళిపోతారు!)

కృపా : (కొంత సేపు అలాగే చూచి - బరువుగా నిట్టూర్చి సోఫాలో కూర్చుని పరధ్యానంగా ఆలోచిస్తూ వుంటుంది)

గోపా : (వస్తూనే) ఏమిటి వదినా — పైవాడు పోవాలి—ప్రమోషను రావాలి అని చూచే ఆఫీసరు లాగ మీనమేషాలు లెక్క పెడు తున్నావు?

కృపా : సుజాత మాటయేం చేశావు గోపీ?

గోపా : విడాకు లిచ్చిన పడుచు పెళ్లాంలో బడాయి తెలియని ముసలి మగడులా యెందుకు వదినా సార్థకంగాని సంధిమంత్రాలు అర్థం కాని సామరస్య ప్రయత్నాలు!

కృపా : గోపీ! నువ్వే పొరపాటు పడ్డావేమో!

గోపా : పొరపాటనేది నా విషయంలో కలలోని మాట!

కృపా : స్త్రీ మాతృమూర్తి — ఆరాధనీయ కదూ—

గోపా : అర్థమయ్యింది. నువ్వు నన్ను చెప్ప నక్కర లేదు! యథార్థం గ్రహించాను! స్త్రీ అంటే అర్థం మోసం!

కృపా : అయితే యిక మరే స్త్రీనీ పెళ్ళాడవా?

గోపా : జన్మజన్మాలకూ స్త్రీని దరిచేర నివ్వను!

[రంగనాథం వస్తాడు]

గోపా : ఇకముందు నేను కూడా రహమాన్ లాగా హాయిగా గడ్డం పెంచుకొంటాను!

రంగ : (కృపాబాయి ప్రక్కను కూర్చుని) ఎప్పుడు చూచినా రహమాన్ ఏనాటి ప్రియురాలినో తలచుకొంటూ బాధపడుతూ వున్నట్టుంటాడు కదూ!

కృపా : (ముఖం గోపీ వైపు త్రిప్పుకొంటుంది)

గోపా : సుజాత నాకు చేసినట్టుగానే యేరాత్రో అతని గుండెల కోత పెట్టి వుంటుంది.

కృపా : (మళ్ళా ముఖం ఇటు త్రిప్పుకుంటుంది)

రంగ : స్త్రీ చేయలేని దేముంది? ఆనందంలోని అమృతం—ఆవేదనలోని హాలాహలంకూడా ఆమె చవిచూపించగలదు!

కృపా : (బెదురుతూ నవ్వి—లేచి వెళుతూ) ఏమండీ ఎగ్జిబిషనుకి వెళదామా?

రంగ : నీకిష్టమైతే యేది కాదన్నాను! కారుమీద వెళదామా?

కృపా : వద్దు వద్దండీ! నడిచే వెళదాం సరదాగా!

రంగ : సరే నీ యిష్టం! కారంటే నీకెందుకిష్టంగా కుండా వుందో నా కర్థం కావటంలేదు.

గోపా : వట్టి మనుష్యులుకాని ఆడవాళ్ళ యిష్టా యిష్టాలు విచిత్రంగావుంటాయిలే బ్రదర్

రంగ : గోపీ ఆడవాళ్ళ మనస్తత్వాలు అద్భుతంగా అర్థంచేసికొన్న అభ్యుదయ రచయితవు నీ భార్య మనసునే గ్రహించలేకపోయావే! సుజాత ముందు ఓడిపోయావు. జీవితంలో ఓడిపోవటం—

గోపా : సరేగాని—ఏ విషయంలో?

రంగ : సుజాతమీద నీకు కలిగిన అపోహ లన్నీ అసత్యం!

గోపా : అందుకు ఋజువు!

రంగ : నీకు దొరికిన ఉత్తరం కామరాజు వ్రాసిందే! కాని సుజాతకుగాదు. మీ యెదురింటి వారమ్మాయి తుంగతాయారుకి! కామరాజు మీ యింటికి రావటం మీ స్నేహంకోసం గాదు. మీ యెదురింటి తాయారుకోసం.

గోపా : (ఆత్రుతగా) నీకెలా తెలుసు.

రంగ : నీ ఒక్కడికే తెలియదు. కామరాజు తాయారు పరారయినారుగా!

గోపా : (కంగారుగా) నిజంగానా?

రంగ : యథార్థం గోపీ! సుజాత నీకోసం చూస్తూ వుంది.

గోపా : క్షమించువదినా వస్తాను. బ్రదర్! (వెళుతూ వుంటాడు)

రంగ : మరో విషయం విను గోపీ

గోపా : (ఆగి) ఇప్పుడింకేమీ వినలేను మళ్ళొస్తా (వెళ్ళిపోతూవుంటాడు)

కృపా : సుజాతి నొకసారి తీసుకురా

గోపా : (ఆగకుండానే) ఇప్పుడే తీసికొస్తా. (వెళ్ళిపోతాడు)

రంగ : మరొక ముఖ్య విషయం విన్నావా కృపా

కృపా : ఏమిటది?

రంగ : గోపాలం మన ముసలయ్య కొడుకే

కృపా : (పెద్ద వింతగా) ఆ!

రంగ : అవును కృపా! ఇరవై సంవత్సరాల క్రితం ముసలయ్య అంతర్వేది తీర్థంలో మరచిపోయి వచ్చిన నాలుగేళ్ళ అబ్బాయి మన గోపాలం మహానుభావుడే!

కృపా : ఇప్పుడెలా తెలిసింది?

రంగ : నెల్లాళ్ళ క్రితం బొంబాయి బ్యాంకి దోచుకొన్న దొంగలనాయకుడు ప్రస్తుతం యీ వూళ్ళోనే వుంటున్నాడన్న అనుమానం చేత మా స్నేహితుడు సి. ఐ. డి. ఇన్స్పెక్టరు రాజారావు ఇక్కడే ఇన్వెష్టిగేట్ చేస్తున్నాడు. ఆ దొంగ అసలు ఈ వూరివాడే నట కూడాను. అతని ఫోటోకోసం స్టుడియోలన్నీ వెదుకుతూవుంటే యిదిగో యీ పాత ఫోటో దొరికింది (చూపించి) చూడు! ముసలయ్య నాలుగేళ్ళ గోపాలాన్ని బుజాన్నెక్కించుకొని ఫోటో తీయించుకొన్నాడు!

కృపా : (నవ్వుతూ) ఫోటో తీయించుకొని తెచ్చుకోవటం మరిచిపోయి వుంటాడు ముసలయ్య! గోపీకి తెలుసా యీ సంగతి!

రంగ : చెపుతూవుంటే వినకుండా పరుగెత్తాడుగా! కన్నవాళ్ళకన్న కట్టుకొన్నవాళ్ళే మిన్నగా!

కృపా : ముసలయ్య యింకా రాలేదేం?

రంగ : నిజాన్ని చెప్పి సుజాతను వప్పగించి వచ్చేను! (టయిము చూచి) ఓ: టయిమయ్యింది. ఇక ఆలస్యం చేస్తే మెయిలందదు!

కృపా : (బెంగగా) కారుమీద వెళ్ళరాదటండీ!

రంగ : చాలామంది వున్నాం కలసివెళ్ళాలికృపా!

కృపా : (భయంగా) తప్పకుండా యీ రాత్రికే వెళ్ళాలా?

రంగ : ఒప్పుకొన్నతర్వాత తప్పితే బావుంటుందా?

కృపా : నాకెందుకో భయంగావుంది. ముసలయ్య కూడా లేడు:

రంగ : రహమాన్ యింటివద్దనే వుంటాడుగా!

కృపా : (బెదురుతూ చూచి తలవంచుకొంటుంది)

రంగ : తెల్లవారకముందే. తిరిగివచ్చేస్తాగా! భయం లేదులే! అయినా యింకా నెలలు నిండందే! ఓ! టయిము కొవచ్చింది. (లోనికివెళతాడు)

కృపా : (బాధగా అటు చూస్తూ వుంటుంది)

రంగ : (వెదర్ బేగ్ పట్టుకొనివచ్చి) వెళ్ళొస్తాను! (వెళుతూవుంటాడు)

కృపా : పిస్టలు పట్టుకు పోతున్నారా?

రంగ : అవును! కావాలా?

కృపా : నాదగ్గరుంచటం మంచిదేమో!

రంగ : అక్కరలేదు. పిస్టలులాంటి మనిషి రహమాన్ వున్నాడుగా! ఎవ్వడూ రాడు! లక్షలు పట్టుకువెళుతున్నాం! రాత్రిపూట ప్రయాణం! మాదగ్గరుంచటం అవసరం! వస్తా! టయిమైపోయింది! (తొందరగా బయటకు వెళ్ళిపోతాడు)

కృపా : (బెదురుగా అటువైపే కొంతసేపు చూచి లైట్లు వెలిగించి లోనికి వెళుతూ వుంటుంది)

రహ : (దరదరావచ్చి) ఆగు!

కృపా : (కంగారుగా కెవ్వుమని ఆగిపోతుంది)

రహ : (దగ్గరగా వస్తాడు)

కృపా : (లోనికి వెళ్ళిపోబోతుంది)

రహ : (చటుక్కున అడ్డంవెళ్ళి నిలుచుని) ఇస్తావా లక్షరూపాయలు లేక వస్తావా నన్ను స్వీకరించి!

కృపా : (బింకంగా) నన్ను బెదిరిస్తున్నావా?

రహ : నిర్ణయించుకొనే అవకాశమిస్తున్నాను!

కృపా : ఇవ్వకపోతే సేవక్కరలేదా?

రహ : అక్కర లేదు! సజావుగా డబ్బిస్తే నిజాయి తీగా వెళ్లిపోతాను!

కృపా : నేను వస్తున్నాను! పద వెళ్ళిపోదాం!

రహ : (అనుమానంగా) ఆఁ! వచ్చేస్తావా?

కృపా : అవును పద వెళదాం!

రహ : కట్టుకొన్నవాడి కళ్ళల్లో దుమ్ముకొట్టటం మహాపాపం!

కృపా : నువ్వు నాకేమీ నీతులు బోధించనక్కర లేదు! రా!

రహ : (కోపంగా) వద్దు! నువ్వు నాకక్కర లేదు!

కృపా : ఏం

రహ : పరాయిపురుషుడి సంపర్కంతో గర్భవతి వైన నీవు నా కెందుకు?

కృపా : ప్రొద్దుటనుంచీ ఆ విషయం తెలియకే రమ్మన్నావా?

రహ : (చిరాకుగా) నాకు కావలసింది నువ్వు కాదు! నీ ధనం!

కృపా : ఆ సంగతి నాకు తెలుసు! లేకపోతే నిజంగా వచ్చేస్తాననుకొన్నావా?

రహ : నీతో వాదించడానికి రా లేదు. నా కాలస్య మవుతూవుంది! త్వరగా పట్టుకురా!

కృపా : చచ్చినా ఆ పని చేయను!

రహ : అయితే చావటానికే సిద్ధంగా వున్నావా? (మీదికి వస్తూ) సవ్యంగా యివ్వకపోతే చంపయినా పట్టుకు వెళతాను! (చటుక్కున పైట పట్టుకొంటాడు)

కృపా : (చెంపమీద కొట్టబోతుంది)

రహ : (ఆమె చేయి పట్టుకొని మెలిపెట్టి వెనుకకు త్రిప్పి రెండు చేతులతోను గొంతు పట్టుకొని నొక్కుతూ) చెప్పు! ఎక్కడుంది ఇనప్పెట్టె తాళం చెవి! చెప్పు!

కృపా : (పెనగులాడుతూ) విడిచిపెట్టు!

రహ : (గట్టిగా నొక్కుతూ) త్వరగా చెప్పు! (గట్టిగా నొక్కుస్తాడు)

కృపా : (ఒక్కసారిగా గట్టిగా కేక పెడుతుంది)

రంగ : (చటుక్కున వచ్చి పిస్టలు గురిపెట్టి) విడిచి పెట్టు!

రహ : (కృపాబాయిని విడిచిపెట్టి రహమాన మీదికి రాబోయి పిస్టలు చూచి ఆగిపోతాడు)

కృపా : (క్రింద పడిపోతుంది)

రంగ : (కృపాబాయిని లేవదీస్తూ—రహమాన్‌తో) ఇదిగో లక్షరూపాయలు (లెదర్ బేగ్ యిస్తాడు) పట్టుకువెళ్లు! నీ సంగతి యిప్పుడే విన్నాను! అందుకనే ప్రయాణం మాని తిరిగి వచ్చాను. త్వరగా వెళ్ళిపో! పోలీసులు రాకుండానే వెళ్ళిపో!

కృపా : వద్దండీ! యివ్వకండీ! వాడికెంచి మా ధనం!

రంగ : పట్టుకువెళ్ళనీ! నీకెంచి కాదు! అతను మా నాన్నగారి పార్టనర్ కొడుకు! సవ్యంగా వుంటే నాతో సమానభాగస్థుడయ్యేవాడు! (రహమాన్‌తో) త్వరగా వెళ్ళిపో! కారు మీద వెళ్ళిపో! నీ కక్కరలేనిచోట విడిచి పెట్టు కారు!

రహ : (బేగ్ పట్టుకొని వెళ్ళిపోతాడు. కారు వెళ్ళి పోయిన చప్పుడు—హారన్)

కృపా : (కాళ్ళదగ్గర కూర్చుని) నేను! నేను!

రంగ : (లేవదీస్తూ) నువ్వేమీ చెప్పనక్కర లేదు! నువ్వెటువంటిదానవైనా సరే నిన్ను హృదయ పూర్వకంగా స్వీకరిస్తున్నాను! ఒకసారి ప్రేమించిన వస్తువును జీవితాంతం ప్రేమించ టమే ప్రేమయొక్క పర్యవసానం!

కృపా : (బెదురుతూ) ఒక్కమాట!

రంగ : అక్కర లేదు! నిజానిజాలు నాకు తెలుసు! నీలో యే దోషం లేదు. ఇక ముందామాట మరి తలపెట్టకు! నిన్ను నా జీవితసర్వస్వంగా స్వీకరిస్తున్నాను!

కృపా : (వంగి పాదాలకు నమస్కరిస్తుంది)

రంగ : (తల నిమిరి లేవదీసి లోనికి తీసుకువెళుతూ వుంటాడు)

[ తెర ]

# వక్రగతులు

శ్రీ మధురాంతకం రాజారాం

పరిష్కరింపరాని జటిలసమస్య, సరిదిద్దరాని బ్రహ్మదేవుడి పొరపాటు, బాహ్యపరిస్థితుల ప్రభావం మానవుడిలో ఎంతటి విస్మయావహమైన మార్పు తీసుక రాగలదో లోకానికి తెలియజేసే నిదర్శనం—మురారి!

మురారిని గురించి ఆలోచించగూడదనీ, తలపుల్ని అతడి పైకి ప్రసరించకుండా అరికట్టాలనీ నాలో నేను బాసచేసుకున్న తర్వాత నాలుగేళ్ళ వ్యవధిలో మురారిని మరచిపోవడం అంత సులభం కాదని మాత్రం గ్రహింపగలిగాను. ఒకటి, తలకు ఏదైనా ఆఘాతం సోకి నా మతి అయినా పోవాలి. రెండు, ఇప్పుడున్న పాత ఉడుపును త్యజించి ఈ జీవాత్మ మరో క్రొత్త బొందెలోకైనా తరలిపోవాలి. అందాకా మురారినిగురించిన స్మృతులు మనోవీధిలోనుంచి మాసిపోవడం అసంభవం!

ఒకానొక పీడకల తాలూకు భయంకరస్మృతిలా దాదాపు ఏడెనిమిదేళ్ళనుంచీ ఈ మురారి నన్ను వెన్నాడుతూనే వున్నాడు. అతడి పిడికిట నా జీవిత రహస్యం దాగివుండనిగాదు. అలాటి రహస్యాలేమున్నాయి గనుక! అతడిచేత మానవ రుధిరాన్ని ఆస్వాదించడానికి సిద్ధంగా కైజారొకటి తళతళ మెరిసిపోతోందనీగాదు. నిజానికతడు నా వెంబడి పరుగెత్తి రావడమూ లేదు. కేవలం అతడిని గురించిన ఆలోచనలు, అతడికి సంబంధించిన జ్ఞాపకాలు! అవి ఈ మానవుడి మనసును ఎంతగా కల్లోలితం చేసివేశాయి? హృదయంలో ఎట్టి బడబాగ్నిని నిక్షేపించాయి? అయ్యో, ఈ మురారి ఎవడు? వినూత్న చికిత్సావిధానాలను నోరు లేని కప్పలపైన, కుందేళ్ళపైన ప్రయోగించి వాటి ఫలితాలను తెలిసికోవడం ఆధునిక వైద్యవిజ్ఞానంలో ఒక పద్ధతి. ఐతే సృష్టికర్త మానవత్వంపైన చేయబూనుకున్న అద్భుతమైన ప్రయోగానికి గురైన దౌర్భాగ్యుడా ఈ మురారి!

బయట ఎండ నిప్పులు చెరిగిపోసే వైశాఖమాసపు మధ్యాహ్న వేళ. గాలి కదలాడని గదిలో కూర్చుని అర్ధ నిమీలిత నేత్రాలతో ఓసారి మురారి జీవితాన్ని సమీక్షించుకుంటే అదంతా నాకొక నాటకంగా మాత్రమే భాసిస్తోంది. ఇటీవల నాటకరంగంలో ఎన్నో మార్పులొచ్చాయి. పాత్రల్ని సృష్టించి 'నువ్వు లోభివి' 'నువ్వు వేదాంతివి' 'నువ్వు ఆదర్శవాదివి' అంటూ వాటిని రంగంపైన ప్రవేశపెట్టి, ఆ తరువాత రచయిత నిర్లిప్తంగా, తటస్థుడుగా పరిణామాల్ని చూస్తూ వూరుకోవడం ఆ మార్పుల్లో ఒకటి. రంగంపైన పాత్రల మధ్య సమస్య తనంతటదే ఉద్భవిస్తుంది. తనంతటదే పెరుగుతుంది. సమస్యా పరిష్కారంలో మాత్రం అవసరమైతే రచయిత కలుగజేసుకుంటాడు. జగన్నాటక సూత్రధారికి గూడా ఆ పద్ధతిపైన మరులు కలిగిందేమో! సంకల్పమాత్రంచేత ఆయన తెర తొలగించేశాడు. నాటకం ప్రారంభమైంది. ఆ నాటకంలో మురారిది కీలకపాత్ర. మిగిలిన పాత్రలన్నీ గ్రహం చుట్టూ తిరిగే ఉపగ్రహాల్లా మురారి చుట్టూ పరిభ్రమిస్తాయి.

విషాదకరమైన విషయ మేమిటంటే, మురారి నాటకంలో నేను ప్రేక్షకమాత్రుణ్ణి మాత్రమే కాను. అందులో నా పాత్ర గూడా కొంత వుంది. అదంత చెప్పుకోదగ్గదిగా యితరులకు గోచరింపకపోవచ్చు. చేతులు కాలినతర్వాత ఆకులుపట్టుకుని లాభంలేదు గానీ, నిజానికి నేనొకప్పుడు ఆ నాటకంలో ఒక మార్పును, ఒక మలుపును సాధింపగలిగి వుండేవాణ్ణి. ఐతే ఆ మార్పుగానీ, మలుపుగానీ మురారిలో మాత్రం గాదు. చలదూర్మికాసంక్షుభితమైన సాగరాన్ని చేతులబలంతో సంతరింపగలిగినవాడెలాగైతే లేడో, అలాగే మురారిలో మార్పు సాధించగలవాడూ లోకంలో లేడు! అందుకే నా ఏడుపు మురారిని గురించి కాదు! రాధని గురించి.

రాధ! రాధ నా మనసు కొక బాధ. హృదయానికొక వ్యధ. మహోన్నత పర్వతశృంగం మీద నిశ్చలంగా నిలబడివున్న దేవాలయాన్ని చూచినప్పుడు రాధ నాకు జ్ఞప్తికి వస్తుంది. వినీలాకాశానికి అర్ధంగా, గభీర నిశీథసమయంలో లక్షదివ్వెలతో వెలిగిపోతున్న గాలిగోపురాన్ని చూచినప్పుడు రాధ నా తలపుల్లో ఇల్లు కట్టుకుంటుంది. అంతేమరి! ఆమె నాకు కేవలం ఒక స్మృతి. అంతకంటే మరేమీ లేదు.

ఉదయం పదిగంటలప్పుడు నాలుగురోడ్ల కూడలిలో మోపెడు పుస్తకాలను మోసుకొస్తూ సాంబయ్య గనుక నాకు కనిపించివుండకపోతే, ఇప్పుడీ కథను పునశ్చరణ చేసుకోవలసిన అవసరం కలిగివుండేది కాదు. మార్గమధ్యంలో సాంబయ్య తారసిల్లాడు. పలకరించాను. గడచిన నాలుగేళ్ళలో జరిగిన విశేషాలను ఏకరువు పెటసాగాడు. నిల్చున్నదా అప్పుడప్పుడే కరిగిపోతున్న తారురోడ్డుమీద! చుట్టూరా వీస్తున్నదా వడగాలి. వింటున్నదా మురారిగాథ. ఆ గందరగోళంలో గమ్యస్థాన మేదో మరచిపోయి యింటికి తిరిగి వచ్చేశాను.

మధ్యాహ్నం పన్నెండు గంటలకల్లా మళ్ళీ సాంబయ్య ఇంటిముందర హాజరు. 'లోపలికి రా సాంబయ్యా' అంటుండగానే 'ఎందుకులే బాబూ! వెళ్ళాలి' అని చీటీ నా చేతిలోవుంచి వెనుతిరిగి రోడ్డుపైకి వెళ్ళిపోయాడు. తన ముప్ఫైయేళ్ల జీవితంలో మురారి మొదటిసారిగా నాకు వ్రాసిన ఉత్తరం. ఆతురతగా విప్పాను. 'సాయంత్రం నాలుగుగంటల కోసారి నువ్వు నా రూముకు రాగలవా? నేను మూడు నెలల నుంచీ వ్రాస్తున్న పుస్తకం ఒకటి ఆపాటికి పూర్తి గావచ్చు. దాన్ని నీకు చదివి వినిపించాలనుకుంటున్నాను.'

ఇది మామూలు విషయం కాదు! మురారిని తప్పకుండా నాలుగుగంటలకు ఆ హోటలుగదిలో కలుసుకోవాలి. కానీ అంతవరకూ ఏంచేయడం? ఆహారం కనిపించగానే గొలుసులు త్రెంపుకోడానికి ప్రయత్నించే జాగిలాలకుమల్లే, ఆలోచనలన్నీ మురారిపైకే పరుగిడుతుంటే నిద్రమాత్రం ఎలా వస్తుంది?

* * *

దూర దూరంగా వుండి మా పాండురంగం బాబాయి విజ్ఞతను సరిగ్గా అవగాహన చేసుకోలేనివాళ్ల దృష్టిలో, ఆయన అప్పుడప్పుడూ కొన్ని అర్థం పర్థం లేనిపనులు చేస్తుంటాడు. కానీ ఆత్మీయుల్లో, సమీప బంధువర్గంలో ఆయన దూరదృష్టిని శంకించేవాళ్ళు చాలా తక్కువ. ఒక్కొంత అతిశయోక్తిని సాయం తెచ్చుకోదలచుకుంటే, ఏరు ఏడామడల దూరంలో వుండగానే పంచ పైకెగగట్టేవాటం ఆయనది! అర్థసముపార్జనకు మానవుడు జరామరణాలు లేనివాడిలా కృషి చేయాలన్న పూనిక ఆయన జీవిత బృహత్కథలో ఎక్కడబడితే అక్కడే గోచరిస్తుంది. ఆయన చేబట్టిన న్యాయవాదవృత్తి అందుకు బాగా తోడ్పడింది. కానీ ధనార్జనకోసం ఆయన పెడత్రోవలు త్రొక్కినట్లు చెప్పడానికిమాత్రం నిదర్శనాలు లేవు. పాండురంగం బాబాయి లోకజ్ఞుడు. లోకంచేత వ్రేలెత్తిమాపించుకోకుండా బ్రతకడ మెలాగో, ఆయనకు తెలిసినట్టు మరొకరికి తెలియదు.

అలాంటి పాండురంగం బాబాయి రాధకు పుట్టిన రోజు పండుగ జరుపబోతున్నాడని తెలిసినప్పుడు, నేనొక క్షణంపాటు ఆశ్చర్యంతో బిగుసుకపోయాను. రాధ పుట్టిన పదిహేనేళ్లకు ఆమె పుట్టినరోజుకు ప్రాధాన్యత నివ్వడంలో బాబాయి వుద్దేశ మేమిటి? రాధ పుట్టుకకు గూడా సార్థక్యత వుందన్న విషయాన్ని ఆయన యింతకాలానికి పసిగట్టగలిగాడా? ఏమిటో, మొదట నాకంతా అగమ్యగోచరంగా వుండిపోయింది. ఏమైతే నాకెందుకు? రాధ పుట్టినరోజు పేరిట నాకొకపూట విందుభోజనం సమకూరింది. అదీ తోటలో, వెన్నెల్లో!

జరుగుతున్నది శరదృతువేమో, మల్లెపువ్వులాటి వెన్నెల స్పర్శకు పులకించిపోతున్న బాబాయిగారి పూలతోట ఆకాశగంగలో తానమాడి అప్పుడే గట్టెక్కుతున్న దివ్యసుందరిలా సాక్షాత్కరించింది. చెట్ల క్రింద వెలుగుచీకట్ల ముగ్గుల్ని చూస్తూ కుర్చీలో కూచున్నాను. విందుకు వచ్చిన వాళ్లిందరూ పది పన్నెండు మందికన్నా ఎక్కువలేరు. ఇంకా ఒకటి రెండు కుర్చీలు ఖాళీగానే వున్నాయి. పండుగంతా ఆమెదే అయినా రాధ ముఖంలో మాత్రం నే నాశించినంత ఉత్సాహోద్వేగాలు పుట్టిపడటం లేదు. ఎవరోగానీ చాలా శ్రద్ధ తీసుకుని ఆమెను అలంకరించినట్టున్నారు. ఆ అలంకరించిన వాళ్లు అందమనేది బజారునుంచి యింటికి దిగుమతయ్యే ముడిసరుకని భ్రమిస్తున్నారేమో

నాకు తెలియదు. నువ్వు రోజూ నీరుపెట్టు, పాదు దిద్దు, కొమ్మల్ని సొగసుగా కత్తిరించు, ఎన్ని సొబగులు చేసినా శుకపిక సైన్యంలో వసంతుడు తరలిరానిదే వనలక్ష్మికి శోభ లేదు. మూడేళ్ళ రాధను భుజాన కూర్చోబెట్టుకుని తోటలో పరుగులు దీసిన బాల్యక్రీడ నిన్న మొన్నటిదిగా నే కన్పిస్తున్నా, ఆమె కప్పుడే పదిహేనేళ్ళు గడచిపోయాయి. ఈ వయస్సులో ఆమెకు కృత్రిమాలంకారాలు అనవసరం!

నే నక్కడికి వెళ్ళేసరికి 'స్విచాన్' చేయని విద్యుద్దీపంలా వున్న ఆ సమావేశంలో కొంత సంచలనం కలిగినమాట నిజమే! కాని ఖాళీగావున్న కుర్చీలు ఎవరి కోసమయితే వుద్దేశింపబడి ఉన్నాయో, వాళ్లు వచ్చేదాకా ఆ దీపం వెలిగే సూచనలు కనిపించడం లేదు. 'ఏమిట్రా బాబూ, నువ్వూ ఆలస్యంగానే వచ్చావు?' అంటూ బాబాయి ఆహ్వానించాడు. 'మునుపటి మనిషా మరి, ఉద్యోగం చేస్తున్నాడు గదండీ!' అంది రాజేశ్వరి పిన్ని. 'నువ్విలా వెళ్ళవే అమ్మా, అన్నయ్యనిక్కడ కూచోనీ' అంటూ. రాధ లేచి నిల్చోబోయింది. 'ఎందుకులే రాధా! నేనిక్కడే కూచుంటాను. ఎంతసేపు—ఓ అరగంటసేపు లతంగమే కదా' అంటూ నేను దూరంగానే కూచున్నాను. రాజేశ్వరి పిన్ని చీరచెరగులోనుంచి వస్తున్న సెంటువాసన ఒక వైపున, బాబాయి చుట్టతాలూకు పొగమబ్బు ఒక వైపున, మధ్యలో వుక్కిరిబిక్కిరౌతూ బోనులో తగులుకున్న లేడిపిల్లలా రాధ అదే కుర్చీలో కూలబడిపోయింది.

బాబాయి ఒక పొగచుట్టను పూర్తిగా కాల్చి నుసిచేసిన తర్వాత మరేం చేయడానికీ పాలుపోక టేబిల్ పైకి వంగి పిన్నివైపు చూస్తూ "గంట ఏడున్నర కావస్తోంది గదూ! అతడింకా రాలేడ" అన్నాడు.

"వస్తాడు. ఈపాటికి వస్తుంటాడు" అని భర్తగారికి భరవసాయిచ్చి "ఒకవేళ ఆ అబ్బాయి మరచిపోయాడేమోనండి" అంటూ అంతలో నిరుత్సాహపడిపోయింది రాజేశ్వరి పిన్ని.

"ఆ రాబోతున్న దెవరో తెలుసుకోవచ్చా పిన్నీ!" కుతూహలంతో ప్రశ్నించాను.

"చెప్పవచ్చునా, కూడదా' అన్నట్లు పిన్ని బాబాయి ముఖంలోకి చూచింది. ఆమె అమాయకత్వానికి జాలి పడుతున్నట్లు బాబాయి ఓసారి మెల్లగా నవ్వి "తినబోతూ రుచులడగడ మెందుకురా బాబూ! అతడు రాబోతున్నాడుగా! మద్దువుగానీ వుండు" అన్నాడు.

ఆ రాబోతున్న అతిథిపట్ల బాబాయి నాలో ఉత్కంఠత రగిలించాడని ఒప్పుకోక తప్పదు. చుట్టుపట్ల ఆకులు గలగలమన్నప్పుడు, కొమ్మలు రెపరెపలాడినప్పుడు ఆ అతిథి వచ్చేస్తున్నాడనే అనుకున్నాను. కాని అతడు రాలేదు. గంట ఎనిమిదయింది. మళ్ళీ పదిహేనునిమిషాలు గడచిపోయాయి. పరధ్యానంలో వుండగా చేయి ఎప్పుడు జేబులోకి పోయిందో తెలియదు. ఎప్పుడు పైకివచ్చిందో తెలియదు. తెలివి తెచ్చుకునేసరికి వ్రేళ్ళమధ్య సిగరెట్టు వెలిగిపోతోంది. బాబాయి నావైపు చూడంలేదు, గనుక సరిపోయింది. ఒకవేళ చూచికూడా చూడనట్లు నటిస్తున్నాడేమో! మనిషి గుర్రమనీ, మనసు కళ్లెమనీ ఎవరోగానీ గొప్ప సత్యాన్ని సెలవిచ్చారు. ఈ కళ్లెం రౌతు స్వాధీనంలో లేనప్పుడు గుర్రం ఎప్పుడో ఒకప్పుడు కొంపముంచి తీరుతుంది. జాగ్రత్త పడడం ఎందుకైనా మంచిది. పైకిలేచి మెల్లగా పదిబారలు నడచి రావిచెట్టు వెనుకవైపున భూమిలోనుంచి పైకి తేలిన వేరుపైన కూర్చుని సిగరెట్టు ముట్టించాను.

"అన్నయ్యా!"

ఉలికిపడి వెనుదిరిగి చూచాను. ఆమె రాధ. అదే చెట్టుక్రింద, యింట్లోనుంచీ వినవస్తున్న రేడియోపాటకు అనుగుణంగా, చిన్నిపాదాల్లో మువ్వలు ఘల్లుఘల్లుమంటుండగా వచ్చిరాని నృత్యమాడిన రాధగాదు! ఈమె పదిహేనేళ్ల రాధ. గులాబీపువ్వు వన్నె పావడా కట్టుకుంది. వినీలగగనంలాంటి దావిణీ వేసుకుంది. పాపటలోనుంచీ వదులుపడి కురులు కొన్ని నుదుటిపైన వ్రేలాడుతున్నాయి. ఆ క్షణంలో ముగ్ధమోహన సౌందర్యమంతా మా రాధ సొమ్మేననిపించింది. కానీ ఆ ముఖంలోని నిర్వేదం? ఆ నిర్వేదాన్ని ఎలా వర్ణించను!

"అదేమిటి రాధా! నువ్వూ యిలా వచ్చేశావ్" అన్నాను.

"నీ కళ్లకు కూడా నేను పెద్దదాన్నయిపోయానా అన్నయ్యా" అంటూ రాధ నాముందర నేలపైన కూర్చుంది.

"అదేమిటి రాధా! ఓరోజు నేనీ చెట్టుక్రింద నిన్ను పడవేసేశాను. జ్ఞాపకముందా? పిన్నితో చెబుతావేమోనని భయపడ్డాను. కానీ నువు చెప్పలేదు" అన్నాను.

"అవునులే అన్నయ్యా! నువు నన్ను మోసేంత కాలం మోసావు. ఆరేడేళ్లు వచ్చేసరికి మోయలేక క్రిందపడేసేశావు. ఆ తర్వాత యిటీవలిదాకా మాట్లాడనైనా మాట్లాడేవాడివి. ఇప్పుడదీ కరువైపోయింది. అంతకంతకూ నువు నాకు దూరమైపోతున్నావన్నయ్యా" అంది రాధ.

"అచ్చే, యిదంతా నీ ఊహాగానం రాధా! ఇది బ్రతుకు కదా! ఇంకా బాల్యంలో వున్నట్టే వుండాలంటే వీలవుతుందా చెప్పు" అన్నాను.

రాధ నాలుగైదు క్షణాలపాటు మౌనంగా వుండిపోయింది. నేలమీద వ్రేలితో గీతలు వేస్తూ తల దించుకునే "రెండు మూడు నెలలనుంచీ యింట్లో క్రొత్తగా ఓగోల ప్రారంభమైందన్నయ్యా! అతగాడెవరో నీకు తెలుసుననుకుంటాను" అంది.

సిగరెట్టు పీకను అవతలికి విసిరి "నువ్వా 'అతగాడు' అంటూ సర్వనామమే ఉపయోగిస్తే నాకేం తెలుస్తుంది రాధా" అన్నాను.

"అతడి పేరు మురారి!" అంది రాధ.

"మనం యిప్పుడు వేచివుండేది ఆ మురారి కోసమేనా రాధా?"

"అవును. అతడి నాన్నగారో, తాతగారో నాన్నగారి దగ్గర క్లైయింటట. ఆవూరికి ఈయన ఒకటి రెండుసార్లు వెళ్ళి వచ్చారట. భూమి పుట్రా, నగలూ నట్రా అంతా నాలుగైదు లక్షల ఆస్తట. వాళ్లింట్లో ఒక పడినిండుకూ ఉంగరాలే వున్నాయట!"

మా బాబాయి దూరదృష్టి ఎంతటి తీక్ష్ణమైందో నాకప్పుడు మాత్రమే అర్థమయింది.

ఉన్నట్టుండి రాధ తలపైకెత్తి "నా పెళ్ళికిప్పుడేం తొందరన్నయ్యా! నువ్వు నాన్నగారితో చెప్పవూ" అంది.

"ఎందుకు రాధా! ఆడబిడ్డంటే అర్థమేమిటో తెలుసా? ఎక్కడ అనడానికి 'ఏడ' అని వున్నట్టే అక్కడ అనడానికి 'ఆడ' అని ఒక రూపాంతరం వుంది. ఆడబిడ్డ ఎన్నటికయినా 'ఆడ' బిడ్డేగానీ, 'ఈడ' బిడ్డమాత్రం కాదు. అంటే ఏమిటి? ఆడబిడ్డ ఎరువు సొమ్మన్నమాట! మరి ఎరువుసొమ్ము బరువు చేటేగదా రాధా!"

రాధ శూన్యంగా నాకళ్ళల్లోకి చూచింది. లోకంలో కనీసం ఒక్క వ్యక్తి అయినా తన హృదయాన్ని అర్థం చేసుకోనందుకు ఆమెకు ఆశాభంగం కలిగివుంటుంది. కాని, ఈ క్షణాన, నా చూపుకు, బుద్ధికీ అందుబాటులో లేని ఏదో దూర సుందరసీమలోనో క్రుమ్మరుతున్న రాధా! నేను నీ హృదయాన్ని అర్థం చేసుకోగలిగాను. తల్లినీ, తండ్రినీ, తోబుట్టువుల్నీ పుట్టి పెరిగిన పరిసరాల్నీ వదిలిపెట్టి దూరంగా వెళ్ళిపోవడానికి అవసరమైన తెగువ అప్పటికింకా నీలో ఉద్భవంకాలేదు. భర్త పరిష్వంగంలో స్త్రీ కోసమై ప్రకృతి నిక్షేపించివున్న అనిర్వచనీయానందానుభూతుల్ని నువ్వప్పటికింకా కలగనలేదు.

ఇంతలో బాబాయి పిలుపు వినిపించింది. ఆ పిలుపులో అతిథులరాక వల్ల కలిగే సంభ్రమం వ్యక్తం కాలేదు. ప్లీడరుగా బాబాయి ఓటమిని తేలిగ్గా తీసుకోడానికి అలవాటుపడిన మనిషి. అతిథులు రానందువల్ల ఏర్పడిన మందకొడితనాన్ని మళ్ళపెట్టడం కోసం ఆయన అక్కడున్నవాళ్ళందరినీ తనమాటల జల్లులో ముంచేస్తున్నాడు.

"ముప్పైరెండులో కాబోలు, మొదటిసారిగా ఆవూరెళ్ళాను. స్టేషనుకు పన్నెండు మైళ్ళ దూరంలో వుందావూరు. గవర్నరు కయినా సరే కట్టెబండి తప్ప మరొక యానసౌఖర్యం లేదు. మూడువైపులా కొండలు. మరో వైపున పంట పొలాలు. మనం కాశ్మీరాన్ని గురించి కలలుగంటుంటాం. ఆ తరిగొండ ప్రాంతాన్ని ఒకసారి చూస్తే చాలు. కాశ్మీరం ఎలా వుంటుందో కొంచానికి కొంచెం వూహించుకోవచ్చు."

బాబాయి ఓక్షణం ఆగి తనకథ పట్ల అందరూ సావధానంగా వున్నారని నిర్ధరించుకున్న తర్వాత మళ్లీ ద్విగుణీకృతోత్సాహంతో ప్రారంభించాడు.

"ముక్కోణాకృతిగా వున్న కొండల కడ్డంగా వుంది వీరన్న చెరువు. చెరువుక్రింద ఒకటే ప్లాటు. మున్నూరెకరాలు. ప్లాటు ప్లాటంతా వెంకట శివయ్యగారిదే! ఇంకొకరి కక్కడ ప్రవేశంలేదు." అని బాబాయి టేబిల్ చుట్టూ కూచున్న బంధువర్గాన్నొక

సారి కలయజూచి "వెంకట శివయ్యగారెవరో మీలో చాలామందికి తెలుసు ననుకుంటాను" అన్నాడు.

వెంకట శివయ్యగారినిగురించి తెలియక పోవడ మేమిటి? ఆయన మామిడి తోపుల ప్రశస్తినిగురించి బొంబాయిపళ్ల మార్కెట్టులో అడగాలి. కలకండకంటెకీ కోరగించే తరిగొండ చెరకుబెల్లం నాణ్యతను గురించి మద్రాసు గిడ్డంగుల్లో విచారించాలి. ఆయన వ్యవహార కౌశల్యాన్నిగురించి తెలుసుకోవాలంటే హైకోర్టు వకీళ్లతో సంప్రదించాలి. కాని యిప్పుడు బాబాయి వెంకటశివయ్య గారినిగురించి ఎందుకు చెబుతున్నట్టు?

బాబాయికథ వేదాంతంలో పడ్డింది. "నిరుపేదలకు కుక్కమురికి సంతానం. కోటీశ్వరులకి గొడ్డరికం. విధితలలోవున్న విచిత్రమే ఇది! వెంకట శివయ్య గారికి పిల్లల్లేరు"

సమావేశంలో ఓమూలగా కూర్చుని వనికిపోతూ వడుతున్న వృద్ధు డొకతను,—ఆయన రెండేళ్ళ్వరి పిన్ని వైపున దగ్గరిచుట్టం "అయ్యో పాపం, ఆశివయ్యగారు కాస్తాదాటుకుంటే ఆస్తి గతేంకావాలి?" అంటూ సంతాపాన్ని వెలిబుచ్చాడు.

"ఆ దాటుకోవడ మేదో రెండేళ్ళకుముందే జరిగిపోయింది మావయ్యా! వెంకటశివయ్యగారు ప్రస్తుతం కైలాసవాసులు" అన్నాడు బాబాయి.

"ఐతే ఆస్తి?" ఔత్సుక్యానికి వెంగపడిపోతూ ఎవరో ప్రశ్నించారు.

"ఆస్తి కేముంది? అది నిక్షేపంగా ఆయన దత్తపుత్రుడికి సంక్రమించింది"

"ఎవరుబాబాయ్ ఆ అదృష్టవంతుడు?" ఈసారి నేనేఅడిగాను.

"అతడే మురారి" అన్నాడు బాబాయి.

ఒకానొక గొప్పనవలలో సుదీర్ఘమైన మొదటి ప్రకరణం చదివి ముగించినంత 'రిలీఫ్' కలిగింది నామట్టుకు నాకు!

తొమ్మిదిగంటలతర్వాత, అభ్యాగతిని మనసు వచ్చి రాక ఆదరించే గృహిణిలా విందుభోజనం టేబిల్ పైకివచ్చింది. భోజనంతోపాటు అనుపానంగా బాబాయి మురారినిగురించి చెప్పుకపోతున్నాడు. వెంకట శివయ్య గారు దత్తత తీసుకునేనాటికి మురారి నాలుగేళ్ళ వాడట. మురారికి తల్లి దండ్రు లున్నారు. మురారి మోచేతిగంజికోసం ఆశించుకుని వున్న వాళ్లందరిలోనూ ఆ తల్లిదండ్రులు ముఖ్యులు అని చమత్కరించాడు బాబాయి.

"పోనివ్వండి నాన్నా! ఎంతసేపని చెబుతారు" ఇంతసేపటికి రాధగూడా కలుగజేసుకుంది.

"లేదంటే మురారి ఆస్తిపాస్తుల సంరక్షణకోసం వెంకటశివయ్యగారు నియమించిపోయిన ధర్మకర్తలు ముగ్గురిలోనూ ఆ నరసింహం ఒకడు. రెండోవాణ్ణి నేను. మూడోవాడు సాంబయ్య" అంటూ బాబాయి కథను ఒకకొలిక్కి తెచ్చేశాడు.

ఆసాంబయ్య ఎవరో! ప్రశ్న పెదవి చివరిదాకా వచ్చింది. కాని అడగడానికి ధైర్యంచాలలేదు. ఆ రాత్రంతా జాగరణతోనే కాలంగడపడం నా అభిమతం కాదు.

ఐనా ఆరాత్రి బాబాయిదగ్గర సెలవుతీసుకోడానికిముందుగా సంతృప్తికోసం మరొకప్రశ్న అడగకుండా వుండలేకపోయాను.

"ఐతే ఈరోజు మురారి రాకపోవడానికి కారణమేమైవుంటుంది బాబాయ్? రైలు తప్పిపోయివుండదు గదూ!"

"రైలు తప్పిపోవడ మేమిటి? అతగాడిప్పుడు ఈ వూళ్ళోనేవున్నాడురా బాబూ! కాలేజిలో చదువుకుంటున్నాడు. ఇది మొదటిసంవత్సరం, నాలుగు రోజులక్రిందట తప్పక రావలిసిందని హెచ్చరించి వచ్చానుగూడా! వాడికి మతిమరపెక్కువలే! మరచిపోయివుంటాడు" అన్నాడు బాబాయి.

అజీర్ణరోగికి లభ్యమైన మధురాహారంలా రాత్రి గడవనూ గడవనూ వెన్నెల మరీ ఆర్ద్రమైపోయి ముఖం మొత్తుతోంది. తలకు రుమాలాచుట్టుకుని పల్లటిరోడ్డు పైన తూలుతూ తూలుతూ యిల్లుచేరుకునేసరికి రాత్రి మలిజామునుగూడా పూర్తిగావచ్చింది. పడక పైన పడుకోబోతుండగా ఓ చిత్రమైన ఆలోచన స్ఫురించింది. బాబాయికుటుంబంలో ఆయింటిలో అడుగైనా పెట్టి ఎరుగని మురారి ఎంతసంచలనాన్ని కలిగించ గలిగాడు? ఆకాశాన ఎక్కడోవున్న గ్రహాలు మానవుడి జీవితంలో ఫలాఫలాలు నిర్ణయిస్తాయని జ్యోతిష శాస్త్రజ్ఞులు చెబుతారు. ఈ మురారిగూడా మా

ననును. అంతేకాదు "ఎండ" అను పదము ఉచ్చరించినంత మాత్రముననే నోరు పొక్కిపోవునని బహుసుకుమారముగా భావించినాడు. ఈ గ్రీష్మవర్ణనములోనే మరొక పద్యము సుకుమారభావనకు మకుటాయమానముగా నున్నది.

"ఆతపభీతి నీడలు రయంబున మ్రాకులక్రింద దూరెనో
ఆ తరులున్ తృషాభిహతులై తమ నీడలు తారె త్రా
గెనో
భీతి ననంగ నీడ లురుపాదపమూలములం దడంగె గ్రీ
ష్మాతత మధ్యవాసరములందు చలింపకయుండు
నెండలన్"

ఇందులో గ్రీష్మఋతువులోని మధ్యాహ్నపుటెండ వర్ణితము. మధ్యాహ్నవేళ సూర్యుడు నెత్తిమీదకి వచ్చును. నీడలు చెట్లక్రిందికి చేరును. ఈ యథార్థమును ఎంతో సుకుమారముగా భావించి హేతుజిజ్ఞాసువై యున్నాడు నన్నెచోడుడు. చివరకు చిత్రమైన భ్రాంతిలో పడినాడు. ఎండవేడిమి భరించలేక నీడలు పరిగెత్తుకొని వచ్చి చెట్లక్రింద దూరినట్లున్నవి. నీడలకు కూడ ఎండయనగా అంత భయము వేసినది. నిజమునకు నీడల కెండ యెక్కడిది? ఒక నిముషము సేపు దానిని మనము మరచిపోవలె-సరే. నీడలు తమకాప్తులైన తరువుల శరణుజొచ్చినవి. ఆతరు లెంత ముష్కరములు. దప్పితో అవి తడబడుచున్న మాట నిజమే-అంతమాత్రమున శరణుజొచ్చిన దీనులను మోసగించవచ్చునా? అని నిర్దయగా తమ నీడలను తామే త్రాగివేసినవట. నీడలు నీళ్ళవలె కన్పించుటకూడ సహజమే. ఇంతటి పదునైన భావన నన్నెచోడునిది. కడకు తేలినదేమి? గ్రీష్మకాలమున మధ్యాహ్నవేళ నీడలు తరువుల మూలములందు చాలాసేపణగియున్నవి.

నన్నెచోడుడు కేవలము ప్రకృతిలోని బాహిర స్వరూపచిత్రణమే చేయలేదు. సినీమాబొమ్మవలె క్షణములో అనేక వికారములు దాల్చు చిత్తవృత్తులను మెత్తగా మెలకువతో చిత్రించినాడు. చిత్తవృత్తిని చిత్రించక కేవలము కాయికస్వరూపమును గీసినవాడు ఉత్తమకవులజాబితాలోన చేరడు. మన తత్త్వ నిరూపణమున మన తెలుగుకవులలో తిక్కన, సూరనలు పేరుమోసినారు. వీరిద్దరికన్న ముందే అట్టిరీతిని తెలుగుకావ్యములందు ప్రవేశపెట్టిన జెట్టి చోడుడు. బహుముఖములుగా ప్రసరితములగు మనోవృత్తుల కీతడు శాబ్దికతను కల్పించినాడు. సంశయాత్ముని చిత్తవృత్తుల నీతడు నిరూపించిన తీరు చూడుడు.

ఇంద్రుని ఆదేశప్రకారము మదనుడు మహేశ్వరుని జయించుటకు బయలుదేరును. అంతకుముందు రతీదేవి అతనిని వలదని ఎంతగానో వారించును. "ఉగ్రునుగ్రలోచనోద్భూతవహ్నికి నెదిరినిలువ నీకు నెంతకలది" యని ఆక్షేపించెను. "అతనికి నమ్మ పాశుపత మంటివ కందుడు పువ్వులమ్ము నీ"కని యెత్తి పొడిచెను. అయినను స్వామికార్యధురంధరుడును, నిజవిజయగర్వితుడునగు మదనమూర్తి పుష్పాయుధుడై, పుష్పరథారూఢుడై ఆమని చెలికానితో శుకపిక పరివారములో చైత్రయాత్ర సాగించెను. అంత నలువైపుల అకాలవసంత మలముకొనెను. మన్మథునికి మాకందవృక్షమీ మాదిరిగా కన్పించును.

"పలకెడు కొరాకు లలితాస్థిదళముగా
సోలు కొమ్మలు పలుకేలు గాగ
బాలపల్లవములు ప్రేలు కెంజడలుగా
పెనగు తీగలు దోర్ఘణములు గాగ
కలకంఠనికరంబు గళమున కప్పుగా
పుప్పొడి మేని విభూతి గాగ
ఫలములు వరదానఫలములుగా అలి
మాలికల్ రుద్రాక్షమాలికలుగ
శంభుమూర్తి దాల్చి సహకారభూరుహ
చక్రవర్తి నవవసంతవేళ
నతిశయిల్లుచుండె—"

మామిడిచెట్టు మహాశివునిరూపులో కన్పించినది. మహాశివుని సర్వాంగములపోలికలు మాకందములో ముద్రితములైనవి. పండుటాకులు ఎముకలవలె, కొమ్మలు చేతులవలె, చిగుళ్లు జడలవలె, కోకిలలు కంఠకాళిమవలె, పుప్పొడి విభూతివలె... దేనికది కన్పించి మొత్తము చెట్టును చూచువరకు మూడవకంటివాడు మూర్తీభవించినట్లయినది. కుసుమాస్త్రునికుండె గుభేలు మన్నది. రతీదేవియన్నప్పుడు తాను లెక్కచేయలేదు. ఉగ్రలోచనుశక్తియు తనకు తెలియనిదికాదు. అయినను పెండ్లముముందు పిరికిపడువాడుండునా? నిష్కంపముగా బయలుదేరినాడు. లోపల సుబుబుమనుచునే యున్నది. సంశయాత్మునికే కదా రజ్జుసర్పభ్రాంతి.

సందిగ్ధచిత్తుడైన చిత్తజానికి మామిడిచెట్టు మహాశివునివలె కన్పించినది. "అక్కడగని మది నుదరిపడి మనోజుడోసరిల్లినాడు. ఇదేమని కనురెప్ప లల్లార్చినాడు. మరునికి మరునిముసమున మామిడిచెట్టే మాదిరిగా కన్పించినది.

"అలరుల మందహాసమున అన్నిన
షట్పదమంజుగీతి రా
చిలుకల ముద్దుమాటలను
చెందలిరాకుల రాగలీల కో
కిల నినదంబులన్ బరిహా
కేళిభరంబున ముక్తి పర్ణమే
ఖల నభిరామయయ్యె సహకార
లతాంగి మధుప్రసంగతిన్."

మదనుని సంశయము మంచుపొరవలె కరిగిపోయినది. సహకారము మొలనూలు జారిపోవుచున్న ముద్దరాలివలె కన్పించినది. మనసులోని కలవరము మాయమైనది. ఇంతేకదా అనుకొన్నాడు. మందహాసముతో మరల మాకందమును తేరిపారజూచినాడు. అప్పుడు:

"తలిరెల్లి పూవుటమ్ముల
బలసిన పికకీరభృంగపరివారముతో
వలరాజు బోలి మామిడి
సలలితగతి నుత వసంతసంగతి నొప్పెన్."

మరుడు విస్మితుడాయెను. ఆమ్రతరువు అచ్చము తనవలెనే కన్పించెను. చిగురుగొడుగులతో, పూవుటమ్ములతో శుకపికభృంగపరివారముతో సుమాస్త్రుల తనవలెనే అగుపించెను. ఇంకను 'తనవలెనే' యేమిటి? మరుడే మాకందము. మాకందమే మరుడు. ఈదృశముగా నన్నెచోడుడు సంశయాత్ముని మనోవృత్తులను ముక్తసరిగా ముచ్చటగా చిత్రించినాడు.

ఆందోళిత మనస్సుయొక్క భిన్నావస్థలనుగూడ నన్నెచోడుడు విన్నాణముతో వర్ణించినాడు. కామదహనమైనది. శివనిష్ఠమైన పార్వతీకామము మాత్రము చేవోసిన నిప్పువలె భగ్గుమన్నది. ఆమెలో విరహతాపము ముంచుకొనివచ్చినది. గాయపడిన ఆమెయెదకు ప్రకృతిలోని ప్రతివస్తువు భయోత్పాతమైనది. విరహవివర్ధకమైనది.

"అలులకు నుల్కు మందమలయానిలు
డన్న భయంబునొందు కో
యిలలకు బెగ్గడించు కడు నేచిన
మావిడి నూడనోడు రా
చిలుకలకులుక్కు కాముడని చెప్పిన
తల్లడమందు నిందు న
న్నెల గని సొమ్మబోవు ధరణీధర
నందన కామవేదనన్."

ఆమె ధరణీధరనందన—అయిననేమి? మదనశక్తికి కొండలుసైతము దెంకులవలె తేలిపోవును. కుసుమాంగియైన ఆమెయెంత? పై పద్యమున ఆమెను భయపెట్టిన వస్తుసామగ్రి స్థూలమైనది. సర్వులకు గోచరమయ్యెడిది. ఇక ఆమె రెండవతీరు అవస్థ.

"కలకలనవ్వినట్లు తమకంబున
కన్గవ విచ్చి భ్రూలతల్
సొలయగ జూచినట్లు తనివోవగ
తెల్వియు గాగిలింప చే
తులు పచరించినట్లు దయతో
రతికేళికి నప్పళించు న
ల్లలమి నటించుచుండె సతి కీల్వగు
రూపెసరన్ ప్రసన్నమై."

ఈ రూపు మృగతృష్ణవంటిది. ఇదిలోకమునకు కన్పించదు. పార్వతి మనోనేత్రమునకు మాత్రమే కన్పించునది.

మనస్సులో జరిగిన మార్పులను మాటలలో పొందుపట ఒకగొప్పనేర్పు. మనస్సులో వికారములు కలిగినప్పుడు దైహికచేష్టలను వర్ణించుట, మానసిక దైహికచేష్టాసమన్వయమును చిత్రించుట ఇంకయు గొప్పనేర్పు.

మహేశ్వరుడు మదనబాణవిద్ధుడాయెను. ఆ క్షణములో అతనిమదిలో కదలిన మధురవాంఛలను, అతని శరీరములో విద్యుత్తువలె చొరబారిన సంభ్రమభావమును నన్నెచోడు డీ పీసములో పూసగ్రుచ్చినట్లు చెప్పినాడు.

"పులకాంకురమ్ములు తలలెత్తి మేను కం
పింప కోమలి కౌగిలింపదలచి
రాగోత్కటమున సైరణలేక మోవిని
కాయువ్వన పైబడి కవయదలచు
లలితాంగి అవయవములు జూచి మది తని
వోవక చూడ్కుల గ్రోవదలచు

అధరోష్ఠ మదరంగ నంతఃస్మితాంశులు
తలుకొత్త నేమేని పలుకదలచు
తనమహత్త్వంబు తలపక తరుణిపొందు
వడయ కీడ్పడి తేకువ నాపదలచు
భావజాస్త్రాభిహతి మహాదేవు డొక్క
ప్రేలిమిడి పెంపుసెడి కడు విరలిగొనియె."

ఒక్క త్రుటిలో ఇన్ని విధములుగా కదలిపోయినాడు శంభుడు. తనమహత్త్వంబును మరచిపోయినాడు. తరుణిపొందుకై పరవళ్లు త్రొక్కిన దాతని మనస్సు. ఆమె అవయవలావణ్యమును చూపులతోనే త్రాగదలచెను. ఆమెతో అంతఃస్మితాంశులు తళుకొత్త ఏమేని పలుకదలచెను. చూపులతో త్రాగుట, ఏమేని పలుకుట...ఎంతటి సభ్యశృంగారము. ఈ పద్యమును మాటలతో వివరించుట అసాధ్యము. అది భావయిత్రీ ప్రతిభకుమాత్రమే ఆస్వాద్యము.

నన్నెచోడు డంతట నూహావైచిత్రినే ఆలంబనముగా స్వీకరించలేదు. ఎల్లప్పుడు కల్పనాశక్తి, ఊహావైచిత్రిని కనబరచుట దప్పిగొన్నపుడెల్ల త్రాగుటకు తేనె యందించినట్లుగా నుండును. మధ్యమధ్య మంచినీరందించినచో పానయోగ్యముగా నుండును. నన్నెచోడుడు ఈ తెన్నునే అవలంబించెను. కల్పనలకు, ఊహలకు అవకాశము కల్గని సందర్భములందు ఉక్తివైచిత్రి నూతగా స్వీకరించినాడు. సాదిసాది మాటలను చిత్రముగా త్రిప్పిత్రిప్పి చెప్పి చమత్కారమును ప్రతిపాదించినాడు. చిత్తవిద్రుతికి చమత్కారమే మొదటిమెట్టు కదా! వసంతఋతువర్ణనలో నన్నెచోడుడు పలువోకలు పోయినాడు. అలంకారములతో ఆడుకొన్నాడు. మాటబొమ్మలతో మాట్లాడినాడు. స్వభావోక్తులతో సరసమాడినాడు. ఊహలతో ఉయ్యాలలూగినాడు. అయినను ఉక్తివైచిత్రిని మరువలేదు. వసంతములో పూచినవృక్షముల పట్టిక యివ్వవలెనను కొన్నాడు. వట్టిపట్టికయిచ్చుట కవి చేయవలసిన ఘనకార్యమా ?

"పొన్నలుపూచె పొన్నలొగి పూవకముందఱ పూచె గోగులా
పొన్నలు గోంగగోగులును పూవకముందఱ పూచె బూరుగుల్
పొన్నలు గోంగగోగులును బూరుగులు న్నొగి పూవకుండగా
మున్న వనంబునన్ గలయమోదుగు లొప్పుగపూచె నామనిన్."

పద్యము ప్రారంభించినప్పుడు పొన్నలు మొదట పూచినవను అభిప్రాయము కలుగును. కాని ముగించు వరకు మోదుగులే మొదట పూచినవని తేలిపోవును. ఇది సామాన్యమైన అభిప్రాయమును తిరుగుడుగా చెప్పుపద్ధతి—పద్యము "మోదుగులుపూచె" నని ప్రారంభించినచో సొగసుండదు. ఇంతేనా అనిపించును. "నేతి నేతి" యని చెప్పుటయే సుందరమైన రీతి.

మరుడు నిటలాంబకుని కోపవహ్నిలో మసియై పోయినాడు. మారదహనము నిమిషమాత్రమున జరిగినది. అప్పుడే ఎట్లు కాలిపోయినాడను సందేహము కల్గించు విధముగా జరిగినది. ఈ అభిప్రాయమును వ్యక్తీకరించుటకు నన్నెచోడునికి ఉక్తివైచిత్రి ఉపస్కారకమైనది.

"కని కోపించెనో కాక
మును కోపించెనో మహోగ్రముగ నుగ్రుడు చూ
చిన కాలెనో చూచక యట
మును కాలెనో నాగ నిముసమున నఱగాలెన్."

నన్నెచోడుడు కుమారసంభవమున నవరసములను పోషించినాడు. శివపార్వతుల సంయోగ సందర్భమున శృంగారము, తారకునితో కుమారస్వామి చేసిన యుద్ధఘట్టమున అద్భుత వీర, భయానక, బీభత్సములు, దక్షాధ్వరధ్వంస సందర్భమున రౌద్రము. రతీవిలాపఘట్టమున కరుణము, శివతపోనిష్ఠను వర్ణించుపట్టున శాంతము సందర్భశుద్ధితో వర్ణించెను. శివపార్వతుల జలకేళీసందర్భమున హరుడు కనుగీటుగా సురసతు లింద్రునిపై నీరుచల్లిరనుపట్టున సున్నితమైన హాస్యరసమును పోషించెను. దక్షాధ్వరధ్వంస ఘట్టమున ఇతడు ప్రదర్శించిన వికృతహాస్యము విలక్షణమైనది. శివేతరదేవతాహేళనమున కీతడు వికృతహాస్యము నాలంబనముగా తీసికొనెను.

"వాహనంబు నెక్కి వచ్చి భయంబున
వడకి నేలవడ్డ వనజగర్భు
కమిచికొని మరాళకము వారి చెందమ్మి
గఱచికొని రయమున పఱచినట్లు"

ఇందులోని హాస్యము ఇంచుక వికృతమైనను గిలిగింతలు పెట్టునట్టిది. హంసకు తామరతూడు ప్రియమైనది. తామరగర్భుని అది తొందరలో తామరతూడు

వలె ముక్కున కఱచికొని పోయినదన్న అసహజము కాదు.

"ఉత్తరాబ్ధీశుడయ్యును ఓడిపార
వరుణు డలుకుచు నోడిక వాగువోలె
కలుములెడరైన నేమియు నిలువవనుట
తగభయాతురుడై నోర తడియులేక"

వరుణుడు అబ్ధీంద్రుడు. అయిన నతడు నిమ్నగ వలె పరిగెత్తుకొని పోయినాడు. వరుణుడనగా వాన దేవర-అయిన నతడు నోటిలో తడిలేకుండా పారిపోయినాడట. భయభ్రాంతులు కలిగినప్పుడు నోటిలో తడి యెండిపోవుట అనుభవసిద్ధము. ఏ దేవతకో నోట తడి లేదని చెప్పినచో అది ఒకతీరుగా నుండెడిది. వర్షాధిదేవతయైన వరుణునికే ఈ యవస్థ పట్టినదనుటలో వ్యంగ్య గర్భితమైన హాస్యము తొంగిచూచినది. ఈ శ్రేణిలోని పద్యములలో చివరిది హాస్యభేదములలో చరమమైన అతిహసితమును కల్గించును.

"తనయెక్కిన మానిసితో
వనయము నెక్కంగ మఱచి యాతని తనయూ
పున నిడుకొని పరచె భయం
బున ధనపతి తన్ను పిఱుద భూతములార్వన్"

కల్పనాశక్తికి పరిశీలనశక్తికి నింగికి నేలకు గల అంతరముండును. ఉన్నదున్నట్లుగా చెప్పుట కాల్పనిక రీతికి సరిపడదు. ఎత్తైన ఊహ, అపూర్వ భావచిత్రములు, అలౌకిక సుందరతా సంవర్ణనము కల్పనాశక్తికి తోబుట్టువులు. పరిశీలనశక్తి దీనికి జాతిగా భిన్నము. కవి లోకమును వ్యక్తులను బాగుగా పరిశీలించి చూచి యథాతథముగా చిత్రించవలసియుండును. నన్నెచోడునిలో నిబిడకల్పనాశక్తితోపాటు నిశిత పరిశీలన శక్తి గూడ కలదు. వసంతుడు తెచ్చిన పూవుతేరిని వర్ణించుపట్టున అతని సూక్ష్మపరిశీలనశక్తి ప్రస్ఫుటమైనది.

"పంకరుహంబులు బండికన్నులు చంప
కంబులు నొగలుత్పలంబు లిరుసు
కరవీరములు పలుకోడి జాదులు పను
గొయ్య లశోకముల్ గోడిపీంట
సింధువారంబులు సీలలు కేతకుల్
మెట్టులు మొల్లలు మెట్టుకదులు
పొగడలు పలుపులు పున్నాగములు పగ్గ
ములు సహకారముల్ పూనుగాడి
కురవకానీకమూలపుకోలకైర
వములు మునుకోల కోకముల్ వాహనములు
గా వసంతుండు సూతుడై పూవుతేర
నెరయ కుసుమాయుధంబులు నింపి తెచ్చె."

ఈ పద్యములో రథమునకు సంబంధించిన స్వల్పాతిస్వల్పమైన అంగములనుసైతము చేర్చినాడు. లోకములోని ప్రతివస్తువునకు సంబంధించిన సర్వ వివరములు కవికి తెలిసియుండవలెను. నన్నెచోడు డే వస్తువును వర్ణించినను సమగ్రపరిశీలనశక్తి వ్యక్తమగుచుండును.

మన పురాతనాంధ్రకావ్యము లన్నియు రూఢములుగా నిర్ణయింపబడిన కవిసమయములను పాటించినవే. నన్నెచోడుడు పాత కవి సమయములనే స్వీకరించెను. అయినను తన ప్రతిభచేత వానికి మెరుగులుదిద్ది క్రొత్త ఊపిరి పోసెను.

"త ఏవ పదవిన్యాసాః త ఏవార్థ విభూతయః
తథాపి నవ్యం భవతి కావ్యం గ్రథనకౌశలాత్"

ఈ గ్రథనకౌశలము కల్గిన నన్నెచోడుడు మాగిపోయిన కవిసమయములను స్వీకరించి వానిని "మధుమాస ఇవ ద్రుమాః" చేసినాడు. విరహసంతప్తయైన గిరిజను ఆత్మసఖులు ఈ విధముగా ఊరడింతురు.

"బాల నీవేవలి కాలోరగంబని
మలయానిలంబు నీ వలన రాదు.
కమలాస్య నీ కనుగవ చకోరములని
వెన్నెల సోరదు నీయున్నయెడకు
అబల నీ యెలుగు పికారావమని నీకు
మాతమ్మి కొమ్మలు చూపజెలచు
చపలాక్షి నీ ముక్కు చంపకమను భీతి
అలులు నీ పొడగని అలయబాలు
వనిత నీకు ప్రాణవల్లభుండై మది
నొలసె శివుడు పాయకుండుననియ
పేదముడు శరములు నీ దెస రానోడు
ఏని కేల నీవు వెఱచెదమ్మ."

జడను కాలసర్పముతో పోల్చుట కవి సమయము. పామునకు పవమానమాహారమనుటయు కవి సమయమే. ఈ రెండు సమయములను ఒకచోట చేర్చి ఊహించినాడు నన్నెచోడుడు.

ఒక క్రొత్తభావము వ్యక్తమైనది. మలయానిలమామెపైపు రాకుండుటకు కారణ మామె వేణీభరము.

సద్యఃస్ఫురణము కల్గించుభావముకాదిది. ప్రాచీన కవిసమయములను నెమరువేసుకొన్నచో తప్ప దీనిలోని ఆత్మ ఆవిష్కృతముకాదు. ఈదృశముగనే ప్రతి పంక్తిలో ఒక కవిసమయమును ప్రవేశపెట్టి నూత్నత్వము ప్రతిపాదించినాడు. అందఱెఱిగిన కవిసమయములనే అందముగా వాడినాడు. అతడుపయోగించుకొన్న రీతిలో ఉన్నది వైచిత్రి.

నన్నెచోడుడు కొన్నిచోట్ల వర్ణనలకొరకే వర్ణనలు చేసినట్లు కన్పించును. దక్షుడు శివనింద చేయుట సహించక సతీసాధ్వి కోపాగ్నిలో కాలిపోవుచుండును. ఆమె "లక్కబొమ్మ నగ్గలముగ వహ్ని చుట్టుకొని కాలురయంబున" జ్వలించిపోయినదనుట సహింపగలము. గాని "అశోకవల్లి విరిపువ్వులమీద గ్రాలు కెందలిరులో" అన్నట్లుగా అగ్నిజ్వాలలెగసినవి అనుట సహింపలేము. మహోద్విగ్నయై ఆమె మండిపోవుచున్నప్పుడు ఇంత తీయగా వర్ణించుట ఔచిత్యబాహ్యము. అన్నితావులందు వర్ణనలు, అలంకారములు జొన్పినచో ఔచితికి చితిపేర్చినట్లగును. ఔచిత్యపోషణలేనిచో అలంకారములు, వృత్తులు, గుణములు కేవలబాహ్యశోభాహేతువులే. ఆత్మకానేరవు. అందుకే "ఔచిత్య స్సరస సిద్ధస్య స్థిరం కావ్యస్య జీవితం" అని క్షేమేంద్రుని మతము. ఈ ఔచిత్యము పద, కావ్య, ప్రబంధ, రసాలంకారాది నిష్ఠమని క్షేమేంద్రుడు అభిప్రాయపడెను. ఆనందవర్ధనుడు సైతము "అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణ" మనియు "ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిషత్పరా" అనియు వెల్లడించెను. ఈ ఔచిత్యమును నన్నెచోడుడు వర్ణనల విషయములో ఎట్లు నిరూపించినది మాత్రమే ఇక్కడ పొందుపరుతును.

"శివుతనయు బలపదాహతి
కవిసినమెయి ధూళివోవ కడిగికొనంగా
తివిరి చను కరణి నిజమతి
రవి రయమున పశ్చిమాంబురాశికి జనియెన్"

కుమారస్వామి తారకాసురునిపై జైత్రయాత్ర సాగించుచున్న ఘట్టము. అతని సైన్యములు నడువగా లేచిన ధూళి సూర్యుని మెయినిండ నిండినది. ఆ దుమ్మును కడుగుకొనుటకై సూర్యుడు అపరాబ్ధికి వెడలుచున్నాడని నన్నెచోడుని ఉత్ప్రేక్ష. సూర్యాస్తమయ వర్ణనము నించుమించు పురాతనాంధ్రకవు లందరు చేసిరి. అయితే ఆ వర్ణనలు కథకుగానీ, ఆయా సన్నివేశములకుగానీ ఎంతవరకు మెరుగుపెట్టిన వనునది విచార్యము.

అల్లసాని పెద్దన మనుచరిత్రలో సూర్యాస్తమయ వర్ణనలో ఒకచక్కని ఉత్ప్రేక్ష చేసెను. అయితే అది అన్యకాంతను ప్రలోసిపుచ్చిన పరమభాగవతోత్తముని మహాసురాధముడుగా చిత్రించినది. కామాంధురాలై కదియవచ్చిన వేల్పువెలదిపై సానుభూతి చూపునదిగా ఉన్నది. అందుచేత పెద్దన బోధించనున్న కథాంశమునకు దెబ్బతగిలినది. నన్నెచోడుడు చేసిన పైవర్ణన వర్ణన కోసమే చేయబడినదికాదు. పైగా ఈ పద్యములోని వర్ణనకుమారుని సైన్యోద్ధతికి దోహదకారిగా ఉన్నది.

అలౌకికప్రతిభావంతుడైన కవి ప్రకృతిని అనుకరించినను స్వచ్ఛందతను విస్మరించడు. చిల్లపెంకులనుసైతము స్వర్ణకణికలుగా చిత్రించును. కవి కేవలము సుందరవస్తువులనే వర్ణింపడు. సన్నివేశమునకు వన్నెదెచ్చినచో జుగుప్సావహములైన విషయములను గూడ మహోత్సాహముతో వర్ణించును. ఉత్తమకవి బీభత్సవర్ణనము చేసినను సామాజికులకు వెగటు కల్గించదు. రమణీయతనే ప్రతిపాదించును. ధనంజయుడు దశరూపకములో ఈ విషయమే విశదీకరించినాడు.

"రమ్యం జుగుప్సితముదార మథాపి నీచం
ఉగ్రం ప్రసాదిగహనం వికృతంచ వస్తు
యద్వాప్యవస్తు కవి భావక భావ్యమానం
తన్నాస్తి యన్నరసభావ ముపైతిలోకే"

కవి భావనాప్రపంచమున సమస్తవస్తుజాలము సౌందర్యమున కాలవాలము. నన్నెచోడకవి ఈ అభిప్రాయమున కాయువుపోసెను. బీభత్సరస ప్రతిపాదన సందర్భమున రమణీయతనే ప్రదర్శించెను. ఆ పట్టులలో రీతిసైతము వైదర్భియే. ఇతని" రమణీయ భయానకమే" తిక్కన పెక్కుతావుల అనుసరించెను.

"ఉరుపాశములు మృదుకరపాశములు గాఁగ
చక్రముల్ పృథుకటిచక్రములుఁగ
బాణముల్ సుతదృష్టిబాణమ్ములుఁగ కార్ము
కమ్ములు భ్రూకార్ముకములు గాఁగ
మండలాగ్రము లాస్యమండలమ్ములుఁ గుంభి
కుంభముల్ గురుకుచకుంభములుఁగ
వజ్రముల్ సితదంతవజ్రములుఁగ తత్ప్రి
ఘట్టన పటురతి ఘట్టనముగ

విక్షతములు బహునఖక్షతములు గాఁగ
రక్తిరసము వోడము రాగరసము
గాఁగ సుభటవరుల కవిసి రణాంగన
ప్రౌఢి మెరసి చేసె పరవశులుగ."

ఈ పద్యము చదివినప్పుడు ఏదో యుద్ధమును వర్ణించినట్లుగా అనిపించదు. శృంగార క్రీడ మాత్రమే స్ఫురించును.

మానవల్లి రామకృష్ణకవిగారి అభిప్రాయ ప్రకారము ఉద్భటుడు శ్లేషప్రియుడు. నన్నెచోడు డతని అనుకరించియున్నచో శ్లేషలను కొల్లలుగా దిగుమతిచేసెడువాడే. రెండు మూడు తావులలో తప్ప చోడుడు శ్లేషను చవిచూపలేదు. పార్వతి శివునిగూర్చి తపస్వినిగా మారినది.

"మేని కుంకుమరాగంబు మెలత కొప్ప
మోవి తాంబూలరాగంబు మొగిననాసి
చారుతరయవ్యో మాసె నా శైలతనయ
పీతరాగంబు ప్రకటించు విధముతోడ."

అందులో "పీతరాగము" ఉదాత్తమైన శ్లేష.

శక్తివంతమైన సమాసచాలనము నన్నెచోడునికి వల్లెగుప్పె బండివనక. అవతారికలో ఇతడు "జాను తెనుంగు"ను ప్రస్తుతించినను, దేశీయమార్గము చుండు దువ్వినను, సంస్కృతప్రభావమునుండి తన్ను తాను విడిపించుకొనలేకపోయినాడు. పసగల తెలుగు పలుకు బళ్ళను ఎంతగా ప్రయోగించుటకు ప్రయత్నించినను సుదీర్ఘ సంస్కృత సమాసములను గుప్పించక తప్పలేదు. అచ్చమైన కవి అత్రి నిర్బంధములకు, నియమములకు దాసోహమనడు. కవిత్వము 'నీరము' వలె ఆవహించి నప్పుడు కవి తాను సంస్కృత పదము ప్రయోగించు చున్నాడా? తెలుగు నుడిని గిలుకుచున్నాడా ఆలోచించడు. నన్నెచోడుడు వర్ణ్యవస్తువును మనో మండలములో సాక్షాత్కరించుకొనెను. వసంతంపై వంటి శబ్దములు లేఖినీముఖాన ఉద్గతములైనవి.

"గత సంతాపము, శీతలీకృత మహాకాంతాంగ
మృత్యుద్గత
స్మిత కుందోత్కర కేతకీ కుటజ
రాజిభ్రాజితా పోద మూ
ర్జిత వల్లీ ప్రకరంబు వర్ధితశిఖిశ్రేణి
ప్రమోదంబు ర
మ్యతరంబై విశలంబనం బరగె వర్షారంభ
మత్యున్నతిన్."

మన్మథుడు మహాదేవుని సందర్శించినప్పుడు నన్నె చోడుడు వేసిన సమాసములు మనోరంజకములైనవి.

"స్ఫురదాధార సరోజపీఠహృదయాం
భోజాత రంధ్రార్పిత
స్మరణాయత్త సముద్ధితోజ్జ్వలతరాత్మ
జ్యోతిరుద్ధాంగరుక్
పరసస్ఫాటికరమ్య హర్మ్య కనక
స్తంభంబో నా పరువ అ
త్యుగ్ర జూటాకృతినున్న శంభు దెస
నానుల్కెన్ మనోజుండు డెదన్."

సమాసముకన్న మిన్నయైన భావము-భావమును తెలడన్నిన సమాసము. ఈ రీతి సమాసరచనను తిరువాత నాచనసోముడు, కృష్ణరాయలు, తెనాలి రామ కృష్ణుడు అనుసరించిరి.

సమాసచాలనములోనే సంతృప్తిపడక నన్నె చోడుడు సందర్భోచితముగా చిక్కని తెలుగు పలుకు బడులను ప్రయోగించినాడు. "తుత్తుమురుగొని ప్రేలుట, ఒడలు మండుట, ఎలుకమీది కోపమున ఇల్లేర్చుట, కనుగీటుట, నోరుపాఱుకొట్టుట, ప్రక్కలు విఱుగనగుట, పసివాళులువాడుట, పలుచని పూతలు, కూలిగూలి, జున్ను దిన్న రొట్టియ, ఒక్కతలకు మొగములు రెండగుట, నోటికంప, పాలపాప, దండుగ, పందిరిపై ఉప్పుగంప లెంపవెట్టుట, మున్నగు జాతీయములు, సామెతలు, పలుకుబళ్ళు కొల్లలుగా ప్రయోగించినాడు.

బహుముఖప్రజ్ఞాశాలియై, కవితారంగములో ఎన్ని పోకలు పోవలయునో అన్నిటిని రాజఠీవితో పోయిన నన్నెచోడుని తదనంతరాంధ్రకవులనేకులు అనుకరించినారు. అయినను అవతారికలో ఆంధ్ర కవులను స్తుతిచేసినప్పుడు గూడా పల్వురు నన్నె చోడుని పేరైన యెత్తికపోవుట దురదృష్టము. తిక్కన రమణీయ భయానక చిత్రణము, మన స్తత్వనిరూపణము విషయములో నన్నెచోడుని అనుకరించెను. యుద్ధ ఘట్టములను చిత్రించుటలో తిక్కనకు నన్నెచోడు డెంతో ఉపయోగపడినాడు. పాలకురికి సోమనాథుడు పదప్రయోగములో, వ్యక్తీకరణములో నన్నెచోడుని దండిగా అనుకరించెను. నన్నెచోడుని "రోహణాచల" అను పద్యమును పండితారాధ్య చరిత్రములో "పర్వత

ప్రకరణము"లో అనుకరించెను. పోతన అంత్యాను ప్రాసములు అనుప్రాసములు నన్నెచోడుని పద్ధతిలో నే ప్రయోగించెను. నన్నెచోడుని,

"పుష్కర షండములో గల
పుష్కర మూలములుగ బలముల గొనుచుఁ స
త్పుష్కరతలముల మును మిడి
పుష్కరముల బెడికివైచు పుష్కరములకున్."

అను పద్యము చదివిన పిమ్మట పోతన్న వ్రాసిన క్రింది పద్యము చదివినచో బింబ ప్రతిబింబ భావము స్ఫురించును.

"తోయములు దెమ్మ మాకీ
తోయము వేటాడ నెరవు దొరకదు ఘనచే
తోయుత డప్పి జనించెను
తోయము వారలును లేరు దుస్సహమనఘా."

ఇంతేగాక నన్నెచోడుడు ప్రయోగించిన

"హారము లాశ్రితభాషా
సారము లాసకలవస్తు సంపూర్ణాలం
కారంబులు శ్రీవర్ణాలం
కారంబులు చెవులు సుకవి కావ్యము వోలెన్."

వంటి పద్యములు పోతనామలలో పలుచోట్ల కన్పించును. పైవారేకాక నన్నెచోడుని జక్కన, మంచన, నాచన, పింగళిసూరన, రామకృష్ణుడు మున్నగువారు అలతిగా అనుసరించిరి.

నన్నెచోడునిపై ఇతర కవుల ప్రభావము ప్రబలముగా నే యున్నది. ఏ మహాకవియు తన కావ్యమును ఐంద్రజాలికునివలె అభూతసృష్టి చేయడు. అతని సృష్టిలో కొంత విలక్షణత, అపూర్వత ఉండవచ్చును. నన్నెచోడుడు కాళిదాసు కుమార సంభవమును పేర్కొనకున్నను ఆ మహాకావ్యమునుండి కొన్ని శ్లోకముల అర్థమును సంగ్రహించినాడు. కథ చాలవరకు అదేయని వేరుగా చెప్పనవసరము లేదు. కాళిదాసు వ్రాసిన

"మధుద్విరేఫః కుసుమైకపాత్రే
పపౌప్రియాంస్వా మనువర్తమానః
శృంగేణ సంస్పర్శ నిమీలితాక్షీం
మృగీమ కండూయత కృష్ణసారః"

"దదౌ రసాత్పంకజరేణుగంధి
గజాయ గండూషజలం కరేణుః
అర్థోపభుక్తేన బిసేనజాయాం
సంభావయామాస రథాంగనామా."

"గీతాంతరేషు శ్రమవారిలేశైః
కించిత్సముచ్ఛ్వసిత పత్రలేఖం
పుష్పాసవాఘూర్ణిత నేత్రశోభి
ప్రియాముఖం కిం పురుష శ్చుచుంబే."

అను మూడు శ్లోకములలోని భావమును నన్నెచోడుడీ విధముగా అనువదించెను.

"కరి యిచ్చె నరమేసి కరిణికి సల్లకీ
పల్లవ మల్లంబు పల్లవింప
మృగ మర్థి కబళించి మృగికిచ్చె అంబుద
ర్భాంకురంబులు చిత్త మంకురింప
హంస పెక్కువ నిచ్చె హంసికి నోరొత్తి
ఎలదూడు మొగముల నెలమి మిగుల
భృంగము ద్రావితో భృంగికి దయనిచ్చె
మధుధార సుఖరాగ మదము దలక
కిన్నరుండు గ్రోల్చె కిన్నరి సీనల
రాగరసము మేన రాగమెసగ
మధువిడంబనమున మగలును మగువలు
విరలిగొనిరి మదనపరవశమున."

ఇంకను పార్వతీతపస్సందర్భమున ఒకటిరెండు శ్లోకములను అనువదించెను. నన్నయను సైతము నన్నెచోడుడు స్మరించలేదు. "మార్గసత్కవీశ్వరుల, దేశిసత్కవుల" అని మాత్రము వ్రాసెను. నన్నెచోడుడు నన్నయను అనుకరించిన పట్టులు బహుస్వల్పములు. ఎందుకనగా అతనితెన్నె వేరు. నన్నెచోడుని ఈ దిగువ పద్యము నన్నయ భీష్ముని చరిత్రములో వ్రాసిన "అమల సుధారమ్యహర్మ్య తలముల" అను పద్యమునకు అచ్చమైన ప్రతిబింబముగా భాసించును.

"కలహంసకలరవాకలితనిస్వరముల
సారససరసాబ్జషండములను
రోలంబరుతి లతాందోలంబులను శుక
మంజులస్వన పుష్పమండపముల
కలకంఠరణిత మాకందవనముల పా
రావత ధ్వని మందిరస్థలముల
కేకి కలధ్వాన గిరి కందరంబుల
లావుక నినద లీలాతలముల
అప్పటప్పటి కనురాగ మగ్గలింప
కామరస మంతకంతకు గడలుకొనగ

# నన్నెచోడుని కవితాశక్తి

నలి రమించిరి కైలాసనగముమీద
పరమ సుఖలీల నా జగత్పతియు సతియు."

ఈ పద్యములోని భావము, శయ్యారీతి నన్నయ వే. ప్రాచీనమహాకవులలో నన్నెచోడుని దొక ప్రత్యేక పీఠము. తొలిసారిగా మత ప్రతిపాదన చేయుటకు కవిత్వమును సాధనముగా స్వీకరించినవాడితడే. ఇతని తరువాత సోమనాథాదులు దానిని బలపరచిరి. పురాణములు తెలుగులోనికి తర్జుమా చేయబడుచుండు యుగములో స్వతంత్ర కావ్యశంఖము నొత్తిన కవిరాజశిఖామణి నన్నెచోడుడు. కేవలము కథ చెప్పుటయే కవిత్వ ధర్మము కాకూడదని, వర్ణనలతో, అలంకారములతో సహృదయాహ్లాదము కల్గించుటయే కావ్యప్రయోజనమని ఎలుగెత్తి చాటి, జానుతెనుగు నాదరించి, దేశిసత్కవులను ప్రస్తుతించి కండగల గుండెగల కవిత్వము చెప్పిన కవిచూడామణి నన్నెచోడుడు. అయితే ఇతని వాక్కు పెడుసు - పలుకుబడి గడుసు. ఇతడెంత తియ్యగా చెప్పినను ఏదో కొంత చిరుచేదు స్ఫురించుచుండును. ఎంత సరళముగా భావమునందించినను ఏదో ఒక అస్పష్టత పల్నాటి కారమువలె హృదయరసనములకు చుఱ్ఱుమని తాకును. ఈ గుణములవలన ఇతనికి రాదగినంత గౌరవము రాలేదు. ఇతని మతపాక్షికత తరువాత కవులకు రుచించకపోవుటవలన ఎవరును ఈతనికి అక్షరాభిషేకము చేయలేదు. ఇరువదవ శతాబ్దిలోనైనను విస్మృతకవుల పట్టికలో చేర్చి ఈ కవిరాజశిఖామణిని ఆంధ్రలోకమున కందించిన మానవల్లి రామకృష్ణకవి గారు సదా స్మరణీయులు. నన్నెచోడుని కావ్యసంద్రమున్నన్నినాళ్లు మానవల్లివారి కీర్తిచంద్రిక తెలుగునాట వెలుగుపూతలు పూయును. జిలుగు కాంతులు కాయును.

# ఇల్లు జాగ్రత్త

శ్రీ పురాణం సుబ్రహ్మణ్యశర్మ

## 1

'ప్రేమకి పడిశం పట్టినట్లుంది-' అని కాస్త నొక్కి వాక్యం పూర్తిచేసింది యింటావిడ.

'ఇది ఏదో కథలో మొదటి వాక్యమైతే, ఎంత రసాభాస అవుతుందో ఆలోచించావా?' అన్నాను కావాలని.

'మనకి ప్రేమ అనే అరుసెల్ల అమ్మాయివుందని, దానికి పడిశం పట్టిందని వాళ్ళ అమ్మ చెబ్తోందనీ - ప్రపంచానికి తెలీక మెల్లాగ?' అన్నాను కాస్త నాటకంలోలా అభినయిస్తూ.

'చాల్లెండి మీరూ మీ నాటకాలూను......' అంటూ కిటికీ తలుపుల్ని తెరిచి తెరల్ని సర్దుతూ 'ఉక్క దంపేస్తోందండీ! ఏం వూర్వో యేం పాడో... స్నానాల గదిలో నీళ్లు లేవు. వంటగదిలో ఒక్కబొట్టు కూడా రాలటం లేదు. దొడ్డిలో మంచినీళ్ళన్నా రావటం లేదు. ముదినష్టం పంపులు ఎందు కిన్ని?' స్వగతం చెప్పుకుపోతోంది కిటికీ తెరల్ని కోపంగా వూడ లాగుతూ. నాకు అకస్మాత్తుగా తెలివొచ్చి పడింది. 'అను! ఏమిటీపని-చూస్తున్నావా నా వేషం? నీ కింత మతిపోతూందేం? ఉక్క దంచేస్తూందని నే నిల్లా అర్ధనగ్నంగా తగులడ్డానా-నువ్వా కిటికీ తలుపు లన్నీ బార్లా తెరిచేస్తావుగదా! నలుగురూ యేమనుకుంటారేం?' నేను చిన్న తువ్వాలుముక్క చుట్టుకుని వాలు కుర్చీలో పేపరు చూస్తూ అఘోరిస్తున్నాను. ఆ విడ పల్చటి చీర చుట్టుకుని తలంతా విరియబోసుకుని వుసు గుసురంటూ వచ్చింది.

'అల్లా వెళ్ళి రెండు బాల్చీలు నీళ్లు పట్రా కూడదూ? చక్కగా స్నానంచేసి అటెక్కడికన్నా సాయంత్రంపోయి రావచ్చు!' నాకసలే వుడుకు మోతుతనంగా వుంది. పై పెచ్చు సన్నాయి నొక్కులు...'చాల్లే సంతోషించాం! తెలివి తేటలు.' అని చిరాగ్గా అరిచాను. కాస్త చిన్నబుచ్చుకున్నదల్లేవుంది. నెమ్మదిగా గదిలో తచ్చాట్లాడుతూ పవిటతో విసురుకుంటూ - 'మగవారు - నలుగురుబిడ్డల తండ్రి. చదువుకున్నవారు. అంతో యింతో పేరూ ప్రఖ్యాతివుంది నలుగుర్లో. మనపని మనం చేసుకోవటం తప్పా - అల్లా చిర్రు బుర్రుమంటా రెందుకూ? నాకు తెలుసులెండి- మీ కెందుకో కొద్ది కసిగావుంది నామీద.' కాస్త గొంతుక బొంగురు పోయింది.

'కసా? నీమీదా - నాకా? ఎందుకూ?' ఆడ వాళ్లకు విచిత్రంగా వస్తాయి కన్నీళ్లు. నా చేతుల్లోంచి పేపరుజారి వొళ్లో పడింది మోకాళ్ల కడ్డంగా.

'మీరు రమ్మనకుండా యిల్లా వచ్చానని...' ముఖంమీంచి చేతుల్ని లాగుతూ- 'హోస్-అదా... ఛా...ఛా...నామాట విను. నాకల్లాటి దేం లేదు. ఎంత వొట్టుపడితే అంత వొట్టు!' అన్నాను.

నులకమంచంలో పసిది ఖుల్లుఖుల్లున దగ్గుతోంది లుంగలు చుట్టుకుపోతూ. స్నానాలగదిలో పంపు బుసలు కొడ్తోంది—నీళ్లు వచ్చే సూచన! పాపని ఎత్తుకుని క్షణంలో జేగురించిన మొహంతో కాళ్లీడ్చుకుంటూ వెళ్లిపోయింది గదిలోనుంచి.

'హమ్మయ్య!' అని జావకడిలా కుర్చీలో వాలిపోయాను. ఎంత రసాభాస? నిజంగా తనురావటం ఇష్టంలేదని ఎలా కనిపెట్టేసిందో ... కనిపెట్టేసింది. పదేళ్లు కాపురం చేసిన మనిషి...అంతమాత్రం గ్రహించుకోలేదా? నాకుమాత్రం తల కొట్టేసినంత చెడ్డ అవమానంగా వుంది.

నలుగురైదుగురు ఒకచోట చేరి కష్ట సుఖాల్ని గూర్చి చెప్పుకునేటప్పుడు జీవితాల్ని గూర్చి తెలుస్తూన్న సంగతులు మహాదారుణంగావుంటున్నాయి. చేసుకున్న పెళ్ళాం పిల్లల్తో కాపురానికొస్తే...హఠాత్తుగా చెప్ప

కుండా చెయ్యకుండా వచ్చినందుకు ముఖం ముటముటలాడించుకుంటున్నాను. నా అసమర్థత కప్పిపుచ్చుకుందుకు గట్టిగా కసిరేస్తున్నాను.

ఇది ఢిల్లీ !

గుండె ఝల్లుమంటోంది !

ఈ పతాక మన శాంతిపతాక—

దీని నీడనే నేడు నేను భార్యాబిడ్డలను చీదరించుకుంటున్నాను.

శుభం మంగళానిభవంతు !

పాపం మిమ్మల్ని వదిలి వుండలేనండీ అని చెప్పడానికి నోరురాక-హఠాత్తుగా వచ్చి ఆశ్చర్యపెట్టి సంతోషపడదామన్న ఆశతో వచ్చి యేం చూసింది?

గుండె ఝల్లుమంటోంది.

ఢిల్లీ !!

—ఇది అసమర్థతకు రాజధాని !

పాపం శమించుగాక !

మా ఆవిడ్ణాపకండి చెబుతుంది. ఏం చూశావమ్మా వచ్చినరోజు?

తెల్లబోయి కొయ్యబారిపోయిన నా ముఖం !

ఆ తర్వాత—

దారిపొడుగూతా వర్షంలా తిట్లు !

'బుద్ధిలేదూ! నువ్వేమన్నా ఇంగితజ్ఞానం వున్న మనిషివేనా? ఎంతుకూ ఇన్నాళ్ళు చేశావ్ కాపురం? నాలుగునెల్లు కొంపలో పడివుండవే అని పుట్టింటికి పంపితే-నేను ఇలావచ్చి ఢిల్లీలో పాదం మోపానో లేదో...వెళ్లాలన్నా కాకుండా తయారయ్యావ్-ప్యాసుముక్క ఎరక్కపోయి నీ చేతులో పెట్టినందుకు ఇదా శాస్తి! ఇప్పుడిక్కడ కొంపయేదీ?...రైలంటూ పూరీకో వెగదా అని పాతికో పరకో చేత్తో పుచ్చుకుని రైలెక్కావ్? ఇక్కడ నాకు ఇంకా జీతపురాళ్లన్నా వచ్చి యేడవలేదాయె!' ఇదంతా కోపంకొనట్లా యీ అవమానాన్నంతా తుడిచేసుకుంటూ తెచ్చిపెట్టుకున్న నవ్వుతో-'ఈ భాగోతమంతా యిక్కడ ప్లాటుఫారం మీదేనా...యింటికి వెళ్లాక మీరెన్నన్నా అనొచ్చు నేను పడొచ్చు! మామూలేగా—' నేను యింకా రెచ్చిపోయి తారస్థాయిలో—

'హాస్యమాడుతున్నాననుకున్నావా? ఇల్లేవిటి నీ బొందా నా బొందాను...జాఫతీలో బెడ్డింగ పెట్టుకుని అఘోరిస్తూంటేనూ—' నాకింకా బాగా కళ్లకు కట్టినట్లుంది.

'అయ్యో-ప్రేమను ఎత్తుకొని ముద్దాడలేరమండీ? చంకలో చంటిపిల్ల మీ కేకలకు బిక్కచచ్చిపోయి ఎల్లా మిటుకూ మిటుకూ చూస్తోందో...' నేను మతిపోయినట్లు ఆవిడగారు సంసారం నిమిత్తం తెచ్చిన పీటలు జాడీలు రుబ్బురోలు వగైరాలు వగైరాలు చూస్తూ కొయ్యబారిపోయాను. ఆ సామానులోనే యిరుక్కుని నిర్ఘాంతపోయి కూర్చున్నారు నా పెద్ద కొడుకూ చిన్నకొడుకూనూ. నేను వాళ్లను చూడనన్నా లేదు. ఈలోగా రాణీగారి తమ్ముడొచ్చాడు. వీడు కూడా వున్నాడన్నమాట ! — వుద్యోగం కోసం రాలేదుగదా! కొంత అనుమానంగా చూశాను. అప్పటికప్పుడే వాడు న్యూఢిల్లీ ప్లాటుఫారమంతా కలయ తిరిగొచ్చాడు. మా ఆవిడ తనకు జరిగిన మర్యాద అప్పుడే మర్చిపోయిందల్లే వుంది.

'అడేవిటండీ—వాణ్ణి పలకరించరండీ!' అంటూ వెనకేసుకొచ్చింది. జండాకొయ్యలా ఎదిగిపోయాడు. నల్ల కళ్లద్దాలూ—ప్లాస్టిక్ బెల్టు-సిల్కు బుష్‌కోటూ—ఖరీదైన బూట్లూ—సిల్కు రుమాలుతో కళ్లజోడు తీసి తుడుస్తున్నాడు.

'ఏరిరా యీ మాటైనా ప్యాసయినావా?'

'హూఁ!'—పూర్తిగా మాట్లాడ్డు గావల్ను! తమ్ముడి దర్జాకు మురిసిపోతోంది కాబోలు—

'పెళ్ళిసంబంధం వచ్చిందండీ. ఐదువేలు.... సంబంధం చేస్తారేమోనని నాతో ఢిల్లీ చూస్తానని వచ్చేసాడు. సరే రమ్మన్నాను.

'తేడిచావు' అని లోపల్నే అనుకుని 'పదపద ఆనక తాపీగా చెబుదువుగాని కబుర్లు. ఆఫీసు మధ్యలో వచ్చేశాను.' అని లోపల ఆక్రోశంతో సంసారం సంసారాన్ని న్యూఢిల్లీ స్టేషను కెదురుగానున్న 'లేడీ హార్డింజ్ శరాయ్'లో చేర్పించేసి మా బావమరిదికి వార్నింగు యిచ్చాను—

'నేను మళ్ళీ సాయంకాలం వచ్చేదాకా యెక్కడికీ కదలకుండా సామాన్నూ మనుష్యుల్నీ కనిపెట్టుకునుండమని.'

## 2

స్టేషను పేరు న్యూఢిల్లీ అయినా ఆ ప్రదేశాన్నంతా 'పాహాడ్‌గంజ్' అంటారు. లోకవ్యవహారానికి ఆ స్టేషన్ను కూడా జనం పాహాడ్‌గంజ్ స్టేషననే పిలుస్తూంటారు. అక్కడే పెద్ద బజారు, యింకా లోనికి పోనుపోను కూరల మార్కెట్టు అదీ వున్నాయి. న్యూఢిల్లీ స్టేషను ఆవరణ యెంత విశాలంగా తీరిగా సుందరంగా వుంటుందో ఆ కాస్త మేరా దాటాక అంత చెత్త గలీజుగానూ మురికికూపంలానూ వుంటుంది. ముఖ్యంగా 'లేడీహార్డింజ్ శరాయ్' కెదురుగా సుమ్రపేటి చిన్న పార్కు కట్టారు. అందులో పగలస్తమానూ సోమరులు పడి దొర్లుతూంటారు. ఈ పార్కుకు ప్రక్కనే ఒక పెద్ద చెట్టు నీడను హమేషా మంగల్లు కత్తులు నూరుకుంటూ కత్తెరలను టకటకలాడిస్తూ నిత్యకల్యాణం చేసి ఆ జుట్టునంతా పార్కునిండా పోసివుంచుతారు. ఇది చాలనట్లు టాంగావాళ్ళు గుర్రాలను తెచ్చి నిలువుగా అవి అన్నిపనులూ అక్కడే చేసే ఆ మార్గంగుండా నడిచి వెళ్లవలసివస్తే పశువులకొట్టంలోంచి దాటుతూన్నట్లుంటుందిగాని — రాజధాని పరువు యెవరూ యెక్కడా నిలుపుతున్నట్లు కనపడదు. ఇక బజారులో దారికడ్డంగా 'హాకర్లు' చక్రాలబళ్లని తోసుకుంటూ 'పచ్చి అల్బకరాపళ్ళు - లీచీపళ్ళు - చర్మం నల్లగా కమిలిపోయిన అరటిపళ్ళు - ముక్కలు ముక్కలుగా కోసిన పుచ్చకాయలు - మామిడిపళ్ళు' కూచి అమ్ముతూంటారు. ఈ బజారులోనే అన్ని దుకాణాల్లోనూ కలిసిపోయి అనుగుణంగా వలపరం పుట్టించేలా కసాయిదుకాణాలున్నాయి. కాని యిక్కడివారికే అన్నివస్తువులూ చవక అంటారు. రైల్వే స్టేషను కెదురుగుండా వున్న దుకాణాలే కాకుండా, పేవుమెంట్లుమీద ఒక మంచమంచాన్ని గడెక్రతలో యెత్తి వుంచి దానిక్రింద కొన్ని డజన్ల బూట్‌పాలిష్ డబ్బాలపేరు వగైరా వగైరా కింద్రా లున్నాయి. ఈ ప్రాంతం యిలా ఎందుకుందని యెవరైనా ప్రశ్నిస్తే కాందిశీకులు వచ్చి పాడుచేశారని అంటారు. ఈ హార్డింజ్ శరాయ్‌దగ్గర ఇండియా టీ బోర్డువారి వాహనం వచ్చి నిల్చుని అణాకు మంచి టీ సప్లయి చేస్తూ వుంటుంది. ఈ రోడ్డు తిన్నగా కన్నాట్ సర్కస్‌లోకి వెళ్తుంది. దీనికి రైల్వేబడ్డీలకు మధ్యనున్న మేరలోంచి స్టేటు ఎంట్రీరోడ్డు వేశారు. ముఖ్యంగా రాష్ట్రపతి యింకా గొప్ప గొప్ప అతిథులు ఈ గలీజు చూడకుండా స్టేషనుకు వచ్చిపోవడానికి ఇరుప్రక్కలా సుందరమైన ఉద్యానవనాలు పెంచారు. ఈ రోడ్డులోనే రైల్వేబోర్డు మంత్రాలయం, ఉత్తర రైల్వే ముఖ్యాధికారి ఆఫీసు, ఐ. ఆర్. సి. యే. భవనాలున్నాయి. కట్టడాల శిథిలాలు, మొగలాయి దర్బారులు, రాజఘాటు, ఎర్రకోట, జుమ్మామసీదు, నిజాముద్దీను, హస్తినాపురం, హుమాయూను సమాధి, సఫ్దర్‌గంజ్, కుతుబ్‌మినార్, చాందినీ చౌక్, పార్లమెంటు, సెక్రటేరియట్, రాష్ట్రపతిభవనాలు చూడవలసినవే అయినా చూడకూడనివి చూడ్డానికి వీల్లేకుండా కట్టుదిట్టాలు చేశారు. ఢిల్లీలోని యిరుకుతనాన్ని మురికితనాన్ని కప్పుకుంటుకు కట్టుకున్న 'కన్నాటుప్లేసు' ఎంతసేపు తిరిగినా నేత్రానందకరంగానే వుంటుంది. కాని నేను ప్రశ్నించదలచుకుంటున్నది యిక్కడి సామాన్యుడు ఎట్లా జీవిస్తున్నాడు అని. పాలకులు పాలిస్తున్నారు సరే — ఈ కాలంలో పాలితులు ఎట్లా జీవిస్తున్నారు?

చెప్పమంటారా?

నాబోటివాడి జీతం సొంతకొంపలు కలవాళ్ళకొరకే అద్దెలకు చాలదు. సర్కారువారు యిచ్చేయిళ్ళు నాబోటివాడికి దొరకడానికి యింకా గెంతుపంచవర్ష ప్రణాళికల కాలం తీసుకుంటుంది. ఐతే కొందరు మహానుభావు లుంటారు. అట్టివారు తాము సర్కారు వారికి యిచ్చే అద్దెకు మరో పదో పరకో ముట్టచెప్పి వారి కనుసన్నల్లో మెలగడానికి యిష్టపడితేనైనా ఒక గది ఖాళీచేసియిస్తారు. ఇచ్చేముందు కొన్ని పరీక్షలు - ఇంటర్వ్యూలూ - స్క్రీనింగు వగైరా కార్యక్రమా లున్నాయి. మచ్చుకి—

'ఎక్కడ పనిచేస్తున్నారు — (మినిస్ట్రీ)'

'ఫలానా - ఫలానా.'

కొందరు బ్రహ్మచారులే కావాలంటారు. కొందరు సంసారులే వుండాలంటారు.

'ఎంత జీతం ?'

చెప్పాక పెదవి విరిచి—నాలుక బైటపెట్టి. తలకాయ ప్రక్కకు త్రిప్పి వాంతి వొస్తూన్నట్లు మొహం పెడ్తాడు.

'మద్రాసీ...'

'కాదు ఆంధ్ర...' అని చెప్పబోతే అంతా వాకబే లెద్దూ అన్నట్లు చూసి—'ఏవూరు?' ఆవూరు వాడికి చెప్పినా అర్థమయిచావదు. తరువాత ఆ గదిలో యిదివరకు వుంటూ వచ్చిన వాళ్లను గురించి ముఖ్యంగా భయంకరంగా వర్ణించి చెబుతాడు. అదే అదనుకొని యిదివరకు వున్న వాళ్ల అవలక్షణాలన్నీ వర్ణించాక— కొంచెంసేపు తన అభిరుచులూ తన చుట్టాల్లో గొప్ప పదవిలో వున్న వాళ్లను పరిచయం చేస్తాడు. ఈ ఆముదం మోతాదు తప్పించుకుందుకు మనం కాస్త ధైర్యంచేసి వాడి పిల్లల్ని పలకరించటమో, హఠాత్తుగా జన్మలో యెరగనట్లు వాడి సైకిలునో కుర్చీనో మంచాన్నో దేన్నో అతిగా మెచ్చుకుంటూన్నట్లు మాట్లాడాక మళ్ళీ క్రాసు పరీక్ష ఆరంభమవుతుంది.

'పెళ్లియిందా?' చెప్పాక 'ఎంతమంది పిల్లలు'- ఈ సమాధానం చెప్పాక గది యిచ్చేదీ లేనిదీ వాడి ముఖవర్చస్సులోనే బైట పడిపోతుంది. 'సంసారం ఎప్పుడు తీసుకువస్తావు?' అది వాడిని అడగాలని మనం అర్థం చేసుకోటాని కాస్తకాలం పట్టదు. ఇక్కణ్ణుంచి—'రేడియో వుందా? ఫాను... కుంపటి... ఇస్త్రీపెట్టె...' అన్నిటికీ లేవని చెప్పాక 'సామాను బాగా వుందా? చుట్టా లెవరైనా వస్తారా?' చివరికి మనకి మతిపోయే పరిస్థితి తెచ్చి పెడతాడు ప్రశ్నలతో.

ఇల్లాటి అదృష్టమేనా పట్టనివ్వకుండా యింటావిడ హఠాత్తుగా ప్రత్యక్షమయింది ఈ పరిస్థితి చెప్పుకోవటాని కెవరూ లేరు. అలవాటుగా ఆఫీసు వదిలాక బైట కొచ్చాను. ఎవరిళ్లకు వాళ్లు నియామకంగా సైకిళ్లమీద బస్సులమీద కార్లమీద చేరుకుంటున్న సమయం అది. మధ్యాహ్నమల్లా యెండ పొడిచింజేసా ఐదుగంటలయాక కూడా సూర్యుడు యింకా తందనాలు త్రొక్కుతున్నాడు. అల్లాగే కాళ్ళీడ్చుకుంటూ 'శరాయ్' లో కెళ్లాను. మాద్దునుగదా శ్రీమతి మా బావా పిల్లలూ స్నానాలు అవీ చేసి రెడీగా ముస్తాబై కూర్చున్నారు. మధ్యాహ్నమల్లా నిద్రపోయి వుంటారు ప్రయాణం బడలికా అదీ తీర్చుకున్నారు.

'ఎక్కడికర్రా ప్రయాణం?'

'ఈ చుట్టుప్రక్క లేమున్నా వుంటే కాస్త చూసి—పిల్లలకు యేమన్నా యింత తినిపించి కాస్సేపు అల్లా తిరిగివద్దాం. ఎంతకని యీ గదిలో యింతమంది మీా ముక్కుచావటం?' సరే పదమన్నాను—నెమ్మదిగా మద్రాసు హోటలుకు పోయి కాఫీలు ఫలహారాలు పూర్తిచేశాం. మా ఆవిడ కొంచెం నాజూగ్గానే ముస్తాబయింది. నేను పగలల్లా చాకిరీచేసి వున్నానేమో ఎక్కడా త్రాణలేదు వొంట్లో... కాస్సేపు యిద్దరమూ దొంగచూపులు చూసుకున్నాం. రాజీ పడబోతున్నామని గ్రహించినట్లున్నాడు మా బావమరిది— లేచి పిల్లల్ని తీసుకుని దూర దూరంగా తప్పించుకుని వాళ్ళకేవో ప్రశ్నలకు జవాబులు చెబ్తూ అవీ యివీ చూపిస్తున్నాడు. రీగాలు థియేటరు దాటి పార్లమెంటు వీధిలో కొచ్చాం. మా ఆవిడ జనాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తో నడుస్తోంది.

'దిక్కులు చూడకు దేనిక్రిందన్నా పడతావు.'

'అదేమిటండీ పల్లెటూరి దానికి చెప్పినట్లు చెబ్తారు?' రయ్యమంటూ వో స్కూటరు చక్కరకొట్టి మీదనుంచి దూసుకుపోయింది. దప్పున రెక్కపుచ్చుకు దగ్గరకు లాగాను.

'బావుందండీ! రోడ్డుమీద అల్లా జబ్బపట్టుకు లాగుతా రెందుకూ?' కోపంగా చూసింది.

'ఈపాటికి ఆసుపత్రిలో వుండేదానివి. అటు చూడు—' ఎవరో ఒక అమ్మాయి లాంబరెట్టా వెనుక సీటుమీద కూర్చుని మొగుణ్ణి గట్టిగా నడుంచుట్టూ చేతులేసి పట్టుకుంటోంది. ఆ స్కూటరు వేగానికి పమిట నిలవటంలేదు. ఎర్రటి పెదవులు—గోజారంగు బుగ్గలు—క్షణంలో రివ్వుమంటూ దూసుకుపోయారు.

'ఎల్లావుంది?'

'తగలెట్టేవుంది. పిల్లకిదేం పొయ్యేకాలం—' ఒకావిడ వెనుకసీటుమీద ఆరు నెల్ల పసిగుడ్డు నెత్తుకుని కూర్చుంది. మొగుడుగారు సైకిలు రొప్పుకుంటూ త్రొక్కుతున్నారు.

'అమ్మో! పడిపోతారేమోనండీ!—పిల్ల అఘాయిత్యంమండా—'

'నీయిష్టం వచ్చినట్లు అనుకో—నీమాట లెవళ్లకీ బోధపడవుగా!'

'ఏనా యిదేమిటండీ యిక్కడ ఆడవాళ్ళింత బరితెగించి పోయారు? ఒంటిమీద గుడ్డేందుకూ సిగ్గన్నది లేకపోయాక—రామ! రామ! అల్లా వీధిని తిరగటానికి పదిమంది కళ్ళు బడ్డానికి ప్రాణం పోదుటండీ?'

అంతాపోయి 'జంతర్ మంతర్'లో కూర్చున్నాం. చెరుకుముక్కలు కొని తెచ్చాను. పిల్లలు బఠాణీలు వేచిన శెనగలూ తెచ్చుకుంటున్నారు. మా బావ మరిది యింకా బిడియంగా దూరం దూరంగా తిరుగుతున్నాడు.

'ఏరోయ్ బావా—యిటురా?'

నాకు దగ్గరసావచ్చి కూర్చున్నాడు.

'మీ అక్క అంటుందీ యిక్కడ ఆడవాళ్లు బావులేరని—నువ్వేమంటావ్ కుర్రాడా?'

'బలే బావుంటారు...చక్కా జంటలు జంటలుగా సైకిళ్లమీద చల్లగాలిలో—'

'పాడుబుద్ధిలూ—ఇహ: పిడేంబాగుపడ్డాడూ?' చీకట్లో చేతులు త్రిప్పుతూ పెద్ద ఆరిందాలా చెప్తోంది. రోడ్లమీద యీడువచ్చిన అమ్మాయిలు ఐస్క్రీములు తింటూ ఖుషీసాగా సైకిలు త్రొక్కుకుంటూ పోతున్నారు. పంజాబీ డ్రెస్సుల్లో శరీర ముఖ్యభాగాలన్నీ ఆ సిల్కు తళ తళల్లో మెర్క్యురీ దీపకాంతిలో అంగుల్లో సైకిలు త్రొక్కటంలో యిమిడివున్న శ్రమలో చెమర్చిన ముఖాల్తో నవ్వుకుంటూ మైమరచిన వుల్లాసంతో ఎంతో సహజంగా అందంగా కదలాడేదృశ్యాల్ని—కళ్ళు పెద్దవి చేసుకుని అర్థంగాక చీదరించుకుంటూ లేచి నిలబడి—'ఇక పదండి పోదాం, నాకు తలపరంకూడా వస్తోంది.' అని లేచింది యింటావిడ. 'కవులూ రచయితలూ నానా యమయాతనాపడి వర్ణించే అందాలన్నీ చూసి సంతోషించలేక ముఖం ముడుచుకుంటా వెందుకూ? చూడు మగవాళ్లతో సరిసమానంగా నిర్భయంగా స్వేచ్ఛగా ఎట్లా వుండగలుగుతున్నారో స్త్రీలు. ఆడవాళ్లకీ మగవాళ్లకీ తేడాలు ఎక్కువ తక్కువలు యేమీ లేవు.'

'చాలించండి! ఆడా మగా తేడా లేదని వాదిస్తారెందుకూ? వంట చెయ్యటం, యిల్లు కనిపెట్టుకోవటం, పిల్లల్ని కనటం, బట్టలుతకటం, కాపురాలు చెయ్యటం మానేస్తారా? పెళ్లిళ్లు చేసుకోవటంలేదా—ఈ యేడుపంతా వీధుల్లో యెందుకంటాను నేను. ఆ యేడ్చే శృంగారమంతా నాలుగ్గోడల్లో, ముగుడన్న వాడికి పుస్తెకట్టినందుకు—అనుకోరి స్త్రీ చాలదా?'

'కాస్త అందంవుంటే అది నలుగురూ చూడకుండా దాచుకోమంటావ్. పొపుల పెట్టెలోనూ, పొయ్యి వూదేటప్పుడూ, పిల్లలికి నీళ్లు బోసేటప్పుడూ, నోములూ పూజలు పునస్కారాలు చేసుకునేటప్పుడు ఆడవాళ్లు చిన్నబట్టలు కట్టుకుని యింట్లో తిరగడం మానేస్తున్నారా? మనవూళ్లో యింటిప్రక్కావిడ యెన్నిమాట్లు గజంనర తువ్వాలు పీకకు చుట్టుకుని వుదయాన్న స్తమానూ యింట్లో దొడ్లో నూతి దగ్గర తులసి కోటదగ్గర మడివెలగబెట్టేస్తూంటే — నేనెందుకైనా కాస్సేపు అటు వెళ్తే నీవంత కొరకొరా చూసేదానివి? ఎవరి అలవాట్లు వాళ్లకు నచ్చుతాయి. మనకు సరిపడని కొత్త సంగతులనేకం వుంటాయి. వాటి నస్తమానూ అసహ్యించుకుంటూ కూర్చుంటామా?' పవిట చెంగు నోటికడ్డంగా నొక్కుకుంటూ—

'అమ్మొయ్ మీ కింకా జ్ఞాపకముందటండీ ఆవిడ–'

'పాపం ఆయన పోయాడు తెలుసా?'

'అంత హఠాత్తుగా—పోకేం చేస్తాడు? ఆ యిల్లాలు ముప్పొద్దులా హింసించుకు తినేది. ఇప్పుడావిడకింకేం కావలసినంత స్వేచ్ఛ—'

'అమ్మొయ్ పాపం—ఎంత చాకిరీచేసింది? అంత యిదిగా చూస్తుందనుకోలేదు సుమండీ! గోలు గోలున యేడ్చేసింది. ఇప్పుడా మనిషే కాదు.'

'పోయేవాడు యెల్లాగూ పోతున్నాడు గనుక ప్రేమంతా వొక్కసారి చూపించేసిందన్నా?'

నవుస్తున్నదల్లా చట్టున ఆగిపోయి సీరియస్ గా-

'అల్లా మాట్లాడ్తారెందుకూ? మనుష్యుల కష్టాన్ని గూర్చి చెబ్తూన్నప్పుడు అంత హేళన పనికిరాదంటాను. నిర్దయగా సానుభూతి లేకుండా వుండటం గొప్పనుకుంటున్నారు.'

'అవును. గొప్పనుకుంటున్నాను.'

'పోదురూ—బడాయిలు!'

'బడాయి కాదు ... నీకు మటుకు నీకు తెలుసుగదా ఆవిడ యెంత పేరు గడించుకుందో, ఎల్లాటి పతివ్రతో—మళ్లీ తగుదునమ్మా అని వెనకేసుకెందుకొస్తావు? ఇప్పుడు నీకావిడమీద జాలి కలిగింది కాబట్టి నన్నుకూడా నీ వెనక్కాల తందానతాన పాడమంటున్నావు. అదే కుదరదనోయ్—'

'మనుష్యులు ఎల్లాటివారైనా అకస్మాత్తుగా మార్పు వచ్చేస్తుంది. మునుపావిడ ఎల్లా వుంటేనేం–'

'—ఇప్పుడు భక్తురాలైనదందూ—ఆస్తి ఇల్లూ వగైరాఅంతా వచ్చాక'

'అదేం కాదు—ఆ ముగుడు చాలా అన్యాయం చేశాడు. విల్లు రాయకుండా పోయాడు. అన్నదమ్ముల బిడ్డలొచ్చి ఆస్తి ఆక్రమించుకు కూర్చున్నారు. ఈవిడకి మనోవర్తి అన్నా దక్కకుండా చేద్దామని చూస్తున్నారు. పాపం ఆడది. వ్యవహారాలేం యెరుగదు. మరో దిక్కు లేదు—'

'మనిద్దర్నీ పెంచుకోమన లేకపోయావా ?'

'అవునండీ - ఆవిడ ఎవర్నన్నా దగ్గర తీసుకుని ఎందుకు పెంచుకోలేదు? యిప్పుడు చెల్లదేవిటండీ? రూపాయికి బిందె చొప్పున నీళ్ళు మోస్తూ వంటలు చేసి పూరగాయలు పెట్టి కాలక్షేపం చేస్తూందండీ! నాకు చూసినప్పుడల్లా కడుపు తరుక్కుపోయేది. నేనో రూపాయి పిలిచి యిచ్చేదాన్ని నెల నెలా—' ఆవిడ దారుణమైన నేస్తురాలి జీవితాన్ని తలుచుకుని కృంగిపోయింది. నిజమే ప్రపంచంలో దీనులు దుఃఖితుల గాథ లెన్నో వుంటాయి. అన్నిటికీ చలించిపోయి బెంబేలు పడిపోతే మనం ఎట్లా జీవిస్తాం? ఆవిడ స్వభావం కొద్దీ భర్తను హింసించేది-బాధలు పెట్టేది. తన యిష్టం వచ్చినట్లు వుండేది. కాని ఆవిడ యెన్నడూ అతగాడ్ని వదిలించుకుందామని గాని అతను లేకుండా వుండాలని కాని కోరుకొని వుండదు. అవసరాలు తీరక పోయినా, ప్రేమ లేకపోయినా, మనుష్యులు నిరంతరం యేళ్ళతరబడి ఒకే బోనులో నివసించడంవల్ల ఒకరు హఠాత్తుగా అదృశ్యమైతే ఆ లోటును భరించలేరు. ఇది చాలా సహజమని నమ్మే అనుభవం లేని మా ఆవిడ నాకు సానుభూతి సంస్కారం లేదని విసుక్కుంటోంది.

మళ్ళీ మద్రాసు హోటలుకొచ్చి భోంచేశాం. అంతా పోయి సత్రవులో పడుకున్నాం. గుర్రాలు దాణా నెమరేస్తూ వుండి వుండి సకిలిస్తున్నాయి. న్యూఢిల్లీ స్టేషనులో డీసెలు యింజన్లు మొరబెడ్తున్నాయి. ఊరు నిద్రపోయింది. బస్సులు అక్కడా అక్కడా తిరుగాడ్తూనే వున్నాయి. దీపాలన్నీ పది గంటలకే సత్రవులో ఆర్పేస్తారు. మంచాలు లేవు-వరండాల్లో చాపలమీద దొర్లుతున్నాం. చెమట-వో రాత్రి వేళ 'ఆంధీ' వచ్చింది. దుమ్ము దుమ్ము-ఇసుక తుపాను. కిటికీలతలుపులు బడబడా కొట్టుకొంటున్నాయి. ప్రక్క దుప్పటి యెగిరి పోయింది. పట్టుకుందుకు పరిగెత్తి పిల్లలమీద పడ్డాను. మొయ్యోమంటూ పిల్లలు లేచి యేడుస్తున్నారు. దుమ్ము వాళ్ళ ముక్కుల్లోనూ కళ్ళల్లోనూ కొడ్తోంది. మా బావమరిది 'బావా నా లుంగీ యెగిరిపోయింది ఎటో-' అని గోలపెట్టాడు.

గొంతుక కూర్చొనున్నాను. మా ఆవిడ పిల్లల్ని లెక్క పెట్టుకుని దగ్గరసా లాక్కుని కూర్చుంది చీకటిని తిట్టుకుంటూ. దుప్పటి పట్టుకుని మా బావమరిది కిచ్చాను చుట్టుకోరా అని. గాలి వుధృతంగా వీస్తోంది. కొంత సేపటికి టపటపామని పెద్ద పెద్ద చినుకులుపడ్డం ఆరంభించాయి. ఈ దుమ్ము వచ్చాక ఆ పెద్ద చినుకులు వరండాలోకి కొడ్తూంటే అంతా లోపలికి గదిలో కొచ్చేశాం. పిల్లలు బిగ్గరగా బాకా పెడ్తున్నారు మంచి నీళ్ళు కావాలని. మా బావమరిది ఎట్లాగో టార్చిలైటు వెదికి తీసి పట్టుకొచ్చాడు. మరచెంబు తీసుకుని స్నానాలగదివైపు జాగ్రత్తగా నడిచాను. అస్తవ్యస్తంగా వొళ్ళు తెలీకుండా ఎంతమందో నిద్ర పోతున్న మనుష్యుల్ని దాటి పంపు పట్టుకున్నాను. కాని లాభం లేదు. నీళ్ళన్నీ ఎప్పుడో బందయాయి. తిట్టుకుంటూ టార్చిలైటు ఆర్పుతూ వేస్తూ వరండాలో కొచ్చాను. ఎవరో తలదగ్గర కూజా పెట్టుకుని నిద్రపోతున్నారు. ముట్టుకున్నాను. చల్లగావుంది. గ్లాసు తీసేసి ప్రక్కనుంచి లైటార్పి కూజా యెత్తుకుని వేగంగా నడిచాను. పిల్లలు యింటావిడ అంతా దాహం తీర్చుకున్నారు. మళ్ళీ కూజా యెత్తుకుని వెనక్కు వచ్చాను. కాని ఆ చీకట్లో యెవరి తలదగ్గర్నుంచి యెత్తుకొచ్చానో గుర్తులేదు. ఇంకా ఎక్కువసేపు ఆ వస్తువును చేతులో వుంచుకోవటం క్షేమం మంచిదికూడా కాదు. అక్కడే యేదో కిటికీలో వుంచేసి గబగబా దొంగలా మళ్ళీ మా గదికొచ్చి పడ్డాను. తెల్లారాక చెబితే మా ఆవిడ అంటుందిగదా పగలబడి నవ్వుతూ 'అదేం పనులండీ పాడుపనులూ-' అని. మా బావమరిది లుంగీకూడా దొరికింది—అక్కడే మొక్కలకు చుట్టేసుకుంది.

## 3

ఉండవిచ్చిపోయిన దారపుబండిలా లుంగలు చుట్టుకుపోతోంది జీవితం. ఎవడో సగం చావమోది సైడుకాలవలోకి గిరాటు పెట్టిన బురదపాములా గిలగిలా కొట్టుకొంటున్నాను. ఇంత చిన్న వుద్యోగం చెయ్యటానికి యిన్నివందలమైళ్లు రావలసివచ్చిన నా

దౌర్భాగ్యం యేమని చెప్పుకోను? కూటికి గుడ్డకు పనికిరాని నా చదువు, నలుగుర్లో మెప్పుకు అందుకోలేని నా చవకరకపు బాహ్యవేషపు రీతులు- యిది నిరాడంబరతని నేను మురిసిపోదామనుకుంటే వీల్లేకుండా, నలుగురూ చూపే నిరాదరణ- దక్షిణాత్యులమని అడే నూటిపోటిమాటలు అవహేళనలు...ఎన్నిటికని తట్టుకునేది? మంత్రాలయపు అన్ని కార్యాలయాల్లోనూ తమిళకూటా లున్నాయి. ముఖ్యంగా పంజాబీలకీ తమిళులకూ పొసగదు. హిందుస్థానీలు, యూపీలు, వీరికి పంజాబీలకు స్పర్థలు- తెలుగువాళ్లు బహు క్లిష్టంగా ఆదరణా గౌరవమూ లేకుండా 'మద్రాసీ' అని పిలవబడుతూ యీ పెద్దపెద్ద కూటాల మధ్యనలిగి, ఆత్మగౌరవమూ తెలుగుతనానికి తిలోదకాలిచ్చి యిటు తమిళులకు జోహారులంటూనో అటు ఔత్తరాహులకు 'జీ' హుజూరంటూనో బ్రతికాలిసిందే! ఒక జాతికి సరియైన ప్రాతినిధ్యం బలం గౌరవం స్థానం కేంద్రంలో లేకపోవటంవలన నాబోటి సామాన్యుడు కాస్త అభిమానం వున్నవాడు మానసికంగా న్యూనత పాలవుతున్నాడు. ఇవన్నీ ఎందుకు చెప్పాలిసొచ్చిందంటే- యీ కొంపకోసం తిరిగే చాంద్రాయణంలో కొందరు నన్నడిగిన అతి సామాన్య ప్రశ్నలు- తెలుగుప్రజలు వింటే, 'పౌరుషగానాలు-పూర్వప్రశంసలు' కట్టిపెట్టి నిజంగా మనకున్న గౌరవం యెంతో మనం తెలుసుకున్నప్పుడు- కాస్త తలవంచుకుని ఛాతీ విరుచుకోకుండా నడవటమే మంచి దనిపించుకుంటుంది.

నేను సబ్బుబిళ్లె పెట్టి వాడటం చూసిన నాయూపీ స్నేహితుడు- 'ఓహ్హో! మీ దేశస్థులు కూడా సబ్బు వాడ్డం నేర్చుకుంటున్నారన్నమాట! ఐతే రెండు పూటలా స్నానంచేస్తారా?' ఒకరోజున మిఠాయికి రమ్మని ఎవరో పిలిచారు. 'తొక్కుడులడ్డూ, బరిఫీ జిలేబీలు' యిచ్చారు. 'కచోడీ - సమూసా' ఖారం వేశారు. నేను తింటున్నంతసేపూ అతను నా జన్మలో అదే మొదటిసారిగా మిఠాయితింటున్నట్లు వూహించుకుని మాట్లాడ్డం మొదలెట్టాడు. తాము నెయ్యి విరివిగా వాడ్తామని- నాకు నాజాతికి నెయి, వెన్నలాటి వస్తువులు తెలీవన్నట్లు ప్రసంగించాడు. 'మీరు తమలపాకులు వేసుకుంటారా-' అనకుండా 'తమలపాకులు తెలుసా' అని అడిగాడు. 'పైజామా కర్చీ లాల్చీ' నేను కట్టించుకోవడం చూసి—'మీరూ యీలాటి బట్టలు తొడుగుతారా?' నాకు వళ్ళు మండుకుపోయింది. తాము బహునాగరికులుగా విద్యావంతులుగా పరిగణించుకుని ఔత్తరాహులు వేసే ప్రశ్నలు విన్నాక—నాకు మన ఘనత రాజకీయ పరిజ్ఞానం, సారస్వతం, యిత్యాది విషయాలపట్ల యేర్పడ్డ మమకారం దెబ్బతినడమే గాకుండా, మనలోపాలు కష్టాలు కారణాలు ప్రస్ఫుటంగా గోచరించసాగాయి. మరొకరు మీ దేశంనుండా ముష్టివాళ్ళు—అడుక్కోడానికికూడా యింత దూరం వస్తారు అని నేను యథాలాపంగా దారిలో ఎవరికో కాణీ ధర్మం చేస్తుంటే మనస్సు కలుక్కుమనేలా అనేశాడు. నిజమే మరి—బెజవాడలో, విశాఖపట్నంలో ఒక చోటేమిటి రైళ్లలో ఎక్కడెపడితే అక్కడ, ముఖ్యంగా హోటళ్ల యెదుట ఎంతమంది ముష్టివాళ్ళు? ఎల్లాకాదనగల్ను?

నా జీవితం నడివీధిలోకొస్తే, నేను బుర్ర చించుకుంటూ 'కన్నాట్‌ప్లేసు' లోపలి సున్నాలో చక్కర్లుకొడ్తుంటే 'కేశవరావు' కలిశాడు. అతను నన్ను చూడగానే బస్సుకోసం నిలబడ్డ క్యూలోనుంచి యీ వలకు వచ్చేసి నా రెండు చేతులూ పుచ్చుకుని ముఖం కాస్త ముందుకువంచి 'ఎన్నాళ్లీ కెన్నాళ్ళకి?' అంటూ పేవుమెంటు షాపుల్లోకి లాక్కెళ్లాడు. ఇద్దరం కోకాకోలాలు పుచ్చుకున్నాం. పనామా సిగరెట్లు ముట్టించాం.

'ఇప్పుడెక్కడా యేమీ రాయటం లేదే—' ఒకప్పుడితను నాకు ఫాను. ఉత్తరాలు తెగరాసేవాడు. మూణ్ణోవాడి రచనల్ని యెప్పుడూ చీల్చి చెండాడ్డం అప్పట్లో హాబీ నాకు. అప్పటికే తెలుగుపాఠకుల్లో వంటింటి కథలూ, అబ్బాయి అమ్మాయిల బాధలూ. విడోమ్యారేజి, కులతత్వాల మీద రచనలూ, గుమాస్తా గాథలూ చదివి చదివి విసుగెత్తిపోయి వున్నారేమో ఏదన్నా 'క్రొత్త' కోసం తహ: తహ: లాడిపోయే వాళ్లలో కేశవరావు వొకడు.

'అప్పుడు మీరు చక్కగా 'హాస్యం' రాసేవారు?'

'ఇప్పుడు యేడుపులో పడి కొట్టుకుంటున్నాను, తప్పితే భీభత్సం—'

'అల్లా అంటారేమండీ?—'

'ఇదుగో అబ్బాయి—యిదివరకు ఏదో బరికేసి ఆ పనక సంపాయించుకున్న పేరు నే పొదుపుగా వాడుకునే వాళ్ళలో నేనొకణ్ణి. సరేనా—'

కేశవరావు పగలబడి నవ్వాడు.

'మాస్టారూ—యిక వ్రాయండి, ఇక్కడికొచ్చేసారుగా—'

కేశవరావు 'మాష్టారూ' అనగానే అతడి ముఖంలోకి చూశాను. ఒకప్పుడితను నా దగ్గర చదువుకున్నాడు.

'పెళ్లాడావా?'

'అబ్బే—నాకెవరిస్తారండీ?'

'ఉద్యోగం?',

చెప్పాడు. ఎయిర్ లైన్లో ఏదో విదేశీ కంపెనీ మేనేజరుకి పి. ఏ. గా వుంటున్నాడుట—ఏడు వందలు. మొదట్లో స్టెనోగా చేరాడు. ఇంటరు పూర్తి చెయ్యలేదు. చదువుతూంటే తండ్రిపోయాడు. అన్నగారితో వదినతో తగూలాడి బెజవాడనుంచి పారిపోయాడు అప్పట్లో. ఇతను స్తమానూ మా యింట్లోనే వుంటూ యిక్కడ్లే భోం చేస్తూంటే వాడు యింట్లో పోట్లాడేసొచ్చి. నా సైకిలు అస్తమానుపట్టుకుపోయేవాడు. నాకు సిగరెట్లు పోస్టుకిళ్లీలు కాగితాలు తెచ్చిపెట్టేవాడు. ఎప్పుడన్నా చిత్తు సాపు రాసేవాడు. కథలు పోస్టుచేసి పెట్టేవాడు. ఇతగులతో నా వ్రాతలగురించి పోట్లాడేసొచ్చేవాడు. నేను కూడా సినీమాలకు తీసుకెళ్లేవాడిని.

క్లుప్తంగా కేశవరావుతో నా సంగతి మా ఆవిడ బావమరిది పిల్లలు వచ్చిన సంగతి అంతా సూక్ష్మంలో బోధపర్చి చెప్పాను.

'ఐతే—నా గది యిచ్చేస్తాను. మా రూము కొచ్చేసెయ్యండి. తర్వాత యెక్కడన్నా చూద్దాము.'

నేనూ కేశవరావూ సత్రవులోకొచ్చిపడ్డాము. మా యింట్లో యావన్మందికీ కేశవరావు తెలుసును. నా భార్య 'ఏమోయ్ - తప్పకదూ—అల్లా పారిపోవచ్చా యెవరికీ చెప్పకుండా...మళ్ళీ బెజవాడ వెళ్లావా మీ అన్ననూ వదిననూ చూసేందుకు?'

అతను ముసిముసిగా నవ్వుతూ నిలబడిపోయాడు. 'ఈ వేషం నాటు బూటులో పోల్చుకో లేకపోయాను' అంటూంటే వారించి చెప్పాను-'మునుపటి కేశవరావు అనుకునే మాట్లాడేస్తున్నావు నోటికొచ్చినట్లు. అతను యేడువందలు సంపాయిస్తున్నాడు. ప్రయోజకుడయ్యాడు. సంతోషించు.'

'నిజంగా!' ఆశ్చర్యపోయింది. కేశవరావు అంత ప్రయోజకుడవుతాడని యెవరూ నమ్మలేని విషయం. 'ఎందుకండీ మాస్టారూ — అవన్నీ చెప్పేసారు. నన్నిక్కడ యెవరు చనువుగా కేకలేస్తారు చెప్పండి. నేను సరదాగా వింటూంటే—'

అంతా కేశవరావు గదిలో కొచ్చిపడ్డాం. ఆ గది కరోల్ బాగ్ లో మూడో అంతస్తులో ఒక మేడలో వుంది. అక్కడ మీద నే అన్ని సౌకర్యాలూ వున్నాయి. మా ఆవిడ తన అమాయకత్వంలోనే తమ్ముడికి కూడా కేశవరావులా ప్రయోజకుడు కావటానికి యేదన్నా చూసి పెట్టమని రోజూ అతడితో చెప్పిపెట్టేది. అతను వున్న ఒక్క గది చిన్న వరండా అంతా మా కోసం వదిలేశాడు. పిల్లలు పంపుత్రిప్పి అస్తమాను క్రిందకూర్చునే వారు. అతడూ మాతోనే భోజనాదికాలు చేయటానికి వప్పించేసరికి చాలా కష్టమయింది. పెసరట్లు వడలు బజ్జీలు యిడ్లీలు ఒకటేమిటి తిండిలో రోజూ ఆంధ్రత్వం మళ్ళీ విజృంభించసాగింది.

ఒక రోజు కంపెనీ కారు తీసుకొచ్చాడు. మా బావమరిది, పిల్లలూ మా ఆవిడ బిలాబిలా అంతా అందులో కెక్కారు. నే నేమో యిల్లు చూస్తానని వుండిపోయాను. కేశవరావు అందర్నీ తిరగడానికి తీసుకుపోయాడు. జీవితం కొత్త రాస్తాలో పడ్డట్టే వుంది. వరండాలో వాలు కుర్చీ లాక్కుని సిగరెట్టు కాలుస్తూ పేపరు చూస్తున్నాను. స్టూలుమీద టేబిలు ఫానుకు వుండి వుండి తడితువ్వాలు చుడుతున్నాను. గాలి వెచ్చగా వస్తోంది. శరీరం బట్టను కూడా ఓర్చలేని కాలం ఇది. ఈ గది మీదనుంచేమో - చుట్టూతా రకరకాల మేడలు కిటికీలు ద్వారాలు చిన్న చిన్న బొమ్మల్లా కనుపించే మనుష్యులూ-తోటలు దొడ్లూ మొక్కలూ బాగా దిగువను చీమల్లా పరుగెట్టే బస్సూ కారులూ అన్నీ మధ్య మధ్యన అవలోకిస్తున్నాను.

ఈ గొర్రెకు బెత్తెడు జీతంతో ఈ పిల్లల్ని ఎట్లా పెద్దవాళ్లను చేస్తాను? వీళ్లకి చదువులు బట్టలు రోగాలు రొచ్చులు ఇవన్నీ నేను ఎట్లా భరిస్తాను? ఇంత చిన్న వయసులో నాలుగూ చూడాలనీ అదీ ఇదీ కావాలనీ

తెలిసీ తెలియకుండా అడిగే ఆడదాని మనస్సు నొప్పించకుండా వుండగలనా? కేశవరావు మంచివాడే. ఇట్లా అతని పీకలమీద ఎన్నాళ్లు కూర్చోవటం? ఆ మేఘమీది అంతరిక్షంలోని గదికి అతను యాభై రూపాయ లిస్తున్నాడు. నాకు తెలీకుండానే నేను నా జీవితంతో అతడి జీవితాన్ని పోల్చుకుందు కుపక్రమించాను. నాకు జీవితంలో సంతోషంగా ఆనందంగా గడచిపోవలసిన కాలంలో సంసారం పెద్దదయి వుద్యోగం చిన్నదయి అంతా తిరగబడిపోయింది. కేశవరావు చిన్నతనంలో కష్టపడ్డాడు నాకు తెలుసు. కాని ఇప్పుడు మంచి పదవిలోవున్నాడు. ఒక్కడు! కావలసినంత డబ్బు—మరో యేడాదిలో పెళ్ళాడినా సమస్యలేం లేవు. హాయిగా సుఖంగా జీవించటానికి ప్రాతిపదిక అప్పుడే యేర్పడివుంది. కోరికల్ని చంపుకో నక్కర్లేదు. నాకు-అట్లాంటి దేం లేదు. చిన్నప్పుడే పెద్దవారి ముచ్చట కోసం పెళ్లాడేశాను. చదువు పూర్తి గాకుండా వంశోద్ధారణకు కొడుకు—కంగారుపడి ఏదో వుద్యోగమని ప్రవేశించాక, ఆశయాలు అభిరుచులు కోరికలు అన్నీ మెల్లగా వొక్కటొక్కటే తిరుగు ముఖంపట్టాయి. ఇంట్లో పాలపీకలూ, యే మూల చూసినా పాతగుడ్డలూ, అటకమీద బస్తాలతో గొల్ల భామ మార్కు పాలడబ్బాలు, ఒక ప్రేమడైలాగన్నా చెప్పకుండా ఒక యుగళగీతమన్నా పాడకుండా ఇంత ముంచుకుపోతుందని యెవరనుకున్నారు? ఒంటరిగా కూర్చుంటే ఇట్లా నే దిగులుగా వుంటుందని వరండాలో కుర్చీలోనుంచి లేచి లోపలకువెళ్లి స్టవ్ ముట్టించాను—ఒక చుక్క కాఫీ గొంతుకలో పోసుకుంటే యేమన్నా మనస్థిమితంగా వుంటుందేమోనని, నే నింకా కాఫీ గొడవలో వుంటూండగా నే వరండాలోనుంచి కోమల కంఠం 'నాకు కూడా మరోకప్పు కాఫీ పొయ్యి డార్లింగ్' అని వినిపించింది. బైటకువచ్చి చూద్దును గదా బంగారు మొలకల్లే ఒక పంజాబీ అమ్మాయి నా కుర్చీలో కూర్చొని జోడు విప్పుతూన్నదల్లా నా క్రొత్త మొహం చూసి—తెల్ల తెలబోతూ 'కేశీ—యిప్పుడీయింట్లో లేరా?' అని లేవబోతూ అడిగింది. 'కూర్చో అంతా చెబుతా—' అన్నాను. నిల్చొనేవుంది. నీకోసం కూడా మరో కప్పు కాస్తాను. కేశీ వస్తాడు. వచ్చేదాకా వుంటావా? 'ఎవరో వస్తారని చెప్పాడు. కాని ఆడా మగా చెప్పలేదు' అని లోపలికెళ్లాను. ఈ అమ్మాయి ఎవరో ఏమిటో తెలుసుకోవాలని శ్రద్ధ కుతూహలంగా వుంది. నీళ్లు ఎక్కించి మళ్లీవచ్చి—'కూర్చో అమ్మాయి. ఫరవాలేదు. మావాడు నాకంతా చెప్పాడు. నే నెవరనుకుంటున్నావో—ఈ చేత్తో అరవై డెబ్భై ప్రేమకథలు రాశాను. మనకి అన్నికథలూ సుఖాంతం చేయటం ఎట్లాగో తెలుసు?'

ఆ అమ్మాయి కాస్త నవ్వి 'కేశీ—యెక్కడి కెళ్ళారు?' అంది. 'నేనే పంపించాను—అస్తమానూ ఇంట్లో కూర్చుని నువ్వు రా లేదని తెగ యిదవుతూంటే, అట్లా తిరిగివస్తే కాస్త మనస్సు కోలుకుంటుందని.'

'హాఁ! సారీ—' అని మూతికాస్త చిన్నది చేసి పెదవుల్ని వంకరగా త్రిప్పి-మెడ కొంచెం అటూ యిటూ వూచింది.

'బావుంది అమ్మాయ్—నువ్విట్లా మావాడికి బొత్తుగా కనిపించటమే మానేస్తే యేమన్నా బాగుంటుందీ? అస్తమానూ యిప్పుడు నువ్వు 'కేశీ—కేశీ అంటున్నావా, అట్లాగే వాడూ ఏదో గొణుగుతాడూ ఫోటో దగ్గరపెట్టుకుని' కాఫీ కప్పు బల్లమీద వుంచుతూ 'ఫోటో'—అది మీ కెట్లా తెలుసు?' కాస్త సీరియస్ గా అడిగింది. అట్లా బైటపడూ పిల్లా అని మనస్సులో అనుకున్నాను. వాలకమే చెబ్తోంది వర్కింగ్ గర్ల్ అని—కుర్రవాడు నాలుగు రాళ్లు సంపాదిస్తున్నాడు గదా అని యిట్టే బుట్టలో పెట్టేసుంటుంది. ఐనా సుప్రభమైన 'కో' అంటే కోటిమంది తెలుగుకన్యలుండగా మావాడి కిదేంబుద్ధి? పెళ్లాడతానంటే—అప్సరసల్ని తలదన్నే జాతి కన్యల్ని తెచ్చి అంట కడుదుమే. నాకెందు కింత తీవ్రంగా కేశవరావు తరఫున పెద్దరికం నిర్వహించాలనీ, అతడి బాగోగులు వ్యవహారాల్లో ప్రమేయం పెట్టుగోవాలని గలిగిందో చెప్పటం సులభం. ఆ అమ్మాయి మళ్లీ అడిగింది—'ఫోటో మీకు తెచ్చిచూపాడా?' అని.

'అరె—నువ్వెంత అమాయకురాలివి? మేమిద్దరం భౌతికంగా వేరుగాని మా ప్రాణాలు ఆత్మలు సర్వం వొకటే—నేను చూసి అన్నాను గదా యీ అమ్మాయిని మాపిక్చర్లో బుక్ చేస్తే హీరోయిన్ గా చాలా బాగుంటుంది—హిందీలో డబ్ చేసేటప్పుడు' అన్నా. సినీమాలంటే అమ్మాయిలు చెవిగోసుకుంటారని నాకు తెలుసు. 'మీరు సినీమాలు తీస్తారా?' అంది కళ్లు

పిలయినంతగా పెద్దదిచేసి. నేను నవ్వి 'పిల్లా—సినిమాలు తీసే మనుష్యులు యిల్లా ఎందుకుంటారు? ఇల్లాంటి చిన్న ఆరేసు వందలు సంపాయించే 'శశి' లాంటి వాళ్లతో ఎందుకువుంటారు? నేను నీకు ముందే చెప్పానే సినీమాలకు కథలు వ్రాస్తానని. ఇప్పుడు 'వర్కింగ్ గర్ల్' చిత్రానికి కథకూరుస్తున్నాను. ఆలోచిస్తూ యిల్లా కూర్చున్నానో లేదో నువ్వొచ్చావు?'

ఆపిల్ల కొస్త నిందాగర్భితంగా చేతుల్ని త్రిప్పుతూ—'మాశారా అందుకే మీరు వచ్చాక నాకు రావద్దనికూడా కబురుచేశారు. ఐనా చూద్దామని యిటొచ్చాను. నేను సినీమాలోకి బావుంటానా?'

'నాకు నచ్చుబట్టే ఫోటోలో అమ్మాయిని గురించి మావాడి నడిగి తెలుసుకుంది. సినీమా పేరు మా కంపెనీవారు 'టైపిస్టు గర్ల్' అని పెడ్తామనుకుంటున్నారు? నాకేమో ముందు పేరే నచ్చింది.

'మీకు నాఫోటోలు కొన్ని పట్టుకొచ్చి యిస్తాను. మీకంపెనీకి రాయండి నచ్చుతానేమో. ఈ టైపు కొట్టలేక ప్రాణం విసిగిపోతోంది.'

'అమ్మ బాబో—యింకేమన్నా వుందా? మా కేశవరావుకు తెలిసిందంటే, నా ప్రియురాల్ని సినీమాల్లో ప్రవేశపెడ్తావా అని నా పీకుచ్చుకుంటాడు. ఐనా మీరిద్దరూ ప్రేమించుకున్నారేమో, అతణ్ని కూడా అడిగి మాస్తేనే బావుంటుంది.'

'శశికి మీరేమీ చెప్పొద్దు. ఆయనకు నేనే సావకాశంగా అంతా చెబ్తాను. నేను యిక్కడకు వచ్చావని చెప్పకండి. నేనూ చెప్పను. ధన్యవాదాలు—మీలాంటి గొప్పవార్ని కలిసే అదృష్టం కలిగినందుకు నిజంగా నేను గర్వపడుతున్నాను సెలవు.'

ఆ అమ్మాయి నాజూకుగా వచ్చినట్లే నిష్క్రమించింది. అంతసేపూ మేమిద్దరమూ హిందీలోనే మాట్లాడాము. నేను కుర్చీలో జార్లబడి పగలబడి నవ్వుతున్నాను. ఎన్నాళ్ళ తర్వాతో నాకు జీవితంలో నిజమైన హాస్యం కళ్లకు గట్టినట్లు కనిపించింది.

ఇక్కడ మీకు అనేక సందేహాలు కలుగుతాయి నిజంగా నేను యింత చాకచక్యంగా హాస్యం మాట్లాడ గల్గివుంటానా, తర్వాత ఆ అమ్మాయి ఫొటోలు తెచ్చిందా? మళ్లా ఆ పిల్లను కలుసుకునే ధైర్యం నాకుందా? నా కొంపవిషయం యేమైంది? మా బావమరిదికి వుద్యోగమైందా? ఈ సోది ఎప్పటికన్నా ముగుస్తుందా అని.

బాబూ నన్ను కొస్త చెప్పనియ్యండి!

ఇప్పుడు వచ్చి 'ఫ్లూ' అధ్యాయంలో పడ్డాం. ఈ 'ఫ్లూ' కథలోకి రాకముందు ఆ అమ్మాయి ఒకరోజున ఫొటోలు పుచ్చుకుని నాకోసం వచ్చిందట. అప్పుడు నేనూ—కేశవా యిద్దరమూ యింటిదగ్గర లేము. మా శ్రీమతి పిండి రుబ్బుతున్నది కాబోలు. దానికి హిందీ బొత్తిగా రాదు. ఆ అమ్మాయి ఏవో వాకబులు చెయ్యటం, యీ మనిషి తెలుగులో మాట్లాడ్డం అయాక, రుసరుసలాడ్తూ వెళ్ళిపోయిందని మా ఆవిడ కథనం.

ఈలోగా నాకు తెలీకుండా కథ కొంత మా ఆవిడ కూడా జరిపించింది. ఆవిడకు 'పెళ్లి ట్రయినింగు' పొందుతున్న వొక చెల్లెలు వుంది. దాన్ని తీసుకుని వచ్చి రెక్కలు కట్టుకు వాలమని మా మామగారికి జాబు వ్రాయించింది—' ఇక్కడ రత్నంలాంటి కుర్రవాడున్నాడు. ఏడువందలు నెలకు—కొట్టి విరగ్గొట్టండి, నేతిలో పడెయ్యండి' అని. నా కొంప విషయంకదూ— ఇది 'ఫ్లూ' అధ్యాయంలో చేరుతుంది. 'కేశవ'ని వాళ్ల ఆఫీసులో వొకరు బ్రతిమాలగా బ్రతిమాలగా వప్పుకున్నాట్ట—ఆయన మూడు నెలల శెలవులో మద్రాసు వెళ్తున్నప్పుడు ఆయన కొంప దొంగలుదోచకుండా రక్షించేటందుకు. రెండు పడకగదులు, రెండు బాత్ రూంలు, బాత్ రూంలో నిలువుటద్దాలు (ఎందుకని అనవసరపు ప్రశ్నలు వెయ్యకండి.) ఒక స్టోరు రూం—ఒక డ్రాయింగు రూం—గది గదికీ ఫాను—వగైరా, వగైరా. దమ్మిడీ అద్దె లేకుండా, నీటి కర్చూ, వెల్తురు కర్చూ, గాలి కర్చూ, లేకుండా మూడు నెలలు సకల రాజభోగాలూ అనుభవించమని కేశవరావు చెప్పాడు. తర్వాత 'దేఖాజాయెగా'. అస్సలు విషయం ఆ ఆఫీసరు కుటుంబం యావత్తూ మద్రాసులో 'ఫ్లూ' సుఖం అనుభవిస్తున్నారట!

టింగురంగామని మేడమీది గదిన్నర కేశవరావు వాటాలోంచి పడకగదికీ పడకగదికీ మధ్య లావెటరీ బాత్ రూంగల బంగాళాలో కొచ్చిపడ్డాం. కేశవరావు ఎందుకీ సదుపాయం చేశాడో నాకు పూర్తిగా తెలుసు. ఆ పంజాబీ అమ్మాయి నా చమత్కారమంతా కేశవకు

శనిగారికి వుంటుంది. నా కళ్లముందు కుర్రాడు. బైట పడతాడు. ఇదేమీ తెలియని నా పూర్వకాలపుటిల్లాలు కేశవరావు యింతకాలం పెళ్ళిచేసుకోనిది తన యీడిగిన చెల్లెల్ని చేపట్టడానికనే వూః కలలుగంటోంది. కలలు మంచికే అంటారు మనస్తత్వశాస్త్రవేత్తలు.

ఇక్కడేం జరిగిందంటే---

బంగళాలో రాజాలా వుంటున్నానని చెప్పానా - గేటుమీద 'సుబ్బరామన్' అని రాసుంది. ఆయన అనుకోకుండా విమానం మీద యావత్తు సంసారంతోనూ వచ్చి పడ్డారు. (విమానంమీద వస్తేనేనిల్లా అనుకుంటాం చెప్పండీ! మూడు రోజులు నడుములు పడిపోయేలాగ జీ. టీ. లో రాక.) అప్పుడు మా బావమరిది రేడియో ట్యూను చేస్తున్నాడు. మా మరదలు పిల్ల పెళ్లిచూపులకోసం వచ్చినది:

'నేనే జాణనా-
చిన్నదాన్నైనా... నేనే జాణనా! ఏలుకో నా
స్వామి నా తప్పు దిద్దుకొంటుకా...'
హార్మనీ మీదసాధకం చేస్తున్నది.

నేను చిన్నతువ్వాలు చుట్టుకుని బాత్‌రూంలో అఘోరిస్తున్నాను. మా ఆవిడ వంట యింట్లో చుంయ్ చుంయ్ మనిపిస్తున్నది.

ఆ సుబ్బరామన్‌గారెవరో మాకు తెలీకపోయె! ఆయన ముఖం వొలిచిన ఎర్రపండు పనసకాయలా వుంది. ఆ యిల్లాలు దక్షిణాది పట్టుచీర కట్టుకున్నది. ఇద్దరు అమ్మాయిలు చిన్న చిన్న హేండ్‌బాగ్‌లు పట్టుకుని నిల్చున్నారు. నేను కొత్త కథకుణ్ని గనుక యిది ఫలానా అనిగ్రహించుకుని-'సార్! సార్!' అని వినయంగా యీయిల్లు జాగ్రత్తకోసం ఏయిర్ లైన్స్ పి. యే. గారు మమ్మల్నిక్కడ వుండమని మరీ గట్టిగా చెప్పారు. తమరు చెప్పకుండా వచ్చారు. ఐనా మీ యిల్లు భద్రంగా చూడ్డానికి మేంపడ్డ అవస్థ వర్ణనాతీతం. చూడండి ఆ మొక్కలు లతలూ అవీ చిగురించాయంటే యీ చేతుల్తో నీళ్ళు మోసి మోసి మా యావిడ—'

'షి. య్యే. ఎవరూ? నేనే పి. య్యేకు చెప్పలేదే-మిమ్మల్నిందులో ఎవరుండమన్నారు?'

మనిషి యింకా గర్జించటం మానలేదు.

'మీ వస్తువులూ సామానులూ అన్నీ సరిగా వున్నాయో లేవో చూసుకున్నాకే మమ్మల్నిక్కడ నుంచి పొమ్మనండి. మేం మీ యిల్లు జాగ్రత్తకోసం యిందులో వున్నామని నేను నొక్కి చెబుతున్నాను. మీకు మరోలాతోస్తే మీరు పోలీసులకు కబురు చెయ్యొచ్చు!'

ఈలోగా మా యావిడ గరిట చేత్తో పుచ్చుకుని రంగస్థలం మీదకు వచ్చింది. నేను సంతోషం కనబరుస్తూ 'సుబ్బరామన్ గారు వచ్చారే-దప్పున కాఫీలు చేసిపెట్టు. అమ్మా యిక మీరు మీ యింట్లోకి వెళ్లండి. ఎప్పుడు యీ బాధ్యత నాతలమీదినుంచి తప్పుతుందా అని దేవుళ్లకు మొక్కుతున్నాను. మీ వస్తువు లన్నీ సరిగా వున్నాయో లేదో ముందు చూసుకుని మాకు సెలవిప్పించండి.' అని మాబలగం యావత్తూ తలోకవస్తువూ పట్టుకుని శ్రీ వారి సామాన్ని బంగళా అంతర్భాగంలోకి చేర్చారు. సుబ్బరామన్ గారు చిరాకుగానే వున్నారు. కాఫీలు పడ్డాక ఆయన మళ్ళీ చిరాగ్గా 'మీకు తాళాలు ఎవరిచ్చారు?' అన్నారు.

'మీ. పి. ఏ.'

'నా పి. ఏ ఎవరు? నేను నా ఫ్ల్యాను యిచ్చానే—'

'మీ ఫ్ల్యాన్ పి. ఏ. గారి కిచ్చివుండొచ్చు'

'డామిట్—నేనే నయ్యా పి. ఏ ను. నా ఫ్ల్యాను కేశవరావనే కుర్రాడి కిచ్చాను.'

'కేశవరావు ఫ్ల్యానా...' నాకు షాకు తగిలి నట్లయింది. 'తాను పి. ఏ. నని ఏడువందలు జీతమని నాతో చెప్పాడు?'

'వెధవ—'

సుబ్బరామన్ గారు సోఫాలో లుంగలు చుట్టుకు పోయారు నవ్వు ఆపుకోలేక. ఆయన తన కుటుంబంలో అందర్నీ పేరు పేరు వరసల్నా పిలిచి యీ సంగతి చెప్పి వాళ్లందర్నీ నవ్వించారు.

నేను కొయ్యబారిపోయాను. మా ఆవిడ ముఖాన కత్తివేటుకు నెత్తురు చుక్క లేదు.

సుబ్బరామన్ గారికి నా కథంతా పూసగుచ్చినట్లు చెప్పాను. కేశవరావు నా దగ్గర యేమీ డబ్బు కూడా తీసుకోలేదని కేవలం 'ఇల్లు జాగ్రత్త' గా

చూడమని మాత్రం చెప్పాడని అందుచేత అతణ్ణేమీ చెయ్యొద్దని నేను తిరిగి యే పత్రవుకో మకాం యెత్తేస్తానని సవినయంగా చెప్పుకున్నాను.

సుబ్బరామన్‌గారు ఫోను రింగుచేసి ముందర కేశవ విషయం అడిగారు. తరువాత యేమి విన్నారో, నన్ను మాత్రం కేశవ యిల్లు చూసి రమ్మన్నారు. నేను బయల్దేరుతూంటే మా ఆవిడ కళ్లనీళ్లు పెట్టుకుంటూ 'ఇదంతా యేమిటండీ?' అని దారికడ్డంవచ్చి నిల్చుంది. 'జీవితం' అని గబగబా రోడ్డుచ్చుకున్నాను. బస్సులో సీటు దొరికేసరికి ఆలస్యమయింది. నేను వెళ్లేసరికి మేడ మెట్లవద్ద పోలీసులు వున్నారు. జనం గుంపు మాత్రం క్రింద ప్రోగయింది. నన్ను సుబ్బరామన్‌గారు పంపించారనీ పైకి వెళ్లనిమ్మనీ చెప్పాను. నేను మీదకు చేరేసరికి చూసిన దృశ్యం తాలూకు సందర్భం యిది—

ఆ పంజాబీ అమ్మాయి నన్ను చూసింది. కళ్లు ఎర్రగా వాచి వున్నాయి. ఏడుస్తోంది. గదిలో సామాను లన్నీ చిందరవందరగా పడేసి వున్నాయి. పోలీసు సిబ్బంది సిగరెట్లు కాలుస్తూ తీరిగ్గా మాట్లాడుకుంటున్నారు.

'కేశవా' అన్నాను గొంతెత్తి.

చిన్నప్పుడు నేను యిట్లాగే మందలించేవాడిని వాడు యింట్లో తగూలాడేసి వచ్చినపుడు.

—వాడి చేతికి బేడీలు వేసివున్నాయి.

నన్ను దగ్గరసా రమ్మని సంజ్ఞచేశాడు. వెళ్లాను.

'ఒక సిగరెట్టు యివ్వండి. మాష్టారూ— యిప్పుడు చేతుల్లేవు.'

సిగరెట్టు అంటించి యిచ్చాను నోటి దగ్గరకు.

'జైల్లో బీడీ ముక్కలన్నా దొరకవు.'

'ఏవిటిదంతా-ఏం చేశావు?'

'నన్నడక్కండి.'

'నాయనా-యిదంతా నా కోసమేనా?'

నాకు కళ్లల్లో కృతజ్ఞతతో నీళ్ళు తిరుగుతున్నాయి. చేరుమాలుతో వొత్తుకుంటున్నాను.

'సుబ్బరామన్‌గారు చాలా మంచివారు. నన్ను కన్నకొడుకులా చూసేవారు. ఆయన యిల్లుజాగ్రత్తగా వప్పగించేశాక మీ రిందులోకి వచ్చి వుండండి. ఈ సామాను అంతా యిక మీది. ఇందులో పూచిక పుల్ల యెవర్దీ లేదు. నిన్న మీ మరదలు కోసం చోళీ గుడ్డ పిల్లలకు పిప్పరమెంట్లు తెచ్చాను. యీ పోలీసులు చిందర వందర చేసేశారు. ఎక్కడో వుంటాయి. అవి వాళ్లి కివ్వండి. ఇల్లు జాగ్రత్త!'

'ఇవేం మాటలు నాయనా—'

నా గుండె తరుక్కుపోతోంది. పంజాబీ పిల్లను చూపించి 'ఇది నే నేమో స్వర్గాలు వొరగపెడతా ననుకుంది. నన్ను మర్చిపొమ్మని పెళ్లాడి సుఖపడమని మీరు చెప్పాలి తర్వాత! పోలీసులు నాతో కొంతసేపు మాట్లాడారు. కేశవవాళ్లకు ఆ యిల్లు నాకు వప్పగించమని చెప్పాడు. వాళ్ళు అతణ్ణి వానులోకి తీసుకుపోతూంటే నేనువెళ్లి 'కేశవా' అని గట్టిగా కావలించుకున్నాను. పోలీసులు విసురుగా లాగి త్రోసేశారు నన్ను. ఆ పంజాబీ పిల్లపట్టుకుంది. ఇద్దరం మెట్లమీద కూర్చుని కాస్సేపు యేడ్చాం. ఇంటికి కాపలా వున్న పోలీసులు మధ్యాహ్నానికి తాళాలు లిస్టులు నాకు వప్పగించి సంతకాలు తీసుకున్నారు.

సుబ్బరామన్‌గారు తర్వాత అంతా చెప్పారు. విమానాల్లో కొన్నాళ్లనుంచి యితర దేశాలనుంచి దొంగతనంగా వస్తువులు వెండి బంగారం నల్లమందు కొనితేబడుతూన్నదట. దానికి సంబంధించిన కూటానికి చెందిన ప్రముఖ వ్యక్తి 'కేశవ' అని కస్టమ్స్ శాఖ పట్టుకున్నారని. ఆయన కూడా 'కేశవ' నిజాయితీపరుడే కాని-భారీ యెత్తున డబ్బు సంపాయించే వుద్యమంలో చేరటం బహుశా దారిద్ర్యంవల్ల కావచ్చునని చెల్పారు.

మేం యిప్పుడు కేశవ గదిలో మీదన మేడమీద వుంటున్నాం. మా బావమరిదికి సుబ్బరామన్‌గారు వుద్యోగం వేయించారు. అన్నట్లు చెప్పటం మరిచాను. 'యీ యింటికి కేశవ మూడేళ్ళ డబ్బు కట్టి కంట్రాక్టు రాయించుకున్నాడుట. అందుచేత మాకే పూచీ లేదు. మా మరదలు సంగతి అడుగుతున్నారా? చెప్పను. మా ఆవిడ అంటుంది గదా 'ఇంకా నయం వాడి మాటలు నమ్మి దీని గొంతుక కోశాం గాదు' అని.

ఆ పంజాబీఅమ్మాయి ఒక రోజు బజార్లో కనిపించి చేతివ్రేళ్ళు నొప్పు లెడుతున్నాయని తన చేతుల్ని నాకు చూపించి మాటల సందర్భంలో— 'ఏదన్నా కథవ్రాసి పెట్టండీ' నా మీద అని అడిగింది. ఒక రోజు సినీమాహాల్లో కనిపించింది. ముందు'రో'లో. భుజంమీద తట్టాను. వెనక్కు తిరిగి చూసింది. 'ఎల్లా వున్నావ్?' కాస్త నవ్వింది.

ఈలోగా తెరమీద బొమ్మలాట్టం ప్రారంభమయింది.

# కవల జీవితములలోని వ్యత్యాసములు

శ్రీ రాళ్లపల్లి గోపాలకృష్ణమాచార్యులు

కవల జీవితములు అతివిచిత్రములైనవి. జాతకశాస్త్ర దృష్టితో వానిని విమర్శించుట విద్యార్థులకు ఎంతో ప్రయోజనకారి. ఇంచుమించుగా, ఒకే గడియలో జనించిన కవలలో కొందరి జీవితములుమాత్రము గొప్ప వ్యత్యాసముతో కానవచ్చుచుండుట సామాన్యానుభవములోనిది. స్వభావము, విద్య, వృత్తి, ఆర్జనము, వైవాహిక జీవితము, అంతస్తు, ఆయుస్సు మున్నగు విషయములలో ఒకరి జీవితముతో మరియొకరి జీవితమునకు ఏ మాత్రపు పోలికయైనా చూపట్టని కవలున్నారు. జన్మకాలములో వ్యత్యాస మతిస్వల్పమగుటచే, అప్పటి గ్రహస్థితి ఇరువురి జాతకములలో సమానముగా నుండునను కారణమున, జాతక శాస్త్రము చెప్పు ఫలములకు వాస్తవముగా విలువ లేదని పూర్వపక్షము చేయ పూనుకొను బుద్ధిమంతులకు ఇట్టి కవల జీవితములు గొప్ప ఆధారముగా ఏర్పడుచున్నవి. కాని, జ్యోతిశ్శాస్త్ర సూత్రములను ఓపికతో ఉపయోగించి సక్రమముగా పరిశీలించు సత్య జిజ్ఞాసువులకు కవల జీవితములలోని వ్యత్యాసములకు కారణము వారి జన్మకాలములలోగల స్వల్ప భేదమేయని స్పష్టముగా తెలియగలదు. అయినా, కేవల రాశి కుండలులతోనే సర్వమూ సాధించవచ్చునను సంప్రదాయమే జ్యోతిశ్శాస్త్ర సారసర్వస్వ మనుకొని విమర్శించుటకు పూనుకొనెడి మేధావులను తృప్తిపరచుట బ్రహ్మతరము కాదు. పటకారుతో పచ్చపూసను పట్టగోరు మహనీయుల నేమనవచ్చును?

కవలలో సాధారణముగా, రెండు తరగతుల వారు కలరు; ఏకజరాయుజులు (monoval) భిన్నజరాయుజులు (bioval) అని. ఒకటే రక్తాండములో రెండు శుక్రకణములచే ప్రత్యేకాధానము జరుగు కారణమున జనించువారు ఏకజరాయుజులు. ఇట్టి శిశువు లిరువురు ఒకటే మావిలో పెరుగుదురు. భిన్న రక్తాండములలో భిన్న శుక్రకణములచే ఆధానము జరిగినపుడు జనించువారు భిన్నజరాయుజులు. వీరు వేరు వేరు మావులలో పెరుగుదురు. ఏకజరాయుజులగు కవలు ఆకారములలో, అభిరుచులలో, జీవితానుభవములలో, సామాన్యముగా ఒకరి నొకరు పోలియుండగలరు. వివాహాదులుకాని, అనారోగ్యాదులుకాని ఇంచుమించుగా, ఒకే కాలములోనే వారికి జరుగుచుండును. భిన్నజరాయుజుల జీవితానుభవములలో ఇట్టి ధర్మము చూపట్టదు. ఆకారములో ఏకొంత పోలియుండినా, జీవిత యాత్రలో ఎవరి మార్గము వారిదే. అగుటచే ప్రపంచమున భిన్న జీవితము లనుభవించు కవలు భిన్నజరాయుజులుగా నుందురనుట.

ఆధానకాలమును గురించి సామాన్యముగా వాడుకలోనున్న అభిప్రాయములో ఒక పొరపాటు కలదు. నిషేక క్షణమే ఆధానకాలమను అభిప్రాయమున్నది. నిషేకము జరిగిన వెంటనే ఆధానము జరుగవలెనను నియమము లేదనియు, అనేక సందర్భములలో ఈ రెండింటికి కొన్ని నిమిషములో గంటలో కడకు ఒకటి రెండు దినములో అంతరము సంభవించవచ్చుననియు, పరిశోధకులగు తద్జ్ఞులు నిర్ధరించియున్నారు. అగుటంబట్టి, భిన్నజరాయుజులగు కవల విషయమున ఆధానకార్యములు రెండును ఏకకాలములోనే జరిగియుండ నవసరము లేదని సులభముగా గ్రహించగలము. అట్టి భిన్నకాలములను సాధించుట సాధ్యమైనచో, అప్పటి గ్రహస్థితి ననుసరించి వారి జీవితానుభవములలో వ్యత్యాసము చూపట్టుటలో ఆశ్చర్యము ఉండదుకదా?

అననుభూత శేషములగు ఉత్కట కాంక్షలు పూర్వ జన్మావసానమున మానసికముగా నిలిచి, కరుడు కట్టి, ప్రారబ్ధకర్మగా ఏర్పడి తదనుభవమునకై ఈ జన్మమునకు కారణముగా పరిణమించునని తద్జ్ఞులు చెప్పుదురు. అనగా, అట్టి కాంక్షా శేషములను అనుభవించుటకొరకే జీవుడు పునర్జన్మమును స్వీకరించుననుట. అట్టి జన్మస్వీకారమునకు ఆరంభక్షణమే ఆధానకాలము; ఆక్షణమున ఖగోళమందలి గ్రహస్థితి ఆజీవుని

# కవల జీవితములోని వ్యత్యాసములు

ఆశలు, ఆదర్శములు ఎట్టివో, తెలుపగలదనియు, అట్టి ఆశలు, ఆదర్శములు కలజీవుడు ఈ భౌతిక ప్రపంచమున ఈజన్మములో ఎట్టి పరిస్థితులలో, ఏ సౌకర్యాసౌకర్యములతో వ్యవహరించ వలసియుండునో, వాని జన్మకాలమందలి గ్రహస్థితి చూపుననియు, జ్యోతిశ్శాస్త్రవేత్తల మతము.

కాని, ఈకర్మసిద్ధాంత మతిగహనమైనది.

"గహనా కర్మణోగతిః" అని శ్రీకృష్ణభగవానుడే అనతిచ్చెను.

ఇది చాల చిక్కు వ్యవహారము. ఇట్టి కాలముననే ఆధానము జరుగవలయునని నిశ్చయించినదెవరు? జీవుడా, ఈశ్వరుడా? ఈశ్వరుడైనచో, ఏ కారణమున? జీవుడే అయినచో, తన కాంక్షలకు సౌకర్యములు చూపుకాలము నే నిర్ణయించుకో వచ్చునుకదా? కొన్ని సందర్భములలో అసౌకర్యములు మాత్రమేకాక, దుష్ఫలములు సైతము సంభవించుచున్నవే, వానికేమి కారణము? కాంక్షాలేశములలో దుష్ఫలమును కోరునట్టివి యుండుట సాధ్యమా? ఇత్యాది ప్రశ్నలు పరశ్శతము బయలుదేరుచున్నవి. వీనికి సమాధానము జ్యోతిశ్శాస్త్రముద్వారా లభించుట అసాధ్యము తార్కికులకో, తత్త్వశాస్త్ర వేత్తలకో, వీనిని వదలుకొందము వ్యక్తి జీవితమునకు ఆధాన కాలిక గ్రహాదులతో సంబంధమున్నదనుట మాత్రమే మన కిచటచాలును.

కాని, ఈ ఆధానక్షణమును ప్రత్యక్షముగా కనుగొనుట కానిపని. దీనికి ఉపాయాంతరము కావలసియున్నది. ప్రాచీనులు దానినెట్లో కనుగొనియున్నారు.

పూర్వ జన్మమందలి కాంక్షాశేషములే మన ప్రారబ్ధకర్మకదా? ఈ కర్మ (కాంక్ష) మానసికమయినది. దీనిని సూచింపగల గ్రహము మనఃకారకుడగు చంద్రుడు. సృష్టిలో చంద్రునికి మనస్సుతోటి సంబంధమును వేదమే ప్రతిపాదించినది "చంద్రమా మనసోజాతః" అని.

కనుక, ఆధానకాల చంద్రస్థితి ఈ ప్రారబ్ధమును గురించి సూచన లీయగలుగుటలో అసంభవము లేదు. ఆ చంద్రుడు సూచించు ప్రారబ్ధమును అనుభవించు కొరకే జీవుడు ప్రకృతి నాశ్రయించుట. అనగా భౌతిక ప్రపంచమున ఉదయించుట. ఆక్షణమున పూర్వదిక్కున ఉదయించు భచక్రభాగ (అనగా లగ్నము) అట్టి చంద్రునితో సంపాదించుకొన్న సంబంధమే కాలక్రమమున జన్మకారణముగా, ఏర్పడ గలదు. గర్భము, సాధారణముగా, పది చాంద్రమాసములు పెరిగిన తరువాత ఏ దినమున ఆధానకాల చంద్ర లగ్నములకు పరివర్తనము కలుగునో, అప్పుడు జననము కలుగునని శాస్త్రవేత్తలు కనుగొన్నారు. అనగా ఆధాన క్షణమందలి హారిజములో చంద్రుడు చరించు నాడు, ఆధాన చంద్రస్థానము హారిజములో నున్నప్పుడే, జననము సంభవముగుననుట సారాంశము. జీవుని మనోమయ సూక్ష్మదేహమునకు భౌతిక స్థూలదేహమునకు గల పరస్పర సంబంధ మిదియని ప్రాచీనుల నిర్ణయము

"యథాచంద్ర స్తథాలగ్నం,
యథాలగ్నం తథా శశీ"

అనుమాత్ర మీ రహస్యము నే క్లుప్తముగానిర్వచించుచున్నది.

ఈ సంప్రదాయము ననుసరించి కవలకు ఆధాన కాలములను సాధించితిమేని, అప్పటి గ్రహస్థితి వారి జీవితానుభవములలోని వ్యత్యాసమును సూచింపవలసియుండునుకదా? ఒక ఉదాహరణము చిత్తగింపుడు:

1924-వ సంవత్సరమున, అక్టోబరు నెలలో 6-వ తేదీనాడు ఉత్తర బీహారు రాష్ట్రములో (26°-42' ఉత్తరాక్షాంశ, 84°-54' పూర్వరేఖాంశ) ఇరువురు పురుషశిశువులు కవలుగా జనించిరట. వీరిలో ప్రథముడు ఆ రాత్రి 1-0 Am లో, ద్వితీయుడు 1-5 Am లో జననమైరట. అగ్రజుడు కళాశాలాపరీక్షలలో ఉన్నతస్థాయి నందుకోజాలక, ఇంటరుమీడియేటు పరీక్షతోనే వ్యాసంగమును చాలించి, పాఠశాలలో ఉపాధ్యాయవృత్తి నవలంబించి, యథాలాభ సంతుష్టుడై యున్నాడు. 1955 మే నెలలో ఇతనికి వైవాహిక జీవితము లభించినది. ఇక, అవరజుడన్ననో, మొదటి నుండి విద్యావ్యాసంగములో శ్రద్ధ చూపుచు విశ్వవిద్యాలయ పరీక్షలలో పేరుగాంచి, యం. ఏ. పట్టము నార్జించి, ఆ రాష్ట్రమందే ఒకానొక ఉత్తమ కళాశాలలో అధ్యాపకుడుగా పనిచేయుచు అవివాహితుడుగ నేయున్నాడు. 1954 లో తనఅభిమాన శాఖలో ఆచార్యస్థానమును సంపాదించి ఇతడు ప్రశంస

సీయముగా ఉద్యోగమును నిర్వహించుచున్నాడు. అచిరకాలమందే ఉన్నత విద్యా పరిశోధనముకొరకై రాజ్యాంగమువారే ఇతనిని ఖండాంతరములకు పంపు సంభవమున్నదట. మరియు, ఇత డనేక గ్రంథములు వ్రాసిప్రకటించి గ్రంథకర్తగా ప్రఖ్యాతి వార్జించినాడనియు, వానిలో కొన్ని బహుమతులను గడించిన వనియు, తెలియుచున్నది. *

ఈ కవలు భిన్న జరాయుజులుగా నుందురని వారి జీవితానుభవముల తారతమ్యమే సూచించుచున్నవి. వీరి ఆధానకాలములను సాధింతము.

ప్రథమప్రసవము జరిగినట్లు చెప్పబడిన 1-0AM (ఇది ఇండియన్ స్టాండర్డు కాలమని ఊహింతము) కాలమునకు జన్మప్రదేశములో సాయన సింహరాశి యందలి 9° వ భాగ ఉదయమగుచుండును. అప్పటికి చంద్రుడు మకరరాశిలో 28°-56'లో ఉండుట. శుక్ల పక్షములో అదృశ్యార్ధగోళములో చంద్రుడున్నచో, గర్భకాలము పదినక్షత్రమాసములకు (273 దినములకు, కొన్ని దినములు హెచ్చుగా నుండుననుట ఈపద్ధతిలోని సూత్రములలో నొకటి. ఆప్రాంతములో 26-12-1923 నాడు మాత్రమే చంద్రుడు జన్మలగ్నములో నుండ గల్గుట. ఆదినమున జన్మ చంద్రస్థానము ఉదయమగు కాలములో ఒక శిశువునకు, అదేదినమందే జన్మ చంద్ర స్థానము అస్తమించుకాలములో మరియొక శిశువునకు, ఆధానము జరిగియుండవలయునని తేలినది. జన్మ చంద్రుడు స్త్రీలింగభాగారంభములోనుండి, జన్మ లగ్నము పుల్లింగ ప్రాంతమగుటచే, ప్రత్యేకాధాన కాలములకు హరిజ వ్యత్యాసము అవసరమైనది. గ్రంథ విస్తరణభీతిచే ఈ ప్రయోగపు గణితపద్ధతిని చాటిచూప లేదు.†

దీనివలన తేలిన ఫలిత మిది:—

| | మొదటి శిశువు | రెండవ శిశువు |
|---|---|---|
| ఆధాన దినము | 26-12-1923 | 26-12-1923 |
| ,, కాలము | 8-58'-27''AM (IST) | 6-54'-15'' (IST) |
| ,, లగ్నము | 28°-58' మకరము | 28°-44' కటకము |
| ,, ఆధానచంద్రుడు | 5°-24' సింహము | 10°-57' సింహము |
| జన్మ లగ్నము | 5°-24' ,, | 10°-57',, |
| ,, కాలము (శుద్ధము) | 12-39'-59'' AM (IST) | 1-6'-45'' AM(IST) |

రెండవ శిశువువిషయములో ఉపదిష్టకాలము శుద్ధకాలముతో ఇంచుమించుగా సరిపోవుచున్నదని పాఠకమహాశయులు గమనించియుందురు. ప్రథమ శిశువు జన్మకాలముమాత్రము 20 నిమిషములు వెనుకకు జరిగినది. మాతృగర్భములో మరియొకశిశువు ఉన్నదని తెలిసినపుడు ఆత్రత, ఆందోళనము, మంత్రసానికిసహజము. ఆ పరిస్థితులలో మొదటి ప్రసవపుకాలమును గమనించకపోవుటయు, రెండవప్రసవము జరిగిన అనంతరము ఆందోళనము శాంతించి కాలమును గమనించిన మంత్రసాని అందాజుగా ప్రథమశిశు జననమునకు 1-0 A M అని సంపుసంఖ్య చెప్పియుండుటయు, అసంభవముకాదు. తద్జ్ఞులెవరైనా, వేరుకాలమును నిర్ణయించి సహేతుకముగా చూపువరకు దీనినే ఆధారముగా భావింతముగాక.

పైరీతిగా శుద్ధపరచిన కాలములకు సాయన స్పష్ట లగ్నకుండలులు ఈ క్రిందనున్నవి:—

| | | | |
|---|---|---|---|
| వరుణ 18-35 (వ) | భార్య 8-49<br>X 29-54 | | |
| శు 26-42<br>కే 20-12 | సాయన<br>స్పష్టకుండలి | | యమ 13-28 |
| చ 28-44<br>దాంపత్య<br>11-41 | కవలలో అగ్రజునిజాతకము | | I 5-24<br>రా 20-12<br>ఇంద్ర21-56<br>శు 29-7 |
| గు 15-14<br>V 1 44 | శ 2-33<br>పుణ్య 20-54 | III 1.44<br>రాజ్య 8.36<br>ర 13-14 | II 3-34<br>బు 29-28 |

(*) శ్రీయుత బి. వి. రామన్ గారి సంపాదకత్వమున బెంగుళూరులో వెలువడు "ఆస్ట్రొలాజికల్ మ్యాగజైన్" అనబడు జ్యోతిష మాసపత్రికలో, 1956 మార్చినెల సంచికలో 303 వ పుటలో, ప్రకటితమైన పాట్నా నగరవాసి శ్రీ కేదారనాథ ప్రసాద్ గారి లేఖనుండి పైవిషయములు కృతజ్ఞతతో స్వీకరించబడినవి.

† భచక్రమునందలి లింగవిభాగము శ్రుతిప్రోక్తమగు 28 నక్షత్రముల చక్రముపైన ఆధారపడినది.

| | | | |
|---|---|---|---|
| వరుణ 18-35 (వ) | భార్య 14-21<br>రాజ్య 18-25 | X 6-36 | |
| కు 26-42<br>కే 20-12 | సాయన<br>స్పష్టకుండలి | | యమ 13-28 |
| చ 28-58<br>దాంపత్య<br>22-46 | కవలలో అవరజుని జాతకము | | I 10-57<br>రా 20-12<br>ఇం 20-56 వ<br>శుక్ర 29-8 |
| గు 15-14<br>V 8-3 | శ 2-32<br>పుణ్య 26-40 | III 8-3<br>ర 13-15 | II 9-30<br>బు 29-25 |

లగ్నములలో 5 భాగలవ్యత్యాసమున్నది. చంద్రస్థానములో భేదమత్యల్పము. నవాంశ అయినా మారలేదు. ఇతర గ్రహస్థానములలో మార్పులు లేవనియే చెప్పవచ్చును. గ్రహముల భావాధిపత్యములలో, భావస్థితిలో, వ్యత్యాసమే లేదు. జీవితములలో ఏ ప్రత్యేకత చూపట్టినా, లగ్నములలోని వ్యత్యాసమే కారణము కావలసియున్నది. పెద్దవాని లగ్నము సింహద్రేక్కాణముకాగా, చిన్నవాని లగ్నము ధనుర్ద్రేక్కాణమయినది. సింహాధిపతి నీచ రవి; ధనుస్సునకధిపతి స్వక్షేత్రబలముకల బృహస్పతి. ఒకనిది శని త్రింశాంశ అగుచుండగా, మరియొకనిది గురు త్రింశాంశ అగును. అన్నదమ్ము లిరువురి యోగ్యతలలో, అంతస్తులో, కల తారతమ్యమునకు ఇవి ముఖ్య కారణము కానోపునుకదా?

ఇంతమాత్రమే చాలుననికాదు. ఈ క్రింది విశేషాంశములు చూడుడు.

(1) ప్రబలుడగు బృహస్పతియొక్క శుభదృష్టి రెండు లగ్నములకును కలదు. ఎగుడు దిగుడులు లేక జీవితము నెమ్మదిగా నడచుటకు సదవకాశములను ఎదగించు యోగమిది. కాక, సత్సంతానమును, అర్జనమును, ఈ యోగము సూచించగలదు. కాని, ఇందులో ఒక విశేషమున్నది. బృహస్పతి దృష్టికి దీప్తాంశలు 9° భాగలు-ఈ ప్రదేశములో ఆ దృష్టికి గొప్పఫలప్రదత్వ మున్నదని తాజకసంప్రదాయము. అన్న లగ్నము ఈ హద్దునకు వెలిగా నుండుటయు, తమ్ముని లగ్నము దీప్తాంశలలోనుండి దృష్టి నభిలషించుచుండుటయు, గమనార్హములు. ఈ బృహస్పతి యందు భాగసాహితీ వైదగ్ధ్యమునకును, పాండిత్య ప్రకర్షమునకు, పేరైనది. ఈ తారతమ్యమునకు అనుభవము తగినట్లె యున్నదికదా!

(2) వ్యయభావమందలి యముని కేంద్రవేధకులోనై నీచపడియున్న రవికి లగ్నాధిపత్యము వచ్చుట రెండు జాతకములకును సమానమే. తల్లిదండ్రుల పరిస్థితులవలన చిన్నతనమున కలిగిన తొందరలో, అసౌకర్యములో, ఇది సూచించవచ్చును.

కాని, రాజ్యసహమమును పరికింపుడు. ప్రథముని జాతకములో క్లేశమును సూచించు భాగలో ఇది నివాస మేర్పరచుకొనుట! ఇది చాలక, యముని వేధతోనున్న నీచలగ్నాధిపతి సంయోగమునే ఇది అభిలషించుచున్నది. ద్వితీయుని జాతకములో ఈ సహమము నిలిచియున్న భాగ ప్రచండశక్తిని తెలుపునట్టిది. దీనికి ఇంద్ర, గురు, రాహువులనుండి స్నేహదృష్టి సౌకర్యమున్నది. అన్నదమ్ముల ఉద్యోగములలోని తారతమ్యము నిది చాటుచున్నది కదా?

(3) ఆధునిక విద్యావిషయమున పాశ్చాత్యశాస్త్రవేత్తలు తృతీయభావమును చూచుటవాడుక. మనవారు ఈ భావమును సాధారణముగా "పరాక్రమ" స్థానమందురు. విద్యావిషయమున మన ప్రాచీనుల దృష్టిలో చతుర్థభావము ప్రధానమైనది. ఇచట నొక ధర్మసూక్ష్మత కలదు. మన మహర్షుల మతములో 'జ్ఞానము'ను, అనగా మోక్షజ్ఞానమును, ఇచ్చునట్టిదే విద్య. ఇతర శాస్త్రజ్ఞానమును వారు 'విజ్ఞాన' మనిరి. ప్రాపంచికముగా, ఇతరులతోడి స్పర్ధలో మనల గెలిపించునట్టి విజ్ఞానము విద్యకాదు, మరి 'పరాక్రమ' మే. ఇప్పటి కళాశాలలలో మన విద్యార్థులు అభ్యసించుచుండునది విజ్ఞానమునిచ్చు చదువు. ఉద్యోగ గౌరవములో, ధనార్జనములో, సరివారికంటె హెచ్చు స్థాయిని సంపాదించుటకై విద్యార్థులిపుడు కళాశాలల చేరుచున్నారు. సాధ్యమైనచో, "యేనకేనాప్యుపాయేన" రెండో మూడో డిగ్రీలను పేర్ల కతికించుకొనుటకే ఈ సన్నాహము. ఇట్టి విద్యకొరకు చతుర్థ భావమును గమనించుట పరిహాసభాజన మగును. తృతీయ భావమే దీనికి తగినది.

ఈ జాతకములలో తృతీయ భావమున బుధుడు ప్రబలుడై యున్నాడు. చంద్రునితో ఇతనికి హిత దృష్టి కలదు. ప్రాపంచిక విద్యావ్యాసంగమునకు ఇది చక్కని అవకాశమును సూచించును. మంచిదే. కాని, అన్న జాతకములో తృతీయభావబిందువు వేరుగా రాజ్య సహమసంయోగమునే కోరుచున్నది. తమ్ముని తృతీయభావము తొలుదొల్త లగ్నాధిపతిని చేరి, తోడనే బృహస్పతియొక్క అర్ధకోణ శుభదృష్టిని సంపాదించుకొని, తరువాతనే రాజ్య సహమమును ఎదుర్కొనగలదు. స్వల్ప విద్యతోనే అన్న వృత్తికి నడకు కొనెను. యం. ఏ. పట్టము వచ్చిన అనంతరమే, తమ్మునకు ఉద్యోగము లాభించుట. ఫలము తగినట్లే యున్నది.

(4) ప్రథమమున దశమభావము చారవసల మేష రాశి ధనురంశలో నున్నది. చంద్రుని కేంద్రదృష్టి, శుక్రుని మిత్రదృష్టి దీనికి కలవు. పనులలో ఆత్రత, గౌరవ, సుఖాపేక్ష, ఇవి దీని ఫలము. ద్వితీయుని దశమము 'సమయస్ఫూర్తి, కార్యశ్రద్ధ' అనుగుణములను తెలుపు భాగలో నుండుట విశేషము.

(5) కుజుడే ఈ రెండింటిలో యోగకారక గ్రహము: ఒకచోట ధర్మకర్మాధిపతి, మరియొకచోట సుఖభాగ్యాధిపతి. పుణ్యసహమమునకు నయితము ఇతడే అధికారి. పైగా, ఆకుజునితో ఇత్థశాల యోగమును చేయుచున్నది సహమము. గొప్ప పట్టుదలతో పరిశ్రమ సలిపి సాధించు రాజయోగమును తెలుపగలదు. కాని, దీనిలో ఒక వైశిష్ట్యమున్నది. తమ్ముని సహమము రెండు నెలలలో యోగమును పూర్తిచేయగలదు. మరి, అన్నగారి సహమమో? అది కుజుని దృష్టిని అందుకొన గల్గుటకు పూర్వమే, ధనభావమందున్న ఇంద్రుని విషము దృష్టిపాలగుచుండుట కాలమహిమ. కుజుని సమసప్తకములో నున్న ఇంద్రునికి శక్తికి మించిన ఆశ, ఆశకు మించిన ఆత్రము, ఆత్రముతో చిందులు త్రొక్కు ఊహలు, ఊహలతో పరుగులెత్తు ఉద్యోగ కాంక్ష, అర్జన విషయమున సహజగుణములు. విద్య కొరకు చేయు కాలయాపన ఇప్పటి కాలమున వ్యర్థ మని అతనికి తోచినది. తమ్ముని జాతకములో ఇట్టి ప్రతిబంధక సామగ్రి లేక యోగము పూర్ణఫలప్రదముగా ఏర్పడినది.

"వికలికా కలికాదశహీనకః,
విరథగోల్పజవా దధవాసమః,
ముథశిలం సకలం సఫలంతదా,
ఫలతి తద్యవనో మునిరాడ్జగౌ,"

[యోగసుధానిధి]

అని తాజక (యవన) సంప్రదాయ మందలి ఉపలక్షణ సూత్రము. అవకాశములు, సౌకర్యములు సమానమయినా, సాధించిన ఫలములలో గల వ్యత్యాసమును ఈ యోగము నిరూపించ గలదు.

(6) చంచల స్వభావము గల చంద్రుడు సప్తమ భావములోనుండి, సప్తమాధిపతియు, భావ సంకోచ కారియునగు శని యొక్క కేంద్ర దృష్టినే అభ్యర్థించుచున్నాడు. తగిన వయస్సులో వైవాహిక జీవితము రానీయని యోగమిది. అంతులేని సంశయములు, అనవసరపు దూరదృష్టి, అతియనిపించు సౌకర్యకాంక్ష. మున్నగు కారణములచే త్వరలో తీర్మానము రాదు, ఇది అన్నదమ్ము లిరువురికిని సమానమే.

కాని, 1955లో జీవమానదశలో అన్నకు ప్రబలదశాయోగము ఏర్పడి, అతని దృక్పథమును మార్చినది. భార్యాసహమము చలించి వరుణుని అర్ధకోణదృష్టికి రాగా, ప్రబలమయిన ఆకర్షణమునకు జాతకుడు గురి అయినాడు. చలితలగ్నమప్పుడే కళత్రాధిపతి యగు శనియొక్క అర్ధకోణ శుభ దృష్టినందుకొను చుండెను. బలశాలియగు కుజు డప్పటికి చలించి చలిత శనిక నింకుకోణ దృష్టికి వచ్చుటచే, వివాహ విషయమున శనికి సహజముగా నుండిన భావమాంద్యము కొంత పలుచబారినది. చలితచంద్రుడు చలిత రవి త్రికోణ మైత్రి నార్జించి, చలితవరుణ సంయోగము నందుకొనజాలు కాలములో అతనికి వివాహము జరిగినది.

తమ్మునికి ఇట్టి దశాసౌకర్యములు ఎదిగి వచ్చినవి కావు. కావుననే, అతనికి వివాహమువైపు దృష్టి పార లేదు. పోతే, 1954 లో చలిత పుణ్యసహమమునకు ఇంద్రునితో, చలిత బుధునికి వరుణునితో, శుభకోణ దృష్టి సౌభాగ్య మిచ్చినది. ఆ సంవత్సరమున చలిత చంద్రునికి యోగప్రదుడగు కుజుని సంయోగ మెప్పుడు లభించెనో, అప్పుడే ఇతనికి ఆచార్యపదగౌరవము వచ్చినది.

(7) గ్రంథకర్తృత్వగౌరవము వచ్చుటకు ముఖ్యముగా జాతకములో తృతీయదశమ భావములకు ఉచితమైన ప్రబల సంబంధము కావలెనట! తమ్ముని

జాతకములో ఈ భావములు రెండును శుక్రుని యాజమాన్యములో నున్నవి. ఈ శుక్రుడో, ధనభావములో నున్న గ్రహము. ఇతనికి లగ్నాధిపతి రవితో పరివర్తన యోగ మున్నదికదా? పైగా, మహాప్రభావముగల మఘానక్షత్రము యోగతార (Regulus) పై ఈ శుక్రు డుండుట విశేషము. అన్న జాతకములో దశమాధిపత్యము శుక్రునికి రాక, కుజునిక వచ్చినదికదా? కుజుని దృష్టి వేరు.

జాతకయోగములలోగల ఈ వ్యత్యాసము ఈ సోదరుల జీవితానుభవములలోగల తారతమ్యమును స్పష్టముగా సూచించగలదని పాఠకమహాశయులు గమనించి యుండగలరు. కాని, ఈ సోదరుల ఆధానకాల మందలి గ్రహస్థితిని పరిశీలించనిదే, ఈ విమర్శనము సమగ్రము కాజాలదు. నిర్ధరించిన ఆధానకాలములకు సాయన చక్రము లెట్లున్నవో, చూతము.

ఈ క్రింది కుండలి అగ్రజునిది:—

| | | | |
|---|---|---|---|
| వరుణ 14-4 (వ) కే 5-20 | | | |
| రాజ్య 13-31 | ప్రథముని ఆధానకాల చక్రము (సాయనము) I | | యమ 11-27 |
| శు 29-46 I 28-46 బు 22-58 ర 3-19 | | | చ 5-24 ఇంద్ర 20-6 (వ) |
| గు 6-53 | శ 0 23 X 14-8 కు 14-10 | | పుణ్య 0-51 రా 5-20 |

రాజ్యభావాధిపతికుజుడు నికరముగా ఆ భావమధ్య బిందువందే మెరయుచున్నాడు కదా? పైగా వరుణునికి త్రికోణ దృష్టి సాహాయ్యమున్నది. అపార శక్తివంతమైన దశమాంగారకయోగ మిది.

"దశమేంగారకో యస్య, సజాతః కులదీపకః" అనియున్నగా, ప్రాచీనులు దీనినెంతో పొగడినారు. 'రుచక' మహాపురుష యోగమొకటి స్వయితము సిద్ధించినది. దీనికి, అతిశయోక్తిని వదలి చెప్పవలె, కార్యశూరత్వము, కార్య సాధనములో సాహసము, ఆలస్యము నోర్వలేని ఉత్సాహము, పలువురిలో నాయకత్వము వహించు కోరిక, ఇతరులపై అధికారము నిర్వహించు నేర్పు, మున్నగు సేనాని గుణములను ప్రసాదించుయోగమిది. దశమాంగారక యోగమున్నవారు వృత్తిలేని కాలయాపనమును సహించలేరు. నిరుద్యోగుల పట్టికలో వారి పేర్లుండవు. వారి దృష్టి ఉద్యోగము పైననే కాని, దాని అంతస్తు, ఆదాయము, మున్నగు వాని పైనుండదు. సమయమునకు ఏది దొరకునో, దానిలోనే తమశక్తిని ప్రకటించుటయే వారి లక్ష్యము. లగ్నములోనున్న బుధుడు చక్కని వాగ్ధోరణితో కూడిన తెలివిని ఇయ్యగలడు. కాని, మూడింటనున్న కేతువు విద్యా విషయమున ఉన్నత స్థాయికి భంగకారి. చతుర్థ భాగ్యాధిపతియగు శుక్రుని సంయోగము నభిలషించుచుండు లగ్నము కాయక్లేశమును సహించని స్వభావము. సులభముగా జీవనము గడుపు కోరిక. విషయసుఖలాలసత్వము, వైవాహిక జీవితముపై ప్రబల కాంక్ష, మున్నగు గుణములను సూచించగలదు. రాహువుతో చేరి, బృహస్పతికి కేంద్ర వేధలోనున్న పుణ్యసహమము సహజ సిద్ధములగు శక్తి సామర్థ్యములు సక్రమవికాసము నొందుటకు పూర్వపుణ్యము తగిన సౌకర్యముల నెదిగించి ఇయ్యజాలదని సూచన. దశమాధిపతి కుజుని కేంద్రవేధలో ఇంద్రుని సమసప్తక విషమదృష్టి నందుకొన బోవుచున్న రాజ్యసహమము ఉద్యోగ సంపాదనమందలి ఆత్రము, తరువాతి ఆర్థిక క్లేశము, తెలుపగలదు.

1955 లో చలితరవి కళత్రభావమందున్న చంద్రునికి అభిముఖుడుకాగా, వైవాహిక జీవితమున ప్రవేశించి స్థిమితత్వమును సంపాదించు శ్రద్ధ జాతకునికి వచ్చుట వింతకాదు. చలితచంద్రుడు ఆ సంవత్సరమున కళత్రకారకుడగు శుక్రునితో త్రికోణ దృష్టి వచ్చినపుడు (మేనెలలో) కళత్రసంపాదనము జరిగినది.

జన్మకుండలిలో సహా దశమాధిపత్యము కుజునికే వచ్చినదికదా! అయినా, అతనికచట గౌరవస్థానము లభించలేదు. సమాజమైన కార్యశూరత్వము, ఆత్రము, మాత్రమే మిగిలినవి. బి. ఏ, యం. ఏ, లని కాలయాపన చేయక, దొరకినంతలో ఉద్యోగము నొకదానిని సంపాదించుకొన్నాడతడు. పలువురు విద్యా

గ్రులపై అధికారము సెరపు అవకాశ మచట లభించు టచే, కుజుని ఆదర్శ మొకవిధముగా తృప్తినొందినది. యథాలాభ సంతుష్టి.

ఇక, అవరజుని ఆధానకుండలిని పరిశీలింపుడు :—

| | | | |
|---|---|---|---|
| వరుణ 14-4 (వ) పుణ్య 5-58 కే 5-19 | X 21-31 | | |
| శు 0-17 | ద్వితీయుని ఆధానకాల చక్రము — (సాయనము) II | | యము 11-27 I 28-58 |
| బు 23-25 రాజ్య 6-3 ర 3-45 | | | చ 10-57 ఇంద్ర 20-6 (వ) |
| గు 6-59 | శ 0-30 కు 14-26 | | రా 5-19 |

రాజ్యాధిపతి యగు కుజుడు పంచమభావములో నున్నాడిచట. ఉన్నతాశయములను తెలుపు భాగ్య(IV) భావమందలి వరుణుని త్రికోణదృష్టి ఈ కుజునిపై పూర్ణముగా నున్నదికదా? పరిశోధకదృష్టితో ఉన్నత స్థాయిలో శాస్త్రవ్యాసంగముచేసి తగిన వృత్తిని సంపాదించు విషయమున జాతకునిబుద్ధి ప్రసరించ గలదు. తృతీయ భావమునకు (ప్రాపంచిక విద్య), లాభభావమునకు (వృత్తివలని సంపాదనము) సహా బుధునికి (ఇతడు తృతీయాధిపతి) నిండు కోణదృష్టి సాహాయ్య మున్నది. నిశితమయిన విజ్ఞానము, ఉద్యోగ రీత్యా ద్రవ్యార్జనము తెలుపు సన్నివేశమిది. ధనాధిపతి యగు రవి సంయోగములో నున్నది రాజ్యసహమము. శని, కుజ, వరుణ, రాహు, కేతువుల స్నేహదృష్టి సంబంధము దీనికి కలదు. ఇతర కుండలియందలి రాజ్య సహమముతో పోల్చి చూచినచో, ఇది దానికంటె ఎన్నిరెట్లు ఉత్తమపరిస్థితులలో నున్నదని సులభ ముగా బోధపడుచున్నదికదా? కావుననే 1954 లో చలితదశమము బుధునికి కోణదృష్టికిరాగా, జాతకునికి ఉద్యోగాభివృద్ధి గౌరవము సహా లభించినవి.

పుణ్యసహమము కేతుసంయోగములోనుండి బృహస్పతియొక్క కేంద్రవేధలో నున్నదికదా? ఇతనికిమాత్రము పూర్వపుణ్యము అనుకూలించ గలదా? అని పూర్వపక్షము రావచ్చును. ఇచట పుణ్య సహమ స్థితిలో ఒక విశేషధర్మ మున్నది. ఈ సహమము వక్రగామి యగు కేతువుయొక్క సంయోగమునుండి విడివడి అనగా ప్రతిబంధకసామగ్రి నతిక్రమించి, ముందుకు ప్రయాణము సాగించుచున్న దని గమనించి నచో ప్రశ్నకు ప్రత్యుత్తరము లభించును. ఇంతే కాదు. ఈ సహమమునకు అధిపతి బృహస్పతియే, ఉచ్చాంశలలో నిలిచి అధిపతిదృష్టినే ఈ సహమము అభిలషించుచుండుట గొప్ప విలువ గల ఇష్టికాల యోగ మిది. కొంత ప్రయాస అయినా సత్ఫలము సిద్ధము, ఈ సౌకర్యము అన్నకుండలిలో ఎచటనున్నది?

శని శుక్రులకేంద్రదృష్టి ఇతరచక్రములకంటె దీనిలో నికరమై ప్రబలమైనది. 1955 లో ఆ చక్ర ములో వచ్చినవశాసౌకర్యములు దీనికి రాలేదు. చలిత రవి చంద్రుని సమసప్తకమునకు చాలదూరమందే నిలచి యుండెను. కనుక, వివాహప్రసక్తివచ్చినది కాదు.

ఇంతటితో చాలింతము. ఈజాతకులకు భావిఫల ములను గూర్చి ఇచట చర్చించబూనుకొనుట అప్రస్తు తము. ఇట్టి వ్యాసములలో అట్టి చర్చలు చేయుట అను చితముకూడ.

నైసర్గిక శక్తి సామర్థ్యములలో, అభిరుచులలో ఆదర్శములలో, కవలకుగల తారతమ్యమును వారి ఆధానచక్రము లెట్లు సూచించగలవో, వానికి జన్మకుం డలియందలి గ్రహస్థితులు ఆనుకూల్యప్రాతికూల్యముల నెట్లు సమకూర్చునో, ఈ ఉదాహరణము స్పష్టముగా చూపుననుకొందును. కాని, ఇట్టి విమర్శన మంతయు శుద్ధ 'స్పష్టలగ్నా'దులచే మాత్రమే సాధ్యమనియు, కేవల రాశికుండలులతో అసాధ్యమనియు విద్యార్థులు గుర్తించగలరు. మరియు, జన్మకాల చంద్రస్థితిలో 14 కలలు మాత్రమే వ్యత్యాసముండుటచే, 38 దినముల అంతరముతో అన్నదమ్ము లిరువురికిని వింశోత్తరీదశలో దశాభుక్తులు సమానముగా నడచుచుండుటచే, జీవితము నందలి వ్యత్యాసములు దశలనుండి సాధించ బూనుట వ్యర్థప్రయాసమే అగును.

# 1857 భారతీయ సైనికవిప్లవం

## కాలిన్ వెల్ష్

1857 మే 10వ తేదీ ఆదివారం; మట్టూ అనంతమైన సంరంభంగా వున్నా, ప్రజానీకంతో తిరుగుబాటు సంబంధం యావత్తూ విచ్ఛిన్నమై వుండటం చేత, ఆ సంగతి పసిగట్టలేక, మీరట్‌లోని యూరపియనులంతా నిమ్మకునీరెత్తినట్టు మామూలుగానే వున్నారు, వారికి కనుపించిన వ్యత్యాసమల్లా ఒకటే: హడావిడిగా, చెమటలు కారుస్తూ, చుట్టూ తిరుగుతూ వుండే బహుళసంఖ్య సేవకులు మాత్రం యేంచేతనో పలచబడ్డారు. సాయంత్రం, మతగురువు రాటన్, సతీసుతసమేతుడై చర్చికి బయలుదేరారు. శిశువులను పోషించుతూవుండే దాసి (భారతీయ స్త్రీయే) పనిగట్టుకు వచ్చి, బయటికి బయలుదేరవద్దనీ, చాలా ప్రమాదకరమైన పరిస్థితిగా వుందనీ సిపాయిలు పోట్లాడుతున్నారనీ హెచ్చరించింది. ఆయన దాన్ని పిరికిపంద క్రింద కట్టి కాతర్ చేయకుండా బయలుదేరారు. కాని ఎంతో దూరం పోకుండానే సంగతి సందర్భం కొంత అర్థమై భార్యాబిడ్డల్ని మధ్యమార్గంలో ఒక సురక్షిత ప్రదేశాన భద్రపరుచుకోవలసి వచ్చింది. తుపాకి కాల్పులు వినిపించాయి. విప్లవకారులను సమీకరించటానికి చెవులు గింగిర్లెత్తిపోయేలా యీలలు వేస్తున్నారు. సాయుధులైన సైనికులు, యిటూ అటూ హడావిడిగా పరుగులు దోలుతున్నారు. నిరాయుధులై వున్నవారు కంగారెత్తి వాళ్లవంక తెల్లపోయి చూస్తున్నారు. ప్రొద్దు క్రుంకుతూ చీకటి ముసుకలు క్రమ్ముకొస్తున్న గగనపథం వైపు, దూరదూరాంతరాలలో, భయంకరంగా పొగలు లేస్తున్నయ్. భారతీయ సైనికవిప్లవం ప్రారంభమైంది.

ఒకటి రెండు గంటలలో విప్లవకారులు జైలు తలుపులను పగలగొట్టివేశారు. గతదినం సైనికాధికారుల ఉత్తరువులకు ధిక్కారం చెప్పినందుకుగాను ఖైదు చేయబడివున్న తమ సైనిక సోదరులను ఎనభైఅయిదు మందినీ విడుదల చేసుకున్నారు. ఆడా, మగా, పిల్లా పాపా విచక్షణ లేకుండా అందిన తెల్లవాణ్ణి అందినట్టు కాల్చి చంపారు. యూరపియనుల బంగళాల మీద అగ్ని కురిపించారు. చేతికందిన ఆస్తిని ఎవరికందింది వాడు దోచివేశారు. ఇలా ఇక్కడి కార్యక్రమం ముగించుకుని, ఈ విప్లవసైన్యమంతా, మొగల్ సామ్రాజ్య ప్రాచీన పీఠమైన ఢిల్లీ నగరంమీదికి కదలిపోయారు. ఉట్టికి నాలుగు చేర్లూ తెగి, ఏమీ చేయలేమనే నిరుత్సాహస్థితిలో కంగారుపడుతున్న మొగల్ రాజు-ఆయన యిష్టానిష్టాలతో అట్టే ప్రసక్తి లేకుండా—'నామ్‌కేవాస్తే' నాయకుడుగా పెట్టి తిరుగుబాటు జాతీయ సంరంభంగానూ, రాజకీయ విప్లవంగానూ రూపు రేఖలు ధరించింది.

ఇలా ఉన్నట్టుండి హఠాత్తుగా విప్లవించటం ఇది ఒక నమూనా. ఇదేపద్ధతి అనంతరదశలో, ఉత్తర హిందూస్థానం సర్వత్రా అనుసరించారు. తిరుగుబాటు చేసిన ప్రతిసైనికదళం, ఖజానాలను దోయటం, దహనకాండకూ మారణకాండకూ ఉపక్రమించటం, అనంతరం ఢిల్లీకి పురోగమించటం—ఇదీపద్ధతి.

ఆత్మవిశ్వాసం నశించిపోవటమేగాక బ్రిటిష్ నాడికి భారతదేశంలో ఇక భద్రత లేదనే ఆశంక, మనకు శాశ్వతంగా ఏర్పడిపోయింది. దశాబ్దాలు గడిచినా, అనంతరం మననరాలు మనం కూడదీసుకోలేకపోయాం. 1857 కు పూర్వం ప్రముఖులుచేసిన అనేక హెచ్చరికలపట్ల మనం ఉదాసీనంగా వ్యవహరించాం. ఇక అట్లా ఏచిన్న విషయాన్నీ ఉపేక్షించరాదని మనకు తోచింది. భారతీయుల ఆలోచనలు ఏలావున్నా, వారిచర్య లెట్లావున్నా పట్టించుకోని

---

ఇది ఆంగ్లేయుడు ఆంగ్లేయపాఠకులను దృష్టిలోవుంచుకొని వ్రాసినవ్యాసం. అనేక ప్రధానవిషయాలు ఉల్లేఖింపబడివున్న కారణంగా దీన్ని భారతి పాఠకులకు అందచేస్తున్నాం. ఆ దృష్టితోనే స్వీకరించగలరని ఆశిస్తున్నాము.

అజాగ్రత్త అహంకారం సడలిపోయినై. భారతదేశం పట్ల, భారత ప్రజలపట్ల సానుభూతిలేనివాళ్ళకు, ఉదాసీనభావంతోనూ, తూష్ణీంభావంతోనూ వుండే వాళ్ళకు అవి నశించి, వాటిస్థానంలో పెద్దగాభరా పట్టుకుంది. అమృత్ సర్ చిత్రవధలు—చిత్రవధలు కాకపోతే దాన్ని మీరేమైనా అనండి— ఆ చిత్రవధలకు కారణభూతమైన ఆనాటి మన కంగారు— అది సకారణమా అకారణమా అనేవిషయం అక్కర లేదు—ఇవి భారత సైనిక విప్లవంయొక్క ఫలితాలు. అటు, భారత స్వాతంత్ర్యోద్యమం కూడా అంతే. ఈ విప్లవకారణంగా, నూరుకళ్ళతో పరిస్థితులను గమనించుతూవుండి, అవసరమైనప్పుడు హింసాకాండను ప్రయోగించితేగాని మనం భారతదేశాన్ని పరిపాలించలేమనే అభిప్రాయం యేర్పడిపోయింది. మీదుమిక్కిలి భారతదేశాన్ని శాశ్వతంగా పరిపాలించలేమనే అనుమానంకూడా పుట్టింది.

అసలు ఇంతప్రమాదం సంభవించటానికి కారణమేమిటి? సర్ హెన్రీ మెయిన్ ఇలా వ్రాశారు: 'భారతదేశపు ఆంగ్లపరిపాలన చరిత్రలో సిపాయిల తిరుగుబాటు పాశ్చాత్య దేశాలలోని సామాన్య ప్రజలందరికీ అవగతంగాని ఒక అద్భుతసంఘటనగా కనుపించుతుంది. కొందరు అదోరకం గుడ్డివాళ్ళుంటారు. వాళ్లకు కొన్ని రంగులే కనుపించుతాయి. మిగతా రంగులువాళ్ళకు అయోమయంగా వుంటాయి. అటే పద్ధతిలో కొందరు ఆ సంఘటనను అవగతం చేసుకోలేకుండా వున్నారు. చరిత్రకారుల సంగతికూడా అంతే. ఈ సంఘటన బరగటానికి కారణమేమిటయ్యా అంటే ఏదో అద్భుతకల్పనతో ఊహాగానం చేస్తున్నారు. దేశవ్యాప్తంగా ఇంతటి ప్రజావిప్లవం చెలరేగటానికి 'కొవ్వుపూసిన తూటాలు' కారణమంటే నమ్మటమేలా?" పై వాక్యాలు వ్రాసిన మెయిన్ అజ్ఞాని కాదు. భారతదేశం సంగతి అతనికి బాగా తెలుసు. అతను చెప్పేదాంట్లో చాలా అర్థముంది. ప్రాచ్యదేశాల విషయంలో మనం సమస్తం తెలిసిన సర్వజ్ఞులంగా నటించి లాభంలేదు. మనకు తెలియని, తెలుసుకోలేని విషయాలు అనేకం. తూటాలవిషయం అటుంచి, సిపాయిల తిరుగుబాటుకు సంబంధించినవి మన కార్యకారణ విజ్ఞానంతో నిరూపించటానికి వీలులేనివి వింత విషయాలు కావలసినన్ని. ఉదాహరణకు-విద్యుత్తుమల్లే కేవలం కొన్ని రోజుల అవధిలో, విప్లవవార్త దేశం నలుమూలలకూ ఎలా వ్యాపించింది? గ్రామంనించి గ్రామానికి వాయు వేగమనో వేగాలతో సరఫరా చేయబడిన ప్రతీక చిహ్నాలయిన 'ఆ చపాతీల' విషయం యేమిటి? మన కెవరికేనా యీ నాటికైనా బోధపడిందా? వాటి రహస్యమేమిటో ఆసరఫరా చేసిన వాళ్ళకే పూర్తిగా అర్థంకాలేదు. తూటాలకు సంబంధించిన సంఘర్షణ చిన్ని నిప్పు రవ్వలాంటిది. ఈ చిన్ని సంఘటన ఇంతటి మహా విప్లవానికి కారణమనటం హాస్యాస్పదం. అగ్నిస్పర్శకోసం ఎదురు చూస్తున్న ప్రేలుడు పదార్థం అప్పటికే అనంతంగా గుట్టలుబడివుంది. తూటాల సంఘటన కేవలం అగ్నిస్పర్శ. ఆపుకారు వ్యాపించకుండా అరికట్టడానికి—నిజానికి అందులో సత్యం ఎంతో లేకపోయినా—మనం అశక్తులమయాం. దీనివల్ల ఒకటి స్పష్టంగా తేలిపోతోంది. దేశీయులైన సిపాయిలకు పై అధికారులతోగల సన్నిహితత్వం అప్పటికే నశించిపోయింది. వారి ఉదారబుద్ధియందుగల విశ్వాసంకూడా హరించిపోయింది. ఆ చిన్న చిచ్చు వంగసైన్యపు అవధులలో ఆగకుండా, దూరదూరాంతరాలకు వ్యాపించి జాతీయ విప్లవ స్వరూపం దాల్చిందంటే దీనికంతకీ కొవ్వుతూటాలు కారణమని సమాధానం చెప్పుకోజూస్తే హాస్యాస్పదంగా వుంటుంది.

నిజానికి, సంగతేమిటంటే, భారతదేశపు పరిస్థితులలో మనం సహజంగా ఇమిడిపోలేకపోయాం. భారతీయుల సుఖదుఃఖాలు పంచుకుని కలసి మెలసి వ్యవహరించలేకపోయాం. కేవలం మనం అక్కడ ఏదో కొంత పని చేస్తున్నాం. ఆపనిచేయటంకూడా, దేశీయులతో వాళ్ళ అంతస్తులో వాళ్ళతో కలిసి వాళ్ళతోపాటు పనిచేయటం కాదు. మనం వాళ్ళ నెత్తిమీదుగా పోవటానికి ప్రయత్నించాం. మన నిర్ణయాలను వాళ్ళనెత్తినవేసి రుద్దటానికి ప్రయత్నించాము.

18 వ శతాబ్దము, 19 వ శతాబ్ది తొలిదినాలనాటి ఆంగ్లేయులకు, తరువాతివారికీ ఒక తేడా వుంది. ఆ మొదటితరంవాళ్ళు భారతదేశంవున్న దుస్థితిచూచి 'షాక్' తినేవాళ్ళుకారు. * అవినీతి, కశ్మలం ఎంత

---

* హెచ్. యస్. బ్రెయిల్స్‌ఫర్డు గారన్నట్లు ఒకసారి: 'విక్టోరియాతోజులనాటి పరిపాలకులు, దక్షిణ భారత పరిస్థితులను అవగతం చేసుకోగలగటానికి, ముందు ఒక సంవత్సరంపాటు ఇటలీలో గడిపి వస్తే బాగుంటేది' అన్నాడు.

కనిపించినా అది మరేమంత ఎబ్బెట్టుగా వాళ్ళకు తోచేదికాదు. అలా తోచటానికి ఆస్కారంకూడా లేదు. ఇక్కడ ఇంటిదగ్గిర ఇంగ్లండులోకూడా యివి రెండూ పుష్కలంగా వుండేవే గనుక అలవాటే. భారతీయుల సాంకేతిక పరిజ్ఞానం, హీనస్థితిలో వున్నదని వాళ్ళని ఏవగించుకునేవారుకారు. ఇక్కడ ఇంటికాడ తమస్థితి ఇందుమించు అదేస్థాయిలో వుండేదిగదా! భారతదేశంలో తన కళ్ళెదుట కనుపించుచూ వుండే ధనం, దర్పం, భారతీయ ప్రాచీన నాగరికతా వైభవం ఇదంతా చూచి విభ్రాంతుడై ఆదేశానికి రావటంతో తానుకూడా అలాంటి గొప్పవాడినైనానని సగర్వంగా చాటుకునేవాడు.

కాని 19 వ శతాబ్దిలో తయారైన ఆంగ్లేయుడు అలాంటివాడు కాడు. 'స్టీమ్ విజ్ఞాన వ్యవస్థ' గా మారిన ఆంగ్లేయ సంఘానికి చెందినవాడు. అహంకారి — సర్వపరిణామవాది, యితరులన్నా యితరుల అభిప్రాయాలన్నా అసహ్యం, అత్మ్రగురభిమానం, మొండితనం, సర్వాన్నీ ఒకే చదును చేయాలనే ఆవేశం, ఇతరులు తన ఆదేశాల ప్రకారం నడిపించి బాగుచెయ్యాలనే నెట్టి, అనుమానలేశంలేని సర్వజ్ఞతాభావం, భారతీయ భావనావిధానంపట్ల తూష్ణీంభావం, — తూష్ణీంభావమే కాదు — ఆవిషయమేమీ అర్థంచేసుకోలేని పరమ అజ్ఞానం. ఈ రెండు రకాల ఆంగ్లేయులకూ గల తారతమ్యం బాగా అవగతం కావాలంటే, జేమ్సుమిల్, మెకాలేల రచన లొకవంకా సర్ విలియం జోన్సు మొదలైనవారి రచన లొకవంకా విమర్శనదృష్టితో పరిశీలన చేయాలి. భారతీయ మతవిశ్వాసాలన్నీ అతని దృష్టిలో పరమ ఛాందసాలు; భారతీయ సాంఘిక వ్యవస్థ హాస్యాస్పదమైన ప్రహసనం. తనకు ఎదురైన ప్రతిదాన్నీ విరిగికొరగాకుండాపోయిన పాతసామాను క్రింద జమకట్టి నిరంకుశంగా గోడవతల గిరవాటు వేయటం అతని పని. అలా తను పారేస్తున్నవే భవిష్యత్తులో కష్టకాలం వచ్చినప్పుడు తన తలకాయ కాయటానికి ఉపకరించేవని అతనికి తోచేదికాదు. తను అజేయుణ్ణని అహంకరించేవాడు. ఏబాధ్యతనైనా భారతీయులచేతుల్లో పెట్టి వాళ్ళచేత పాడుచేయించేకంటే, లేదా తనకు నచ్చని మరోవిధంగా చేయించేకంటే, తానే స్వయంగా నిర్వహించితే కచ్చితంగా వుంటుందని అతగాడి అచంచలవిశ్వాసం. భారతీయులు ఎందుకూ కొరగానివాళ్ళనేది, అతని ప్రాథమిక సిద్ధాంతం; నిరూపణతో పనిలేని పరమసత్యం. సైన్యాలను నడపటానికి అధికారిగా భారతీయుడు తగడు. తన దేశీయపాలనలో తాను పాల్గొనటానికి భారతీయునకు సమర్థత లేదు. పోనీ కనీసం యింత భూమి పుట్రా తనదిగా వుంచుకుని, దానిననుసరించివుండే సాంఘిక బాధ్యతలను భరించటానికైనా భారతీయుడు చేతగానివాడు

1817 వ సంవత్సరంలోనే సర్ థామస్ మన్రో వ్రాశాడు. "అవి (బ్రిటిష్ పరిపాలనవల్ల కలిగిన సత్ఫలితాలు) స్వాతంత్ర్యాన్నీ, జాతీయతనూ, మీదుమిక్కిలి, ఒకప్రజను గౌరవార్హులుగా పరిగణించటానికి యేయోగ్యతలున్నాయో వాటినన్నిటినీ, త్యాగంచేసి, తత్ఫలితంగా కొనుక్కున్నవి. అందుచేత ఆయుధబలంతో బ్రిటన్ భారతదేశాన్ని ఆక్రమించటంఅంటే ఒకజాతిని జాతిని మొత్తంగా నిర్వీర్యులను చేసి వేయటం తప్ప మరోటికాదు. ఎవ్వడు దండయాత్రచేసి యేదేశాన్ని ఆక్రమించి తన ప్రభుత్వాన్ని నెలకొల్పినా ఆప్రభుత్వంలో, దేశీయులకు భాగ్యత లేకుండా పోవటమంటూ వుండదు. ఈ వైచిత్రి యీఒక్క బ్రిటిష్ ఇండియా పరిపాలనలో చూస్తున్నాము"—మరో సంవత్సరం అనంతరం మళ్లా ఇలా వ్రాశాడు: "విదేశీ దండయాత్రికులు, దేశీయులను హింసించటంవున్నది. చాలా క్రూరంగా హింసించటంకూడావుంది. కాని మనకుమల్లే ఇలా ఏహ్యభావంతో నీచులుగా పరిగణించి వ్యవహరించినవారెవరూ లేరు. జాతిని జాతిని యావత్తూ 'నమ్మకద్రోహుల' క్రింద ముద్రవేసి—తప్పనిసరి వాళ్లులేంది మనకి గడవనిచోట తప్ప—వాళ్ళకెట్టి ఉద్యోగావకాశాలూ లేకుండాచేశాం; ఎలాంటి విదేశీ పరిపాలకుడైనా ఇలా ఎవ్వడూ చెయ్యలేదు. దురదృష్టవశాత్తూ మన అధికారంక్రిందికి వచ్చిన ఒక పెద్దజాతి సౌశీల్యాన్ని ఇలా అవమానపరచటం, ఇది ఉదారత లేకపోవటమే కాదు, రాజకీయ పరిజ్ఞానం లేకపోవటం." సర్ థామస్ ఘోష బధిర శంఖారావమైంది. అనంతరం పరిక్రమించిన నాల్గుదశాబ్దాలలో ఏ దుర్గుణాలు అనర్థదాయకాలని ఆ పెద్దమనిషి గోల చేసాడో, అవి చెడపెరిగినై. ఆ కాల్యక్రమానికంతకూ దోహదం చేసినవాళ్ళు, డల్హౌసీ ప్రభువు, జాన్‌లారెన్స్‌లాంటి మతోద్ధారకులు — వాళ్ళిద్దరూ చాలా దొడ్డవాళ్ళు; భారతదేశం "కొరకు" చాలా

చేశారు; కాని, భారతదేశం"తో" కలసి ఏమీ చేయలేదు. అందుచేతనే వాళ్ళు చేసిందంతా క్షణభంగురమై పోయింది. సర్ జాన్ కేయీ * డల్హౌసీ పాత్రను చిత్రించాడు. ఆ చిత్రణ మొత్తం ఆవర్గానికంతకూ ప్రతిచిహ్నంగా వుంది.

"అతనికి వాళ్లను గురించి (భారతీయులను గురించి) ఒకే ఒక అభిప్రాయం: 'వాళ్లు తరతరాలుగా పాలక జాతుల నిరంకుశత్వానికి అలవాటుపడ్డవాళ్ళు" వాళ్ళ ప్రాచీన సంప్రదాయాలంటే వాళ్ళు ఎలా ప్రాణాలు విడవటానికి సిద్ధంగావుంటారో అతను అర్థం చేసుకోలేక పోయాడు. వాళ్లి ప్రాచీన రాజవంశాలపట్ల వాళ్లకు గల గౌరవ ప్రపత్తులను అతను సానుభూతితో అవగతం చేసుకోలేక పోయాడు. మన అత్యాధునాతన రాజకీయ వ్యవస్థల కంటే, ప్రజలు అవి యెంతటి లోపభూయిష్టాలుగా వున్నా—సంప్రదాయంగా వస్తున్న, సంప్రదాయ సిద్ధములైన తమ ప్రాచీన రాజకీయ పరిపాలనా వ్యవస్థల పట్లనే యెక్కువ విశ్వాసం కలిగివుంటారనే విషయాన్ని తలకు పట్టించుకోవటానికి అతనికి తాహతు లేక పోయింది. అనాదికాలం నుంచీ ఎన్నో తరాలుగా వస్తున్న ఒక రాజవంశవుంటుంది. ఎవడో ముక్కూ మొహం తెలియని కొత్తవాడు, విమతస్థుడు చేసిన ఒక అర్థంలేని శాసనంతో తన వంశాధికారం అంతచేయబడినప్పుడు బ్రతికివున్న ఆ రాజవారసునకు ఎలా వుంటుంది? గడ్డాలూ, మీసాలూ నెరసిన ఒక వృద్ధ నాయకుడుంటాడు. తరతరాలా అతని పెద్దలనాటి నుంచీ అనుభవిస్తూన్న కొన్ని అధికారాలూ, అవకాశాలూ మర్యాదలూ వుంటాయి. మరొకరంగు జాతివాడు వచ్చి, హఠాత్తుగా వాటినన్నిటినీ రద్దుచేసి ఆవృద్ధుణ్ణి ఫకీరుగా మార్చి అవమానపరిస్తే అతని హృదయం ఎలాంటి క్రోధంతో ఘూర్ణిల్లి పోతుంది? డల్హౌసీ ఇలాంటి వాటిన్నిటినీ అవగతం చేసుకునే తాహతు వున్న వ్యక్తిగాదు."

ఈ 'స్టీమ్ విజ్ఞాని'యైన ఆంగ్లేయుడు తొలుత భారతీయులను గురించి యేర్పరచుకున్న ఈ అభిప్రాయం, కేవలం జాతి విద్వేషకారణంగా యేర్పరచుకున్నది కాకపోవచ్చు. పరిశీలన దృష్ట్యా యేర్పరచుకున్నదే కావచ్చు. కాని మన్ని అపమార్గాన పెట్టడానికి సానుభూతి, సహృదయత లేని పరిశీలన వంటి దుష్టసారథ్యం మరొకటి వుండదు. అందుచేతనే తత్పరిశీలనా ఫలితములైన అభిప్రాయాలు జాతి విద్వేషం క్రిందవనండి—లేదా—దానికి భిన్నమైనదిగా పోల్చుకోవటానికి వీలుచిక్కని మరొకటేదైనా అనండి—అలా పరిణామం చెంది వూరుకుంది. 1857 నాటికి భారతదేశ ప్రజలతో సగం మొగమెరికగా తయారైనాం. అధికార దురహంకారం, ప్రజలతో కలసి మెలసి తిరిగితే మన హోదాకు భంగం కలుగుతుందనే దురభిప్రాయంతో దూరంగా ముడిగట్టుకు కూర్చోటం, ఈ రకం గుణగణాలు పెంచుకు కూర్చున్నాం. మన అధికార దురహంకారం కారణంగా ఆ మహా విప్లవం చెలరేగింది 'ముడిగట్టుకు' కూర్చున్న కారణంగా, ఆలాంటి సంక్షోభం రాబోతున్నట్టుకూడా ముందుగా మనకు తెలిసే ఆస్కారం లేకుండాపోయింది.

భారతీయులు మనకు భిన్నమైన ప్రజలు. అందుచేత వాళ్లు లోతక్కువరకం. కేవలం సాంకేతిక పరిజ్ఞానంలో కాదు, నైతికంగా కూడా. ఒక్క నీతి నియమా లేవీలేని సర్వవిధాలా కూడా. ఇంత ఎందుకు? మనం వాళ్లి మానవత్వాన్ని సహితం ఆశంకించే వరకూ వెళ్లాం. వాళ్లను తోటి మానవులుగా పరిగణించటం మానివేశాం. సైనిక విప్లవాన్ని అణచటంలో మనం ప్రదర్శించిన ఊహాతీతమైన పశుత్వానికి ఇదికారణం. సిపాయిలు కిరాతాలు చేశారనే వార్తలు విని—అందులో వాస్తవాలు కొన్ని, గోరంతలు కొండంతలుగా పెంచబడినవికొన్ని—మన సైన్యాలకు రేచిక్క పుట్టినమాట నిజమే. ఢిల్లీలో ఆంగ్లేయులపైన జరిగిన అత్యాచారాల వార్తలు విని నికల్సన్ ఇలా వ్రాశాడు; 'ఈ తరుణంలో వాళ్లు నా చేతికి దొరికితే, ఊహకు తోచిన చిత్రవధలన్నీ చేసి చీల్చి చెండాడి నిశ్శంకగా చేతులు కడుక్కునుందును." వాళ్ళ బలాలు మన బలా

* నేను సర్ జాన్ కేయీ రచించిన "భారతదేశపు సిపాయిల యుద్ధం" అనే గ్రంథంమీద చాలా వరకు ఆధారపడి ఈ రచన చేశాను. సిపాయిల తిరుగుబాటులాంటి మహత్తర సంఘటన యొక్క సమగ్రమైన, నిర్దుష్టమైన చరిత్ర ఆ సంఘటన జరిగిన అనంతరం, ఆరు సంవత్సరాల అనతికాలంలో వెలువడటం, సాధారణంగా సాధ్యమయ్యేపనిగాదు. కేయీ ఒక్కడే అలా సాధించారు. అంతు తెలియక అతను వదిలిపెట్టిన విషయాలు నాటికీ నేటికీ అలానే వుండిపోయాయి.

లకు ఎన్నో గెల్లు వున్నమాట నిజమే—36,000 బ్రిటిష్ సైన్యాలు, 257000 సిపాయిలతో తలపడవలసి వచ్చింది. సిపాయిలుకాక, రణక్షేత్రంలోకి ఉరికిన పౌర విప్లవకారుల సంఖ్య యెంతో ఆ భగవంతునికే తెలియాలి. ఆ తరుణంలో వెనకాముందు ఆలోచనలకు తావు లేదన్నమాట కూడా నిజమే. కేయీవంటి సరళ హృదయుడుకూడా ఆ పరిస్థితి విషమమైనదనే గుర్తించాడు. 'ఆ విషమ పరిస్థితి మానవుని భవిష్యత్తునంతనూ నిర్ణయించేదిగా నుండెను' అన్నాడు. కాని మనం పగ సాధించిన ఆటవిక క్రౌర్య విధానం, వాడు వీడని లేకుండా మొత్తం చేతికందిన అందరినీ హింసించటం, క్రౌర్యావేశ ప్రచోదితమైన దురహంకార ప్రవర్తనమూ—ఇవి—దెబ్బకు దెబ్బ తీయవచ్చుననే సిద్ధాంత రీత్యాగాని, భీతికారణంగా జరిగాయనిగాని, రాజ్యతంత్రి దృష్ట్యాగాని సమర్థించటానికి వీలులేదు సరికదా—ఇవి వాటికి కారణమని చెప్పటానికి కూడా ఆస్కారం కనుపించదు.

మే మాసాంతంలోగానే అంబాలానుంచి బ్రిటిష్ పటాలాలు దిగువకు పురోగమించుతున్నప్పుడు త్రోవలో, ఢిల్లీనుంచి పారిపోయి వచ్చిన బ్రిటిష్ కాందిశీకులకు హాని కలిగించారనే అభిప్రాయంతో గ్రామాలకు గ్రామాలే, ప్రజల నందర్నీ పట్టుకుని, నామ్‌కేవాస్తే విచారణ తంతు జరిపించి, జరిపించక, దరహంమీద హత్యలు చేయించారు. వాళ్ళను ఉరికంబాల మీదికి ఎక్కించేముందు పైశాచికంగా అనేక చిత్రహింసలు చేశారు. జుట్లు పీకేశారు, తుపాకి సన్నీలతో కుమ్మారు. సైనికులు పట్టుకుని బలవంతాన గోమాంసం తినిపించారు. ఇదంతా జరుగుతుంటే అధికారులు పక్కను నుంచుని వినోదం చూస్తూ చిరునవ్వులు వెదజల్లారు. జూన్ నెల ప్రారంభానికి, కాశీలో, న్యాయవిచారణ పేరిట ఒక విచిత్రమైన తంతు ప్రారంభించారు. తద్వారా పసిపిల్ల బాలాదినీ ఊరకుక్కలకంటే కనాకష్టంగా ఉరికంబాల మీదికెక్కించారు. కేవలం ఆటలోటితనానికి, శైశవక్రీడగా, విప్లవ పతాకాలను పుచ్చుకుని తిరుగుతున్న చిన్న పిల్లలను ఉర్లుదీశారు. ఇంతమందిని ఉరిదీయటానికి, శిక్షణ పొందిన ఘాతుకులు ఎక్కడ దొరుకుతారు. ఈ కార్యక్రమం నిర్వహించటానికి కొన్ని 'స్వచ్ఛంద దళాలు' ఏర్పడినై. ఈ ఔత్సాహిక దళాలు ఎగబడి, గ్రామీణ ప్రాంత్రాలనన్నిటినీ పురుగు నాకించి వదిలాయి. ఒక పెద్దమనిషి తను వందలాదిగా ఉరిదీసేశానని బడాయిలు కొట్టాడు. "కళాసైగర్వ్యం ఉట్టిపడేలా" చాలా చిత్రంగా ఈ కార్యక్రమాన్ని నిర్వహించాడు. పైన మామిడిచెట్లకు ఉరిత్రాళ్లు కట్టించటం, జనాన్ని ఏనుగులమీద ఎక్కించి వాళ్ళ మెడలకు ఉర్లు బిగించి ఏనుగును ముందుకు తోలెయ్యడం; అలా చచ్చినవాళ్ళ శవాలను '8' అంకెరూపంలోకి మెలికలు తిప్పేసి ముందుకు సాగటం—ఇదీ ఆ అద్భుత కళానిర్వహణ. జూన్ నెలలోనే చిన్నా పెద్దా, ఆడా మగా విచక్షణ లేకుండా అలహాబాదు ప్రజల్ని నరికివేశారు. రినాడ్ కాన్పూరుకు బయలుదేరి, మధ్యే మార్గంలో, రోడ్డు ప్రక్కను, రెండు రోజులలో, నలభైయిద్దర్ని ఉరితీశాడు. అందులో 12 మంది చేసిన మహాపాపమేమిటి అంటే, "వాళ్ళ ముఖాలు సరియైన వైపుకు తిరిగిలేవట." ఇవి సర్ విలియం రసెల్ రచించిన వాక్యాలు. రినాడ్ ఆ పురోగమనంలో, పోయినంత దూరం, గ్రామాలను దగ్ధశ్మశానాల క్రింద ఎడారిక్రిందా, గున్నా పేట్టాదిక్కు లేని బంజరుభూముల క్రిందా చెట్లకు శవాలు వ్రేలాడే పిశాచభూమిక్రిందా మార్చివేశాడు.

ఈ ఉదాహరణలన్నీ యథాతథంగా సేకరించినవే కాని పనిగట్టుకు మొత్తిమాపుతున్నవి గావు. వీటినే యే జాతీయులో చేసివుంటే, పైశాచ చర్యలని వుండును. నాడు భారతదేశం దిక్కుదిక్కునా జరిగిన హింసాకాండలు పైఉదాహరణల కేమీ తీసిపోయేవి గావు. ఇవ్వన్నీ కూడా, భారతీయులు జరిపిన మహాదురంతాలుగా పరిగణించబడిన కాన్పూర్ హత్యాకాండలకంటే ముందే జరిగాయి. అందుచేత వాటి దృష్ట్యా వీటిని సమర్థించటానికి వీల్లేదు. పైపెచ్చు మనం జరిపిన యీ అకృత్యాలే వాటిని రెచ్చగొట్టివుండవచ్చు.

ఇవన్నీ శాసనాధికారంపట్ల ప్రజలకు సహజంగా వుండే గౌరవాన్ని సడలుగొట్టేవి. అందుచేత. వెంటనే అధికారాన్ని పునఃస్థాపన చేయటానికి ఉపకరించకపోగా, మరింత క్లిష్టపరిస్థితికి కారణమయ్యాయి. కొన్ని చర్యలు—రినాడ్ జరిపిన లాంటివి, మన సైనిక చర్యలు సాగటానికికూడా అవాంతరాలు కల్పించినై. మన సైన్యానికి కావలసిన సమస్తం, వార్తలు సహా, భారతీయుల సహాయంతో సరఫరా కావలసివున్నాయి. వాళ్ళనందర్నీ అలా హడలుగొట్టి యెక్కడివాళ్లు

అక్కడి పరారీ అయేటట్లు చేస్తే మన సైన్యంస్థితి అధోగతిగా మారింది.

ఇంకా మనవాళ్లు చేసిన దురాగతాలు యినిన్నీ కావు. ఢిల్లీ తిరిగి మనకు వశమైనప్పుడు మనంచేసిన దేవిటి? మొత్తంగా అందర్నీ చిత్రవధచేశాం. మన వాడు పరాయివాడు అని చూడకుండా అందర్నీ ముక్కలక్రింద నరికేశాం. ఇలువగుసని నగరాన్ని మొత్తంగా దోచేశాం. ఇవన్నీ ఒకటే విషయాన్ని నిరూపించుతున్నాయి— భారతీయులను వ్యక్తులుగా పరిగణించటం మానేశాం. వారిలో ఎవడైనా మనకు ఒకటే. రంగునుబట్టే ఒకమందక్రింద పరిగణించాం. వారి చర్యలనుబట్టే వాడువీడని లేకుండా మొత్తం నరికి వేయవలసిన శత్రువులుగా పరిగణించాం. ఈవివక్షణా జ్ఞానం నశించటంతో ఉభయత్రా ఈ శత్రుత్వం జాతి విద్వేషం క్రింద మారి, మనం భారతదేశంలో వున్నన్నినాళ్ళూ ఇక అది అరలేదు.

వంగదేశం ప్రధానమైన ప్రాంతం అక్కడి ఆంగ్లేయులకూ భారతీయులకు సన్నిహితత్వం వుండటం ఎంతైనా అవసరం. కాని, ఈ తిరుగుబాటుకుముందు అక్కడి భారతీయ సైన్యానికి మనకూ ఎలాంటి అంతర్యమూ లేకుండా పోయింది. కాని అతఃపూర్వం 19 శతాబ్దిప్రారంభంలో అలావుండేదికాదు. క్రయీ అన్నట్టు సైన్యం సైన్యాధికారి స్వగృహంగా వుండేది. సిపాయిలు అతనిబిడ్డలు. అతనికి బయటి వ్యాపకాలేవీ లేవు. యూరప్‌తో అతనికున్న సంబంధం బహుస్వల్పం ఆంగ్లేయ స్త్రీలంటూ వుండేవాళ్ళుకాదు. సిపాయిల కష్టసుఖాలు తను ఆలోచించేవాడు సాయంత్రంపూట భారతీయ సైనికాధికారులతో కలసి తన స్వంత బంగళాలోనే, ముచ్చటలాడుతూ వుండేవాడు; కామ కలాపాలు తీర్చుకోవాలనే కక్కుర్తిపుడితే ఏ భోగం దాన్నో దెప్పించుకుని ముచ్చట తీర్చుకునేవాడు. అతడు భారతీయులకు అధికారి మాత్రమేకాదు. సగం భారతీయుడుగా మారి కలసి మెలసి బ్రతికేవాడు.

తరువాత 50 సంవత్సరాలలో పరిస్థితి యావత్తూ మారిపోయింని. కేంద్రాధికారం తీవ్రతరం చెయ్యటంతో, ఈ సైనికాధికారుల ప్రాధాన్యత తగ్గిపోయింది. సైన్యంలో, వాడి వాడి యోగ్యతలను బట్టి ఒకణ్ణి పైకి తేవటానికిగాని, ఒకణ్ణి, శిక్షించటానికిగాని అతనికున్న అధికారాలు పరిమితమైపోయాయి. సర్వాధికారిగా వున్నవాడు 'అడ్జుటెంట్ జనరల్ ఆఫీసు' పలికిన పలుకులకు వప్పజెప్పే రామచిలుకక్రింద తయారైనాడు. అతని నిర్ణయాలను పైవాళ్లు కొట్టిపారేసేవాళ్లు. ఒక వెర్రికుంకక్రింద తయారుచేసి సిపాయిల ముందే అతణ్ణి గద్దికరిపించేవాళ్లు. పైవాళ్ళ దుష్టవిధానాలనుంచి తన సైనికులను తాను రక్షించుకోలేని దుస్థితి యేర్పడింది.

ఈ కేంద్రీకృతాధికారం ఈ విప్లవానికంతకూ ముఖ్యకారణమైనా, ప్రారంభదశలోనే ఈ విప్లవమే ఈ కేంద్రీకరణను ధ్వంసం చేయటం అదృష్టకరమైన విషయం. తంతి తీగలను ఎక్కడికక్కడ నరికివేశారు. ఒకచోటినుంచి ఒకచోటికి వార్తలందటం అసాధ్యమయిపోయింది. రావల్‌పిండినుంచి జాన్‌లారెన్సు గవర్నర్ జనరల్ కానింగుకు జూన్ 10 వ తేదీన ఉత్తరం వ్రాశాడు. జూలై నెలాఖరుకు కూడా దానికి సమాధానం రాలేదు. ఢిల్లీ సెప్టెంబర్‌లో గాని మనకు వశంగాలేదు. కాని జూలైలోనే వశమైనట్టు పుకారులు వినవచ్చినై. అనంతరం ఎట్టి వార్తలూ అందని కారణంగా గవర్నరు జనరలు సహితం ఈ పుకార్లనే పట్టుకు కూర్చున్నారు. అధికార కేంద్రీకరణ విచ్ఛిన్నమైపోయింది గనుకనే హడ్‌సన్ నికల్‌సన్‌లాంటి వాళ్ళకు అవకాశం కలిగింది. చేతగానివాళ్లు వదిలిపెట్టేసిన అధికారాన్ని చేపట్టి వాళ్ళకు తోచిన మొండి బాణీలో వాళ్లే చేతనైనపని చేయగలిగారు. ఎడ్వర్డ్సు ఇలా వ్రాశాడు: 'అలాంటి చావు బ్రతుకుల సంగ్రామంలోకి చొచ్చుకుపోక పోయినట్లయితే నెవిలీ బాంబర్ లేన్‌కూ, జాన్ నికల్‌సన్‌కూ బ్రిగేడియర్ జనరల్ అయ్యే అదృష్టం యెప్పుడు పట్టేది. సుసంఘటితమైన బ్రిటిష్ సైన్యం ఛిన్నాభిన్నమై పోయినప్పుడు ఈ ఇద్దరూ సాహసోపేతులై లేచారు. "తమకు అధికారంలేని కార్యకలాపాలు చేపట్టి నిర్వహించిన వ్యక్తులు భారతదేశంలో బ్రిటిష్ పరిపాలనను రక్షించారు. తెగిన తంతితీగలు వారికి అలాంటి అవకాశమిచ్చినాయి.

కేంద్రప్రభుత్వానికి పట్టిన ఈదురాశతో, తొలినాటి సైనిక జీవితం మరింత ధ్వంసమైపోయింది. ఏ సైనిక దళానికీ సరియైన ఆరితేరిన అధికారి లేకుండా వాళ్ళందర్నీ కేంద్రానికి లాగివేశారు. అందులో యోగ్యులు ప్రతిభావంతులలో వాళ్లందర్నీ ఏరి ముందు లాగేశారు

పరిపాలనా శాఖలోకి అనేకమంది కావలసివచ్చారు. ఎంతమంది వచ్చినా కేంద్రానికి తీరని దాహమైపోయింది. కొత్త కొత్త ప్రాంతాలను పరిపాలించటానికి అనేకమంది అధికారులు కావలసివచ్చారు. భూములు సర్వేలు చేయించాలి, ప్రభుత్వ కార్యాలయాలను యెన్నిటినో నిర్మించవలసివుంది. కొత్త కొత్త దేశీయ సైనిక దళాలను నిర్మించాలి, ఈ కార్యక్రమాన్నంతా నిర్వహించటానికి అనేకమంది గొప్పవాళ్లు (తెల్లవాళ్లు) కావాలి. ఇవన్నీ బాగా డబ్బువచ్చే ఉద్యోగాలు, ఎదుగూ బొదుగూ లేని సైనికోద్యోగం అంటే ప్రతివాడికీ మొహం మొత్తింది. అధికారులు లేకుండా పోయిన దళాలకు అధికారులు లేకుండాపోగా మిగిలివున్నవాళ్లకుకూడా ఆ ఉద్యోగాలలో ఆసక్తి లేకుండా పోయింది. ప్రతి ఒక్కడూ తన కెప్పుడు పిలుపు వస్తుందా అని ఎదురుచూస్తూ కూర్చోవటం—రానివాడు ఆశాభంగం చెంది మూతి ముడుచుకుని కోపంగా కూర్చోటం.

వీటన్నిటికంటే ప్రధానమైన విషయం మరొకటి. భారతదేశంలో చేరిన ఆంగ్లేయులు ఆంగ్లేయ సాంఘిక వ్యవస్థను అక్కడకూడా పెంపొందింప జేసుకోవటానికి ప్రయత్నించారు. ఇంగ్లీషు పుస్తకాలు, ఇంగ్లీషు పత్రికలు, ఇంగ్లీషు నీతినియమాలూ, అలవాట్లూ, ఇంగ్లీషు నిక్కు, ఇంగ్లీషు మర్యాదలు, అన్నిటినీ తలదన్ని ఇంగ్లీషు పడుచులూ, వగైరా పుష్కలంగా దిగుమతి చేసుకున్నారు. వీటితో మనకూ భారతీయులకూ మధ్య అధిగమించరాని ఒక పెద్ద గోడ యేర్పడిపోయింది. ఏ సన్నిహితత్వం మన అధికారం బలవత్తరం కావటానికి కారణమైందో ఆ సన్నిహితత్వం ధ్వంసమైపోయింది. ఆఖరికంటా 1857 వచ్చేసరికి, త్రోవప్రక్కన మర్రిచెట్టుక్రింద గోచిపాత బెట్టుకుని ముక్కు మూసుకున్న సన్యాసికి అర్థమైనంత మాత్రం, సేనా ముఖాన స్వారీ చేస్తున్న అధికారికి తన వెనక వస్తున్న సైనికుల మనస్సుల్లో ఏ ఆలోచనలు సాగుతున్నాయో అవగతం కాకుండా పోయింది.

ఈ అజ్ఞానంయొక్క పరమావధి యెంతో, తిరుగుబాటు తరుణంలో బయటబడి పోయింది. ప్రతి సిపాయీల దళమూ తిరుగుబాటుకు సర్వ సన్నాహాలు చేసుకుని అదనుకోసం ఎదురుచూస్తోంది. ఈ స్థితిలో ప్రతి సైనికాధికారీ ఒక్కడి తరువాత ఒక్కడు, "ఏబ్భై మన సైనిక దళమా ? హాఁ ! మన మాటంటే అలా ప్రాణాలు ఒగ్గేస్తారు." అని మీసాలు మెలిపెట్టారు. తన సైనిక దళంమీద వేసిన అపవాదులకు ఉగ్రుడై, కల్నల్ సింసన్ 'ఇంగ్లీషుమన్' అనే పత్రికలో తన సైనికుల భక్తి ప్రపత్తులను సమర్థిస్తూ, ఆ అపనిందలపట్ల తనకు గల తీవ్రమైన అసమ్మతిని ప్రకటించుతూ ఒక వ్యాసం వ్రాశాడు. ఒకటి రెండు దినాలన్నా కాలేదు. సిపాయిలు తిరుగబడి అతని క్రిందవున్న అధికారులనందర్నీ నరికివేశారు. చేతిమీద చిన్న గుండుదెబ్బతో అదృష్టవశాత్తూ తను బ్రతికి బయటపడ్డాడు.

పెషావరులోని సైనిక దళాలను నిరాయుధులను చేయటానికి ప్రయత్నాలు జరిగినప్పుడు. సేనానులంతా మొత్తంగా ప్రతిఘటించారు. తమ దళాలపట్ల తమకున్న పరమ విశ్వాసాన్ని ప్రకటించుతూ తీవ్రంగా దెబ్బలాడారు. ఒక సేనాని సామరస్యమార్గం అవలంబించాలని సలహా యిచ్చాడు. మరొకడు నిరాయుధులను చేస్తే తన సిపాయిలు తుపాకులు తీసుకుని తిరుగుబాటు చేస్తారని దబాయించాడు (ప్రభుభక్తికి విచిత్రమైన తార్కాణమే!)

ఆ సైనికులు కుట్రలో కంఠంలోతు మునిగి వున్నారని నిరూపించుతూ, నికల్సన్ తనకు దొరికిన ఉత్తరాలు చూపించితే వాళ్లు అవితిన్నగా చూడకుండానే, మండిపడ్డారు. 55 వ దళం అధిపతి కల్నల్ స్పాటిస్‌వుడ్ తన సైన్యాన్ని నిరాయుధులను చేయబూనుకున్నప్పుడు తనంత తను తలకాయకు గురిపెట్టి కాల్చుకుని ఆత్మహత్య చేసుకున్నాడు.

33 వ రెజిమెంటును నిరాయుధులను చేస్తున్నప్పుడు ఆ సేనాని తనసైన్య ప్రభుభక్తికి కావలిస్తే తన తలకాయను హామీయిస్తానని కళ్ళనీళ్లు పెట్టుకుని యేడిచాడు. భారతదేశం సర్వత్రా ఇలాంటినాటకమే జరిగింది. ఆ అధికారులంతా అంత అంధకారంలో ఉన్నారు.

అలా సైనిక విప్లవం, పుకార్లూ, గుసగుసల ద్వారా రెజిమెంటునుంచి రెజిమెంటుకు వ్యాపించింది. కేంద్రీకరణవల్లనూ, సేనానులకు సిపాయిలకూ మధ్య సన్నిహితత్వం నశించటంవల్లనూ, మితిమీరిన ఆత్మవిశ్వాసంవల్లనూ ఏర్పడిన, అవకాశంలో యేవో అదృశ్యహస్తాలు జోక్యం కల్పించుకుని ఈ విప్లవ కార్యక్రమాన్నంతా నడిపినై.

ఈ విప్లవం ఒక్క సైన్యానికే పరిమితమై వున్న దయితే, అది ఎంత హఠాత్తుగా విజృంభించిందో అంత తొందరగా అణచివేయటానికి కూడా అవకాశం వుండేది. ఎక్కువ విషఫలితాలు లేకుండా సద్దుకో గలిగే వాళ్ళం. కాని అది అలాంటిది కాదు. భారతీయులు దానికిగల జాతీయ స్వభావానికి ప్రాధాన్యత నిచ్చి తక్కువుచేయకుంటూ వచ్చారు. ఈ విప్లవాన్ని భారతీయులు 'భారత స్వాతంత్ర్య సమరం' అంటున్నారు. సవర్కర్ విఖ్యాతమైన ఒక చరిత్ర గ్రంథం రచించారు. బ్రిటిష్ ప్రభుత్వం దాన్ని బహిష్కరించింది. అందుచేత దాన్ని పారిస్‌లో ప్రచురించారు. ఈయన అభిప్రాయాన్ని ప్రతిఘటించుతూ బ్రిటిష్ రచయితలు, అది కేవలం సైనిక విప్లవమేనని వాదిస్తూ కొన్ని గ్రంథాలు వ్రాశారు.

కాని వాస్తవ విషయాలు ఈ రెండు వాదాలలో దేన్నీ సమర్థించేవిగా లేవు. 1857 లో భారతదేశం ఇంకా భూస్వామిక వ్యవస్థగానే వుంది. ఆస్థితిలో 'జాతీయత'ననుసరించి మాట్లాడటం హాస్యాస్పదమవుతుంది. కాని యీ సైనికకల్లోలం వెనుక, దేశవ్యాప్తంగా చెలరేగిన పౌరకల్లోలాన్ని విస్మరించి అలాంటి దేమీ లేదని కొట్టివేయటం కూడా హాస్యాస్పదమే. భారతదేశంలోని అనేక ప్రాంతాలలో మన పరిపాలన పూర్తిగా ధ్వంసమైపోయింది. మనం సాధించిన వాటినన్నిటినీ పూర్తిగా తుడిచివేశారు. సైనిక విప్లవం కాదంటే అనవచ్చు, ప్రజావిప్లవం కాదంటే అనవచ్చు, ఆ వాదాలవల్ల ప్రయోజన మేమిటి? ఇవి రెండూ కూడా ఒకదానితో ఒకటి చేతులు కలుపుకున్నా, దేనికది ప్రత్యేకమైనవే.

మన పరిపాలకులు సాధించిన మహావిజయంగా చెప్పబడుతూవుంటే, వాయువ్య పరిహద్దు రాష్ట్రాలంటారే, అక్కడి ప్రజాబాహుళ్యం ఏ సిపాయిల సహాయం లేకుండా తమంతతాము తిరుగుబాటుచేశారు. కొన్ని ప్రాంతాలలో ఈ కల్లోలాన్ని అణచటానికి సిపాయిలు మనకు సాయపడ్డారుకూడా. దేశంలో, కేవలం సైనికవిప్లవంగా మాత్రమే చెలరేగిన ప్రాంతాలలో ఎక్కువ కష్టనష్టాలు లేకుండా తక్షణం చల్లారిపోవటం కూడా జరిగింది. ఒకటి రెండురోజులు చిత్రవధలు, గృహదహనాలూ జరిపి అనంతరం ఆ సిపాయిలు ఢిల్లీకి వెళ్ళిపోయేవారు. తిరిగి మన పరిపాలనను వెంటనే స్థాపించటానికి వీలయ్యేది. "వాయువ్య పరిహద్దు రాష్ట్రాలు మనకు ఆశ లేకుండా పోయాయని" గవర్నర్ జనరల్ వ్రాసినా, "ఓ ప్రదేశం ఒకే ఒక అరాచకమైపోయిందని" హెన్రీ లారెన్సు వ్రాసినా ఆ స్థితికి కారణం కేవల సైనికుల తిరుగుబాటు మాత్రమే కాదు. కేయీ చెప్పినట్టు, అసలు వాస్తవ మేమిటంటే ఆయా ప్రాంతాలలో, ప్రతిఘటించటానికి తాహతు వున్న అన్ని వర్గాలూ మనమీదకు లేచాయి. దాంతో మన ప్రభుత్వం పేకమేడలా కూలిపోయింది. మనకు శక్తి గాని స్నేహితులుగాని లేకుండా పోయారు. ఇది ఎలా జరిగింది?

"అధునాతన బ్రిటిష్ సామ్రాజ్యవాదంలో వుంటే ఆవకతవక విధానమే యిందుకు కారణం. సంప్రదాయ పద్ధతిని పోయే సామ్రాజ్యవాది పద్ధతి వేరుగా వుంటుంది: అతనికి తన అధికారం సుస్థిరం కావటం ప్రధానం. ఈ దృష్టితోనే అతను సర్వాన్నీ ఆలోచించుతాడు. తనకు బలం చేకూర్చే ప్రతిదాన్నీ ప్రోత్సహించుతాడు. అలా కానివాటిని అణచివేస్తాడు. పాలిత ప్రజానీకంలో వుంటే శక్తులు, వ్యవస్థలు, వాటిని గురించి ఆలోచించేటప్పుడు—వాటి కవి మంచివా చెడువా అని చూడడు. అతనికి ఉపకరించేవైతే మంచివి, వ్యతిరేకమైనవైతే చెడ్డవి. సంఘ సంస్కరణనైనా అదే దృష్టితో చూస్తాడు. నేను ఇందంతా అల్లరి పెట్టటానికి వ్రాయటంలేదు. ఏదో క్రమబద్ధమైన పరిపాలన అంటూవుండటం దానికదే ఒక పెద్దమేలు. క్రమబద్ధమైన పరిపాలన అంటూ లేనిది ఏదీ అభివృద్ధికి రాదు. ఈ రకం, కేవల సామ్రాజ్యవాది అయినవాడు, సాధారణంగా, దేశీయప్రజల జీవిత విధానంపట్ల సహనం కలిగివుంటాడు. దేశీయంగావుంటే హక్కులనూ మర్యాదలనూ గౌరవించుతాడు. దేశీయులకు ప్రభుత్వంలో స్థానంయిచ్చి వారిమైత్రిని సాధించటానికి ప్రయత్నించుతాడు. ఏవి ఇబ్బందులనీ, అపమర్దతకు కారణమనీ ఇతరరకాల సామ్రాజ్యవాదులు త్రోసివేస్తారో, వాటిని ఇతడు తెలివిగా పరిశీలించి, వాటిలో బలాన్ని యివ్వగలవాటిని గ్రహించుతాడు.

19 వ శతాబ్ది బ్రిటిష్ సామ్రాజ్యవాది కేవలం ఇందుకు భిన్నమైనవాడు. తీవ్ర సామ్రాజ్యవాదం (రాడికల్ ఇంపీరియలిజం) అనే క్రొత్తరకం సామ్రా

జ్యవాదాన్ని సృష్టించాడు. దీనిలోవుండే వైరుధ్యాల సంఘర్షణమునుంచే 1857 తిరుగుబాటు ప్రభవించింది. మనం భారతదేశంలో వున్నది కేవలం పరిపాలన చెయ్యటానికి మాత్రమే కాదు, దాన్ని పాతరూపురేఖలు తోచకుండా మరమ్మతు చేసెయ్యటం ప్రధానకర్తవ్యం అనేది ఈ క్రొత్త సామ్రాజ్యవాదంయొక్క ప్రధాన సూత్రం. అభివృద్ధి జరిగేటట్టు చూడటం కాదు, ఏది ఎలా తలక్రిందులైనా కేంద్రం ఈ అభివృద్ధిని కొరడా బుచ్చుకు ముందుకు తోలెయ్యాలి. ఈ వ్యవహారంలో దేశీయుల సలహా తీసుకోవటానికిగాని, వాళ్ల అభిరుచులనుగురించి ఆలోచించటానికిగాని ఆ కార్యక్రమంలో వాళ్లు పాల్గొనేటట్టు ప్రోత్సహించటానికిగాని "టైము" లేదు. చేయవలసినంత పని జరుగవలసి వుండె!

పంజాబును కలుపుకొన్నప్పుడు, పాతరకం సామ్రాజ్యవాది కావటంచేత, లారెన్సు, అక్కడి దేశీయ పాలకవర్గాలను కొంత ఉదారతతో చూశాడు. దీన్ని మిగతా వాళ్ళు చాలా విమర్శించారు. అనవసరమైన ఈ చాపకూడు మనుషులకు యిచ్చే గ్రాంట్లు, పెన్షన్లు వగైరా ఖర్చంతో యితరత్రా యెంత కార్యక్రమమైనా సాధించవచ్చునన్నారు. ఇది కొంత అవకతవకైనా పలుకుబడిగల ఈ వర్గాలను పరిపాలనకు బలంగా దగ్గరకు తీసుకోవటానికి లారెన్సు కొంత అవకాశం ఇచ్చేవాడే. కాని క్రొత్త సామ్రాజ్యవాదులకు ఇది సహించ నచ్చలేదు. అవకతవకలకు అవకాశమిస్తేగాని పరిపాలించలేని పక్షంలో, అసలు పరిపాలించట మెందుకు? ఇది అంతా అల్లరికి వ్రాయటంగాదు. ఈ పరిపాలకులు పెద్ద ఆదర్శాలను పెట్టుకొని, వాటిని సాధించటానికి, సహనరహితంగా సంస్కరణలను అమలు జరపటానికి ప్రయత్నించారు. వాళ్ళకు, బీదవాళ్లన్నా, వెనుకబడినవాళ్ళన్నా, పీడితులన్నా, ఎంతో సానుభూతి వుంది- మనం సాంఘిక న్యాయం అంటున్నామే దాన్ని సాధించాలని వాళ్ళ తాపత్రయం. అంత చెయ్యటానికి ప్రయత్నించటంవల్ల కలిగిన ఫలితమేమిటంటే, మన అధికారం కూకటి వేళ్ళతో కూలిపోయింది. మనకు ఏమీ చేయలేక పోయాము.

విప్లవానికి పూర్వం, ఈ క్రొత్త సామ్రాజ్యవాదం, పాతవ్యవస్థను మార్చటంలో రెండు ముఖ్యమైన పనులు చేసింది. దేశీయ సంస్థానాలు రద్దుచేసింది. దేశీయ ఉన్నత వర్గాలను నామమాత్రులుగా చేసింది. పాతతరానికి చెందిన కల్నల్ స్లీమన్ అప్పుడే గోల పెట్టాడు: "స్వదేశీ సంస్థానాలు మనకు అండ. వాటిని రూపుమాపితే మనం కేవలం దేశీయసైన్యంమీద ఆధారపడవలసివుంటుంది. ఈ సైన్యం సర్వదా మన చెప్పుచేతల్లో వుంటుందని అనుకోవటానికి వీల్లేదు' అన్నాడు స్లీమన్‌లాగానే, కలకత్తా సుప్రీం కౌన్సిలుకు చెందిన కల్నల్‌లో కూడా హెచ్చరించాడు. ఈ స్వదేశీ సంస్థానాలవల్ల, అవినీతీ, అరాచకం ప్రబలటానికి ఎంత అవకాశం వున్నా, వెనుకటి హామీలు వగైరా యేవీ పాటించకుండా అవకాశం దొరికిందేచాలునని వాటిని రద్దుచేయటం ప్రమాదకరం' అన్నాడు.

డల్హౌసీ మొండిబాణీని మార్చటానికి ఈ హెచ్చరికలకు శక్తిలేకపోయింది. ఈ సంస్థానాలంటే తుడిచి వేయవలసిన పాతఛాయలుగానూ, రాజకీయంగా కుళ్లుకుంటల్లాగాను అతనికి తోచినై. పైపెచ్చు అవి ఒక బ్రిటిష్ సామ్రాజ్య ప్రాంతానికీ మరొక ప్రదేశానికి మధ్యలోవుండి ఏకటాకీ పరిపాలన యేర్పాటుకానికి అడ్డంకుగా కనుపించాయి. అలవాటుపడ్డ నిరంకుశత్వం పోయి, మరొక విదేశీ నిరంకుశత్వం తల కెత్తుకోవటం జనానికి నచ్చదని అతని మెదడుకు తోచలేదు.

ఝాన్సీ సంస్థానాన్నిగురించి అతను ఇలా వ్రాశాడు. "ఇది మన అధికారంలోవున్న ప్రాంతాలకు మధ్య కుంపటిగావుంది. దీన్ని స్వాధీనం చేసుకుంటే బొందెల్‌ఖండ్ ప్రాంతానికంతకూ సమగ్రమైన పరిపాలనను యేర్పాటు చేయటానికి వీలౌతుంది. మనకు లభించిన అనుభవాన్నిబట్టి ఝాన్సీ ప్రజలుకూడా ఇంతమూలంగా అభివృద్ధి చెందుతారని చెప్పవచ్చు."

ఈ సంస్థానాన్ని కలుపుకోవటంతో డల్హౌసీ, బలమైన ప్రభుత్వాన్ని యేర్పాటు చేయగలగటానికి మారు అస్తవ్యస్త పరిస్థితులను వ్యాపింపచేశాడు. మిగతా సంస్థానాధీశులందరికీ అనుమానం పుట్టింది. ఔధ్ దేశాన్ని కలుపుకోవటంతో వారి అనుమానాలు బలపడి పోయాయి.

మన విస్తరణ దాహంలో మనకు బలమైన అండలుగా వుండదగిన అన్ని అవకాశాలనూ కూలదీసుకున్నాం. దేశంలో పలుకుబడిగల యితర ఉన్నత వర్గాలతో కూడా మనం ఇలాగే వ్యవహరించాం. వారి ప్రయోజనాలకూ మన ప్రయోజనాలకూ ఎంతో సామ్యంవుంది. అందుచేత వారు తప్పనిసరిగా మన్ని బలపరిచేవారు, ఇది గమనించకుండా వాళ్లని రూపు

మూపాము. ప్రభుత్వాధికారాన్ని స్థాపించటానికిమారు, వ్యవసాయక విప్లవకారుల రేంజర్లు లా పనిచేశాం.

దేశంలో మనంతప్ప, పలుకుబడికలవాళ్లు యితరు లుండటమంటే మనకు చిరాకు పుట్టింది. డబ్బు, దస్కం అనుభవిస్తున్న ప్రతి ఒక్కడూ కేవలం అన్యాయ మార్గాన దాన్ని సంపాదించి వుంటాడని మన అభిప్రాయం. అందుచేత ఎట్టి శంకా లేకుండా, రాష్ట్రం తరువాత రాష్ట్రంగా ప్రజానీకాన్ని ఒకే మట్టానికి చదునుచేసుకు రావటానికి పూనుకున్నాం. అధికార పత్రాలు దగ్గిరా లేకుండా ఎవరు ఏ హక్కును అనుభవిస్తున్నా దానల్లా రద్దుచేశాం. ఈ కార్యక్రమాన్ని కొనసాగించటానికి మనం రకరకాల పద్ధతులనూ అమలు జరిపాం.

'పాత కుటుంబాలను పాడు చెయ్యవచ్చును గాని ప్రజల మనస్సుల్లోనుంచి వాటిచరిత్రను తుడిచివెయ్యలేమని బాడాన్ మేజస్ట్రేటు విలియం ఎడ్వర్డ్సు హెచ్చరించాడు. చాలామంది ఇలాగే హెచ్చరించారు. 'ఇలాంటి చర్యను కొనసాగిస్తే మన రక్షణకు మనం కేవలం బ్రిటిష్ పటాలాలమీద ఆధారపడవలసి వస్తుందని 1838 లో ఒక కలకత్తా పత్రిక హెచ్చరించింది.

ఈ హెచ్చరిక లన్నీ బధిరశంఖారావమై పోయాయి. అందుచేత చిన్న సైనిక విప్లవం చెలరేగగానే మనం పెద్ద ప్రజావిప్లవాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. మనం ఎవరెవరిని గౌరవంగా బ్రతికటానికి వీలులేకుండా చేశామో వాళ్ళంతా ఈ విప్లవానికి నాయకత్వం వహించి మన్ని యెదుర్కొన్నారు. మిత్రులుగా వుండవలసిన వాళ్లు శత్రువు లయ్యారు. వాళ్ళకు పోయేదమీ లేదు. వాళ్ళని మనం అప్పటికే ఫకీరుల్ని చేశాం. బాడాన్ లో జనం తిరుగుబాటు చేయగానే అక్కడి పాత భూస్వాములు నాయకత్వంవహించి మనం నియమించిన కొత్త అధికారులను నాశనంచేసి తిరిగి తమ ఆస్తులు తాము స్వాధీనం చేసుకున్నారు. సిపాయిలంటే మామూలు ప్రజానీకానికి సహజమైన ఏహ్యభావం వుంటుంది. ఈ అకృత్యాలు మనం చెయ్యకపోతే వాళ్ళు సిపాయిలతో చేతులు కలపేవాళ్లుకారు. ఈ ప్రజానీకాన్ని తమ గుప్పెట్లో వుంచుకోగలిగినవాళ్లే అరాచకాన్ని ప్రోత్సహించారు.

సర్ జార్జ్ ట్రేవెలియన్ ఇలా వ్రాశాడు. 'తిరుగుబాటు రగిలిందని తెలియగానే అనేక శక్తులు కాన్పూరు మీదికి లేచాయి. చుట్టూ వున్న ప్రజలంతా కాన్పూరు మీదికి దూకారు. దివాలాతీసిన పాత భూస్వాములంతా రెండొందలమంది, నాలుగొందల మంది సాయుధ జనాన్ని వెంటేసుకుని, శివానీసింగ్ 1200 తుపాకీవశంలోనూ గోదాలో దిగారు.' ఈదశలో మన అధికారం నాశన మౌతుందన్న విషయంలో ఎవ్వరికీ అనుమానం లేదు. ఏ పాత భూస్వామి అయినా అధికారం చేపట్టే స్థితి వచ్చింది.

మనం, చవటలనీ, దివాలాకోరులనీ పేర్లు పెట్టిన వీళ్ళే మన చదునువిధానాన్ని ప్రతిఘటించుతూ. ప్రాచీన భారత సంప్రదాయ ప్రతినిధులుగా పోరాడారు. కాని ఓడిపోయారు. చావుతెంపులై బ్రిటన్ తిరిగి ఎలాగో ఒకలాగు విజయాన్ని చేపట్టగలిగింది.

కాని ఇది శాశ్వతవిజయం కాదు. సమైక్యత, సమగ్రత్వం, సమాన ప్రతిపత్తి వగైరా పేర్లతో అనంతరం మనం తిరిగి అమలు జరిపిన విధానం భారత దేశంలో చెలరేగనున్న భవిష్యదాందోళనకు రూపురేఖలు దిద్దింది. భారత స్వాతంత్ర్యోద్యమానికి యీ విధంగా జాతీయతా స్వభావాన్నీ, సామ్యవాదశీలాన్నీ ఆపాదించింది. ఈ ఒక్క అర్థంలో, సిపాయిల తిరుగుబాటును — నిజంగా భారత స్వాతంత్ర్య సమరమని పిలవటానికి ఆస్కారముంటుంది.

* ఎన్‌కౌంటర్ పత్రిక సౌజన్యంతో.

# రాత్రివేళ

బాలగంగాధర తిలక్

రాత్రివేళ, ఎవ్వరూ లేరింట్లో, మసకగా ఉన్న విద్యుద్దీపాల కాంతిలో ఒక్కణ్ణీ బాల్కనీలో కూర్చున్నాను బోగన్ విల్లా పందిరిలో. ఒక్క నిముషం ఆగి తెరలు తెరల్లాగ వీచే గాలిలోంచి ఎవరిదో ఏదో మధురాతిమధుర విషాదగానం నేరుగావచ్చి గుండెల్లోకి గుచ్చుకుంటోంది.

నిర్జనస్థలం, ఎవ్వరూ లేరు. చుట్టూ పరచుకున్న మైదానపు నగ్న దేహాన్ని స్పృశించబోయే నిచుల శాఖాగ్రపు వ్యగ్రపు తొందర, నిశ్శబ్దం మెల్లగా అడుగులు వేస్తూ నడుస్తోంది. ఆకాశంమీద ఒక చుక్క మరో నక్షత్రంతో మాట్లాడే మాట మాత్రం మనస్సుకి వినిపిస్తోంది.

ఇంత రాత్రివేళ యీ గానం ఎవరిదో చీకటి కాగితంమీద ప్లాటినమ్ తీగలాగ మెరుస్తోంది; ఏదో విషాదాన్ని హాయిని భయాన్ని పంచిపెడుతూంది. ప్రాణాలకి అడుగున ఉన్న సుతారపు తీగల్ని కదలిస్తోంది. ఏదో నిధి దగ్ధమైన జీవితంకాంక్షలు. పాపం మొరపెడుతోంది జాలిజాలిగా. సంకీర్ణమైన విశ్వరహస్యం మరీ మరీ నిగూఢమై కదలే నల్లని నీడలలో కలిసిపోతోంది.

చెరచబడ్డ జవ్వని విడివడిన పృథు శిరోజభారంలాగ యీ నిశీథం మలిన మలినమై, చెదిరిన తన అందాన్ని చీకట్లతో కప్పుకుంటోంది.. ఒంటరిగా నాలో ఊహాలలో అవ్యక్తంలాగ ఒదుగుతోంది. అనంతమైన శూన్యాన్ని అలుముకుంటోంది. ఏదో పాటమాత్రం ఏడుపేడుపుగా సన్నగా తీయగా గాలిలో ఊగుతోంది. నీరవమైన ఏకాదశి నిశీథాన్ని రెండుగా చీలుస్తోంది

# కలగూరగంప

## పుష్పగిరి తిమ్మనార్యుడు: అతని కృతులు

శ్రీ వేదము వేంకటకృష్ణశర్మ

సాధారణముగ ఇంతవఱకు పాఠశాలాంత (S. S. L. C.) పరీక్షలకు నీతిపద్య సంకలనము ఏనుఁగు లక్ష్మణకవి కృతి భర్తృహరి పద్యములనుండియే జరిగెడిది. ఈ 1958 సం॥ పరీక్షల కేర్పడిన తెలుఁగు పాఠ్య ప్రథమభాగమున తిమ్మనార్యుని కృతినుండి తీసికొన్న పద్యము లాస్థాన మాక్రమించినవి. అనువాయతిగా వచ్చుచుండిన ఏనుఁగు వారి జిరాయతిహక్కు పుష్పగిరి వారి కొసఁగుట సంప్రదాయభిన్నము.

అనువాదకళలో ఏనుఁగు వారు చూపిన లౌక్యము భర్తృహరిని తెలిఁగించిన యేలకూచివారికిఁగాని, యీ పుష్పగిరి వారికిఁగాని పట్టుబడలేదు. సురభి మల్లభూపాలుని పేర సుకుట నిర్మాణ మొనర్చి యతనికి అంకిత మొనర్పవలసిన బలవంత బ్రాహ్మణార్థమునకు లోఁగిన యేలకూచివారి పద్యములన్నియు ప్రాయికముగ శార్దూలములు; ఒండె మత్తేభములు. చిన్న చిన్న అనుష్టుప్పులలో మూలగ్రంథకర్త యిమిడ్చిన నీతులను సహితము శార్దూలమత్తేభములు కబళించివైచినవి. ఇఁక పుష్పగిరి వారు కొన్ని పద్యముల యెత్తుగడలలో ఏనుఁగువారిని అనుకరింపఁ దలఁచిరి; కాని బోల్తా తప్పలేదు. ఈ త్రిమూర్తులే కాక యింకిరువురు మువ్వురుగూడ, దీని—నాంధ్రీకరించిరి. నాశతక వాఙ్మయ సర్వస్వమున—ఈ భర్తృహరి వ్రాసిన వారి నందఱినిగూర్చి వ్రాసియున్నాను. కావున, నిపుడు తిమ్మనార్యుని—అతని కృతులనుగూర్చియే—యించుక వివరింపనెంచితి.

తిమ్మనార్యుఁడు స్వతంత్రకావ్యముగ రచించిన 'సమీరకుమార విజయ' పీఠికాభాగమున తన్నుగూర్చి యిట్లు చెప్పుకొనెను :—

"శ్రీహనూమత్పాద సేవాగతాధ్యాత్మ
తత్త్వకవిత్వ మహత్త్వనిధుఁడ
నాశ్వలాయనసూత్రహారి విశ్వామిత్ర
గోత్రాబ్ధిచంద్రుఁడఁ గుశలమతిని
అలపుష్పగిరి యప్పనార్యున కోబళాం
బకును సుపుత్రుండ, బ్రహ్మవేత్త
యైన వేంకటకృష్ణయాగ్రణికిని వేంక
టాఖ్యకవీంద్రున కవరజుండను
సరసగుణయుతుండ, వరకవి, తిమ్మనా
హ్వయుఁడ నేను జననమంది, మనుట
కెల్ల ఫలము గల్గఁ గృతి యొక్కటి రచింప
నూహసేయుచున్న నొక్కనాఁడు॥"

ఇతఁడు విశ్వామిత్ర గోత్రుఁడనియు, ఆశ్వలాయన సూత్రుఁడనియు, పుష్పగిరి అప్పనార్యునకును, ఓబళాంబకును పుత్రుఁడననియు వేంకటకృష్ణయ్యకు, వేంకటాఖ్యునకుఁ దమ్ముఁడననియుఁ జెప్పుకొన్నాఁడు. ఇంటి పేరినిబట్టి ఇతఁడు వైదికుఁడని ఊహింపవలసియున్నది. తాను హనుమదుపాసినని పయి పద్యమందలి మొదటిపాదమునఁ దెలుపుకొన్నాఁడు. కావున నే 'సమీరకుమారవిజయము'-ను ఇష్టదేవతానుగ్రహార్థము వ్రాసినాఁ డనఁదగును.

ఇతని అభిజనము నెల్లూరుమండలము - కోవూరు తాలూకాలోని మోదేగుంట అను గ్రామము. ఇతఁడు పదునెనిమిదవ శతాబ్ది క్రీ. శ. 1750-90 ప్రాంతమువాఁడని ఆంధ్రకవుల చరిత్రమునఁ గలదు. ఇతని స్వతంత్రరచనలలోఁగల శబ్దసౌష్ఠవము, మంజుల మధురధారాధోరణి అనువాదములలోఁ గనఁబడకున్నది. ఆంధ్రీకరణమున సందర్భానుసారముగ ఉచిత శబ్ద ప్రయోగముచే రసోత్పాదన మొనర్చుటలో సిద్ధహస్తుఁ డనిపించుకొన్న శ్రీనాథకవిసార్వభౌమునికిఁ దరువాతి వారిలోఁ గొందఱకట్టి ప్రజ్ఞ అలవడలేదనుట సాహసముగా నేరదు.

# క ల గూ ర గ ం ప

ఇతఁడు ఉభయభాషలలోను మంచిపాండితి గలవాఁడు. కవితావీధిని నిరంకుశముగ సంచరింపఁగలవాఁడు. వేదాంతశాస్త్రపారంగతుఁడు ఇతఁడు— (1) భర్తృహరిశతకత్రయము, (2) సమీర కుమారవిజయము, (3) సాధు మేధానిధిశతకము, (4) శేషశైల విహారశతకము, (5) శిశువదాంబాస్తుతి—అను గ్రంథములను రచించెను. ప్రకృతి మీతని భర్తృహరి నీతిశతకమునాత్రమే ప్రచారమున నున్నది. పరిశోధకులు త్రిశతిలో నది యొక్కటే తిమ్మన వ్రాసినాఁ డనుట పొరపాటు. తక్కిన రెంటినికూడ అతఁ డాంధ్రీకరించెను. కాని, లభ్యమయినవి కావు. సమీరకుమారవిజయమును వావిళ్లవారు ముద్రించిరి. సాధుమేధానిధి శతకమును కావలి ఉన్నతపాఠశాలాంధ్ర పండితులు శ్రీ కేసరి సుందరరామశర్మగారు సంపాదించి 1938 సం॥ర ప్రాంతమున నెల్లూరునుండి వెలువడుచుండిన —'స్వతంత్ర'—యను వారపత్రికలో వెలువరించిరి. తక్కిన నాలుగైదు సంఖ్యలుగల కృతులలోఁ గొన్ని పద్యములుమాత్రమే లభించినవి. దొరకినంతవఱకు యీ తిమ్మనార్యుని కృతులలోని పద్యములను శ్రీ కొమాండూరు రామానుజాచార్యులవారు సేకరించి నాకడకుఁ బంపిరి.

ఇతఁడు ఏనుగులక్ష్మణకవి యెత్తుగడల నవలంబించియు భర్తృహరిశతకానువాద మంత రసవంతముగఁ దెనిఁగింపలేకపోయెనని వచించితినిగదా! అందులకుఁ గొన్ని యుదాహరణము లిత్తును :

(1) (ప్రసహ్య మణి ముద్ధరే న్మకరవక్త్ర దంష్ట్రాన్తరాత్ : మూలము)

దీనికి ఏనుగువారి అనువాదము :

"మకరముఖాంతరస్థమగు మానికమున్
బెకలింపవచ్చుఁ, బ్రా
యక చలదూర్మికా నికరమైన
మహోదధి దాటవచ్చు, మ
స్తకమునఁ బూవుదండవలె
సర్పమునైన ధరింపవచ్చు, మ
చ్చిక ఘటియింప మూర్ఖజన చిత్తముఁ
దెల్ప నసాధ్య మేరికిన్"

పుష్పగిరివారిది :—

"మకరముకోఱనున్న పెనుమానికమైన
హరింపవచ్చు ; దు
శ్శకచలదూర్మిఘోషమగు సాగరమైనఁ
దరింపవచ్చు ; క్షు
త్ప్రకుపితభోగినైనఁ బువుదండవలెం
దలఁదాల్పవచ్చు ; బా
యక ప్రతికూల మూర్ఖ హృదయంబది
త్రిప్పఁగ రాదొకప్పుడున్."

(2) (క్షాంతిశ్చేత్కవచేన కిం? కిమరిభిః
క్రోధోఽస్తిచేద్దేహినాం : మూలము.)

ఏనుఁగువారి ఆంధ్రీకరణము :—

"క్షమకవచంబు, క్రోధమది శత్రువు, జ్ఞాతి
హుతాశనుండు, మి
త్రము తగుమందు, దుర్జనులు దారుణ
పన్నగముల్, సువిద్య వి
త్తి, ముచిత లజ్జ భూషణ, ముదాత్త కవిత్వము
రాజ్య, మీక్షమా
ప్రముఖ పదార్థముల్ గలుగు పట్టునఁ
దత్కవచాదు లేటికిన్."

పుష్పగిరివారి తెనుఁగుసేత :—

"క్షమమది యున్న నేల కవచంబు? బరి
యేటికిఁ గ్రోధమున్న?, దా
య మలయు నేల చిచ్చు, పరమౌషధమేల
సుహృత్తుగల్గ, దు
ష్ట మనుజుఁడున్న నేల ఫణి, ద్రవ్య మదేల
సువిద్యయున్న, సి
గ్గమరిన సొమ్ములేల? కవితాఢ్యత గల్గిన
రాజ్య మేటికిన్."

(3) (విపది ధైర్య మథాభ్యుదయే క్షమా: మూలము)
ఏనుఁగువారి అనువాదము.

"ఆపదలందు ధైర్యము, సమంచిత సంపదలందుఁ
దాల్మియున్,
భూపసభాంతరాళమునఁ బుష్కలవాక్చతురత్వ, మాజి
బాహాపటుశక్తియున్, యశమునం దనురక్తియు, విద్య
యందు వాంఛాపరివృద్ధియుం బ్రకృతిజన్య గుణం
బులు సజ్జనాళికిన్"

(ఆనంద ముద్రాలయమువారు క్రీ. శ. 1926 సం॥న ప్రకటించిన భర్తృహరి త్రిశతిలోని పద్యములలో పైపద్యము కడపటిపాదమున "ప్రకృతిసిద్ధ గుణంబు' లనుటచే యతిదోష మేర్పడినది. ప్రమాద జనితము కావచ్చును.)

పుష్పగిరివారి పద్యము:—

"ఆపదలందు ధైర్యము, మహాభ్యుదయంబున
నోర్పు, ప్రౌఢవా
చాపటిమంబు రచ్చలను,
సంగరరంగమునన్ బరాక్రమా
టోపము, కీర్తి నిచ్చయుఁ గడున్
వ్యసనంబు శ్రుతిం దలిర్పఁ, బ్ర
జ్ఞాపరులొప్పుచుండు, రివి సాయములై
తనయందుఁ బొందఁగన్"

చిన్నపద్యములో నిముడని విషయమునకుఁ బెద్దవృత్తము రచించుట:—

(1) (ఆరభ్యగుర్వీ, క్షయిణీ క్రమేణ, లఘ్వీ పురా వృద్ధిముపైతి పశ్చాత్ : మూలము)

ఏనుఁగువారి రచన:—

"మొదలఁ జూచినఁ గడుఁగొప్ప పిదపఁ గుఱుచ,
యూడఁ గొంచెము తర్వాత నధికమగుచుఁ
దనరు దినపూర్వపరభాగ జనితమైన
ఛాయపోలికఁ గుజనసజ్జనుల మైత్రి"

పుష్పగిరివారు వ్రాసినది:—

"హెచ్చిలుఁ గొల్లఁ, బిమ్మట గ్రయించును
రేపటిప్రొద్దుటఁ నీడనాక్
నుచ్చితు చెల్మి, గొల్లఁ గడుఁ గొంచెముసై,
మఱి మీఁద హెచ్చుచున్
వచ్చు విశేషమచ్చిక గ్రమంబుగ నాపటిప్రొద్దుట
నీడనా;
నిచ్చలు నిత్యలంగెఱఁగి, నెయ్యము సేయఁదగు
న్వివేకతోన"

(2) (మృగమీనసజ్జనానాం, తృణజలసంతోష విహిత వృత్తీనామ్: మూలము)

"ఏనుఁగువారి ఆంధ్రీకరణము:—
కసవుచే నీటిచే మోదకలవచేత
బ్రతుకు మృగమీన సజ్జనప్రకరములకు
శబర కైవర్త సూచకజనులు జగతిఁ
గారణము లేని పగవారుగా రె తలఁప"

పుష్పగిరివారి కృతి:—

"నీరముఁ బూరి సంతసము నిచ్చలు జీవనమై పొసంగ, నెవ్వారికిఁ గీడుసేయక ప్రవర్తిలు మీన మృగార్యులందు నిష్కారణవైర మూనెదరు కష్టులు దాశకిరాతసూచకుల్ వారిజగర్భ కట్టడయొ, వారి దయారహితస్వభావమో ?"

కావ్యలక్షణములు సంతరించుకొన్న సవిార కుమారవిజయ ప్రశంస—ఇట అప్రస్తుతము.

'సాధుమేధానిధి' శతకమునకు—'రఘునాథ' శతకమను నామాంతరము గలదు. 'అనాథనాథ రఘునాథా, సాధుమేధానిధీ'—అన్న మకుటముతో ఇందుగల పద్యములు 108. కాని, 90 నుండి 105 పద్యములవఱకు అంకుపట్టుటకు వీలు లేనంతగా శిథిలములయినవి. మకుటముంబట్టే యిది శార్దూలమత్తేభవృత్తములలో నడచినదనుట నిశ్చయము. కవి యీ శతక పద్యములన్నిటిని సాధ్యమయినంతవఱకు దుష్కరప్రాసములతో సాగించినాఁడు. నడకసొంపు హృదయమునకింపుగ నింపారినది. కొన్ని పద్యము లిక్రింద ఉదాహృతములు :

(1) "రా! హస్తోద్ధృత దివ్యకార్ముకశరా; రావే,
సుమిత్రాసుత
స్నేహాపూర్ణ కటాక్ష రా! పదజాక్లిష్టాం
భ్రిపంకేజ; రా
వే, హారామల కుంభినాథవర; రావే, రామ!
సంక్రాంత సీ
తాహృత్పా, యనాథనాథ, రఘునాథా,
సాధు మేధానిధీ!"

(2) "సంసారార్తిఁ దపింపఁగా, వివిధ దోషంబుల్
ప్రకల్పించఁగా,
హింసాపూర్వక బుద్ధినై మెలఁగఁగా, నేలా
యుపేక్షింతె, ది
మాంసాస్పృజ్యయ దేహమోహము హరింపక్
లేన? మాయామృగ
ధ్వంసివ్యాస, యనాథనాథ, రఘునాథా
సాధుమేధానిధీ"

(3) ఉగ్రాంభోద్భవ జంభభిత్ప్రముఖ
దేవాత్తంసకోటీర కో
ట్యగ్రభ్రాజిత దివ్యరత్న
రుచిరుచ్యాంఘ్రిద్వయా, భూవభో
దిగ్రాజద్ఘనకీర్తిధామ, నిది వార్ధిక్షారవారాశోషణో
దగ్రక్రోధ, యనాథనాథ రఘునాథా,
సాధుమేధానిధీ"

(4) "చిత్సంపత్తి యొకింత లేదు కడుశ్లీలంబు
శీలంబు, యో
షిత్సంపర్కమునందె కాంక్ష, శమముక్
క్షీణించె, సర్వార్జనం
బౌత్సుక్యంబునఁ గాఁచుముంగడచె, రామార్యా,
ననుం బ్రోవ, వి
ద్యుత్సంకాశ, యనాథనాథ, రఘునాథా,
పాహి మేధానిధీ"

పైపద్యములన్నియు, మకుటము ననుసరించి కడపటిపాదమెల్ల "త"—వర్గ యతిమైత్రి వర్ణములతో నే తుదివరకును సాగుటనుబట్టి, శతకమంతయు, అట్టే, తాను వ్రాయవలసిన నిర్బంధ మొకటి ఈ కవి తానె తెచ్చుకొన్నట్లయినది.

ఇతని మఱొక శతకకృతికూడా పైదానివలెనే కడపటిపాదమేకైక యతిమైత్రివర్గ సంశోభితము. 'శేషశైలవిహార' యను దివ్యమకుటాలంకృత మగు ఈశతకము కందపద్యములలో వ్రాయబడినది. ఇందలి యమకముల గమకము శబ్దార్థసౌభాగ్యము, ధారాళ ధారాపాటవము కొండొకయెడ పోతనగారి పద్యములనురీతి జాలువాఱుచు—హృదయోల్లాసము గూర్చుచున్నయది. ఉదాహరణకుఁ గొన్నిపద్యములు—

(1) "ధాతవు, భ్రాతవు, మాతవు, త్రాతవు నీవని
తలంతు దైతేయచమూ
వ్రాతభిదా, ఘాతహరా, శాతశరా, శూర, శేష
శైలవిహారా"

(2) "వర్ణించెద, నీకథ లాకర్ణించెద, నన్నుఁ బ్రోవఁ
గదె యరుణవిభా
కర్ణజపవర్ణ పురస్వర్ణప్రాకార! శేషశైల
విహారా!"

(3) రాధారత గాధాశత బోధాయత హృదయ,
భూరిశ్వసుర
త్వాధారా, సాధారణ సౌధాకూపార,
శేషశైలవిహారా!"

4. హృద్యంబులు, మద్విరచిత
పద్యంబులు వినుము గోపభామా గృహ కుం
భోద్యత్పక్వపయోదధి
షడ్యోర్ఘృతచోర, శేషశైల విహారా!

5. పంకాన్విత శంకాతత
పంకావృత భవపయోధిఁ బాపుము, యుష్మ
త్కింకర యతి శంకరనుతి
సంకలితోంకార, శేషశైల విహారా.

ఇఁక ఇతని తిరువడంబాస్తుతిలోని పద్యముల సంఖ్య సరిగా తెలియవచ్చుట లేదు. శిథిలమయినవి పోఁగా, ఇప్పటికి దొరికినవి యేఁబది పద్యములు మాత్రమే. అన్నియు లయగ్రాహి వృత్తములు—దీనికి "హేరంబజననీ, తిరువడాంబముఖ రమ్యశశిబింబ, పుషితాశ్రిత కదంబ జగదంబా" అను మకుటమున్నది. ప్రతి పద్య మంత్యప్రాస నియమబద్ధమై, అద్భుతశబ్ద సౌష్ఠవసముపేతమై పాడుట కనువుగ నున్నవి. కొన్ని పద్యము లీక్రింద మచ్చున కీఁబడినవి:—

(కొలువు వర్ణన)

"శంబర విలోల నయనంబులు విశాలజఘనంబులు
మరాళి గమనంబులు, పృథూరో
జంబులు, ప్రసాంచిత భుజంబులు స్మితాస్యవన
జంబులు రహించ నెలుతంబోలుక నేవ
ల్పుంబడఁగ మిన్న లుడిగంబు లొనరింప సురలుం
బలసి కొల్వ, నని శంబలరుదో హే
రంబ జననీ, తిరువడాంబముఖ రమ్యశశిబింబ
పుషితాశ్రిత కదంబ జగదంబా."

(శృంగార వర్ణన):—

బింబ సుభగాధర ఫలంబు, లవలీవిలసఖంబగు
కపోలఫలకంబు, హసనాంకూ
రంబును బ్రఫుల్లకుసుమంబు, కుచభవ్యలికుచంబులు
శిరోజ మధుపంబులును కొలా
పంబులు దలిర్ప బ్రమదంబగు వనంబని వసంబున
దలంచు హరివంబరను నిక ॥హే॥

(శౌర్య వర్ణన):—

శంబరము మహోగ్ర నివహంబు విదళించు పగిదిం
బలలభోజుల శిరంబు లురువౌ గా
త్రంబులు, కరంబులు, నురంబులు, పరంబు
లుదరంబులు బగుల్పఁ బ్రఖరంబున భవత్త్రి
శంబు, మహిషాసుర బలంబునకు భీతిజనకంబగు
కరాగ్ర ముసలంబు, భళిరే ॥హే॥

(దుర్జన వర్ణన):—

నింబతరుశాఖ లమితంబుగ ఫలించిన, ప్రియం
బెసఁగ వాయసచయం బెపుడు భక్షిం
చం బరువులెత్తు కరణిం జెలిమి, మాలినజనంబు
గడియించిన ధనంబు దినఁ బ్రాప్తిం
చం బసులపోల్కిఁ గుపథం బెనయు మూర్ఖ
విసరంబు శివభక్తుల విధం బరయరో ॥హే॥

పద్యము లన్నియు ఈధోరణిలోనే నడిచినవి! ఈశతకపద్యము లొక్క స్తుతిపరములయినవి మాత్రమే కాక, నీతి శృంగార వైరాగ్యాద్యనేక విషయోద్ఘాటకములు. కవియే యిందలి పద్యములను ఆ యా విషయ



పాతతరం కూచిపూడి నాట్యాచార్యులలో కట్టకడపటి మహనీయుడు

## భరతనాట్య కళానిధి కీ. శే. వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రిగారు

### గత జూలై 13 వ తేదీన ఆంధ్ర రాజధాని నగరంలో దివంగతులైనారు

ఆంధ్ర నాట్యకళా చరిత్రలో ఇది ఒక మహాధ్యాయినికి ముగింపు

---

ముల ననుసరించి అయిదు భాగములుగ విభజించినాఁడు:—(1) శౌల్యవర్ణన, (2) శృంగారవర్ణన, (3) శౌర్యవర్ణన, (4) దుర్జనవర్ణన, (5) ప్రార్థనము:- అని క్రమముగ నవి పేర్కొనఁబడినవి.

ఇతని సమకాలికుఁడగు కంకంటి పాపరాజు ఇతని కావ్యనిర్మాణ సందర్భమునఁ దోడుపడినట్లు ఈ కవియే నుడివియున్నాఁడు,

"అని కిరీటికి శౌరి తోడయినయట్టు
లమ్మహాకవి సాహాయ్య మాచరింపఁ
గృతి నొనర్పంగఁ బూనిన యేను మొదట
నెంతు మన్వంశవిగ్ర మధి యెట్టు లనిన"

ఇతఁడుకూడ ఉత్తర రామాయణము వ్రాయునపుడు పాపరాజునకుఁ దోడ్పడిన ట్లొకప్రవాదము గలదు. నన్నయకు దరువాతి వారిలో నిట్టిదరుదు. ఇదెంతవఱకు సత్యమో కాని, యిరువురి రచనలను జక్కఁగ బరిశీలించినపుడు మాత్రము కుడియెడమలుగ నుండుననుట నిస్సందేహము. జటిల శబ్ద సమాస ఘటనయందుఁ గంకంటివారిది, కుడిచేయి యయిన, పుష్పగిరి వారిదియెడమదని నిర్ణయించుటలో బాధకమంత గా లేదు.

ఈ పుష్పగిరి తిమ్మనార్యుని కృతు లన్నియు లభ్యములయిననాఁడు ఆంధ్ర శారదకుఁ బుష్టియుఁ, దెనుఁగుప్రజకుఁ దుష్టియు చేకూరగలదు.

# గ్రంథ విమర్శనము

## "అరుంధతీవశిష్ఠము"

రచన: శ్రీ బులుసు వేంకటేశ్వరులు. ప్రాప్తిస్థానము: బి. వి. అండ్ సన్సు, రామారావుపేట—కాకినాడ. వెల: 2-0-0.

నూర్గురు కొడుకులనుగన్న వసిష్ఠుడు సదాబ్రహ్మచారి. షడ్రసోపేతమైన భోజనమును తీసికొంటూన్న అగస్త్యుడు నిత్యోపవాసి.

సదాబ్రహ్మచారి దారి యిమ్మన్నాడని అరుంధతి అనగానే నది దారియిచ్చింది. నిత్యోపవాసి దారి యిమ్మన్నాడని అనగానే తిరిగి రావడానికి నది దారి యిచ్చింది.

అరుంధతికి ఆశ్చర్యంవేసి భర్తను ప్రశ్నించింది. దానికి వసిష్ఠుడు సమాధానం చెప్పాడు. ధర్మమునకు అంగముగా కామమును సేవించు భ్రాంతిహీనుడు సదా బ్రహ్మచారి. అన్నమబ్బినా, అబ్బకపోయినా సమబుద్ధితో ఉండేవాడు నిత్యోపవాసి,—ఇది ఆనాటి గార్హస్థ్యానికి ఆదర్శమైన ధర్మం. ఈ ఆదర్శాన్ని పునాదిగా చేసుకొని ధర్మం జీవిస్తూవుంటే దానికి అంగములై ఉండేవి అర్థకామాలు. ప్రధానమైన ఆదర్శం నశిస్తే పాశవవృత్తి తనంతటతాను ఉద్వేగించి ప్రకృతిని ప్రలోభంపాలు చేస్తుంది. తద్విధంగా ఆదర్శధర్మాన్ని నాశనంచేసుకొన్నది సృష్టి తనచేతులతోనే అన్నమాట. ఇక పురుషార్థాలు అపార్థాలు అయాయని విపరీతార్థాలు అనవక్కరలేదు.

సుప్రజకోసం వివాహం. కామతృప్తికి సాధనంగా ప్రకృతిని ఉపయోగించుకుంటే పురుషత్వం నశిస్తుంది. బ్రాహ్మమైన నిర్వచనం మనువు ఇలా సూత్రించాడు.

"కామాత్మతా న ప్రశస్తా
నచైవేహాస్త్యకామతా"—దీనిని ప్రత్యక్షముగా సత్యసూత్రానికి ముడివేసి ఆచరించి చూపిన ఆదర్శపురుషులు భారతీయ ఋషులు.

నేను వచ్చేవరకూ ఈ కమండలువు పట్టుకుని ఉండు అని వసిష్ఠుడు వెళ్ళిపోయాడు. ఎన్నాళ్ళకో గాని రాలేదు. అంతవరకూ అరుంధతి అలాగే ఆ చోటనే చిత్తరువులా నిలిచి ఉన్నది.

ఇసుక వండిపెటమన్నాడు. చేసిపెట్టింది. పెండ్లిచూపులకువచ్చి వసిష్ఠుడు వధువయిన అరుంధతిని పరీక్షచేశాడు. ఆవిధంగా. ఆమె అన్నింటా ప్రథమశ్రేణిలో నెగ్గింది.

కన్యాదాత కర్దమప్రజాపతి ధన్యుడనయానని అనుకొన్నాడు. సర్వ సురసామ్రాజ్యాధిపతి యయిన శంకరునకు పిల్లనిచ్చి ఉబ్బిపోయిన హిమాచలేంద్రునికంటె తానే గొప్పవాడననుకొన్నాడు.

విచిత్రము, పవిత్రము అయిన ఇతివృత్తం. శ్రీ శివరామశాస్త్రిగారు చెప్పినట్టు బులుసువారింటి పనులు పండితపామరులకు మన్నించదగినవే అయి ఉంటాయని అనడానికి ఈ నూతన రచన తిరుగులేని సాక్షి.

దురవగాహమైన భావమేదో కావ్యానికి జీవమని వక్కాణిలలువేసే ఆకాలపు కావ్యాలు కుప్పతెప్పలుగా ఉప్పతిల్లుతూన్న ఈ దినాలలో వేంకటేశ్వరులుగారి యీ కృతి ప్రవాహానికి ఎదురీత అయింది. ఇందలి కథ చాలమందికి తెలియదనే అనవచ్చు. ఈనాటి అభ్యుదయ మార్గాన్వేషక సాహిత్యరంగానికి ఈలాటి రచనలు ఆదర్శములైతే గార్హస్థ్యధర్మము మళ్ళీ మూడు పువ్వులూ, ఆరు కాయలుగా విలసిల్లుతుందని అనవచ్చు. ఆర్షమైన ధర్మబోధకు ప్రతిహతమైన రచన ఎప్పుడూ స్వయంవృద్ధిని సాధింకోలేదు. విశ్వజనీనమైన భారతము ఈనాటికీ సర్వులకూ సర్వవిధాలా ఉపాదేయమై ఉన్నదంటే అది బోధించిన ధర్మప్రవృత్తి నిష్కంటకమన్నమాట.

సాంఘిక జీవనమును పునీతముచేసి గృహము సద్గృహము కావాలనే ఆకాంక్ష మానవునకు ఎనాటికీ ఉంటుంది. దానికి వైతాళికులు ఎన్నడూ ఉండనే ఉంటారు. వారిని గుర్తించడం సంఘ ధర్మం.

విషయము ఎంత విజ్ఞాన ప్రదమో రచన అంత మనోజ్ఞముగా విరాజిల్లిన గ్రంథం ఇది.

"తరుణీ! సంసార దీర్ఘయాత్రా పథులకు
నరయ సులభంబులౌ నుపాయములు గలవు
శమదమాన్విత ధర్మమార్గమును బట్టి
పొందవచ్చు యాత్రానందమిందువదన!

"పెంపునఁ దరించి యొరులఁ దరింపచేయు
సారవంతంబు నిజము సంసార మగును
ఆత్మ కుక్షింభరత్వ కామాదిలమును
నీచ సంసారమే సర్వ నింద్యమగును"—

## క ల స్వ న ం

ఖండకావ్యసంపుటి. రచన: శ్రీ గణపల్లి సత్య నారాయణరాజు: ప్రచురణ: తెలంగాణా రచయితల సంఘం; హైదరాబాదు; వల రు 1-25.

ఈ సంపుటిలో మొత్తం 32 ఖండకృతు లున్నాయి. వీటిలో దాశరథి, రాయప్రోలు, మొదలైనవారిమీద చెప్పినకృతులు కొన్ని. గాంధిగారిమీదా, అస్పృశ్యతానివారణ మీదా, ఆంధ్రావతరణంమీదా, బుద్ధుడిమీదా రచించిన కృతులు కొన్ని. శ్రీ సత్య నారాయణరాజుగారు ఉదాత్తమైన కవితా వస్తువును సేకరించినప్పుడు మనోహరంగా రచించగలరు. 'పూజ' అనే కావ్యంలోనుంచి ఒకటిరెండు పద్యాలు:

హాయినొసంగు మంద మల
యానిల వీచికలందు సంజకెం
జాయ వెలుంగులందున ప్ర
సన్నత గన్న మనః ప్రవృత్తితో
కోయిలపాటలం దలము
కొన్న సుఖస్వరమెత్తి వేగరా
నోయి! ప్రభో! యటంచు మను
గోజ్వల గీతముఁ నాలపించితిన్.
అనఘగీతికారవ
మనంత విశాల వినీల నిర్మలా

---

# గ్రంథ విమర్శనము

కాశము దాటి సత్వపరి
కల్పిత సర్వ జగద్విలాస లీ
లాశయ దీపితంబయి సు
భావహమై జలజాసనాది యో
గీశులకైన నిక్కముగ
నెన్నగరాని పథంబు నంటినన్.

పూర్ణేందు బింబంబు బోలిన నెమ్మోము
దరహాస చంద్రికల్ బరపుచుండ
సుందర నయనారవిందముల్ చిక్కని
కరుణారసంబును గురియుచుండ
నీలారుణాంబుద శ్రీ లలితాంగముల్
శృంగార వృష్టి వర్షింపుచుండ
భానుసహస్రవిభ్రాజిత మణికిరీ
టము విశ్వమును ప్రకాశమొనరింప
కలిత పీతాంబరంబు చక్కనితురాయి
చిఱుత గాలికి నాట్యంబు గఱపుచుండ
చల్ల చలగ పుడమికి జారివచ్చె
దివ్య మంగళమూర్తి నా దేవుడపుడు.

ఈ చివరి పద్యం లీలాశుకుని 'వేణీమూలే' అన్న శ్లోకానికి దీటుగావుంది.

## దత్తమహిమ

రచన: శ్రీ మిన్నికంటి గురునాథ శర్మగారు. ప్రాప్తిస్థానము: రచయిత, బ్రాడీపేట, 6 వ లైను, గుంటూరు—2; వెల రూ 2/-

ఇది 430 పేజీల అవధినిగల అర్ణవప్రాయమైన గ్రంథం, ఈ గ్రంథాన్ని 2 రూపాయలకు ఎలా ఇవ్వగలిగారా అని ముందు ఆశ్చర్యం కలుగుతుంది. కాని, పరమ ఆస్తికులూ, దత్తాత్రేయోపాసకులు అయిన శ్రీ గోవిందరాజుల శ్రీనివాసరావుగారి ప్రోత్సాహంతో ఈ గ్రంథం సృష్టింపబడినదని చదవగానే మనకు ఆ అనుమానం తీరుతుంది. దీన్ని వచనంలో సంఘటించ వలసినదిగా కూడా శ్రీనివాస రావుగారి ఆదేశమైనట్టు రచయిత చెబుతున్నారు. నిజానికి ఇది పద్య రచనగా సాగివుంటే దీని ప్రయోజనం బహు పరిమితమయ్యేది. ఇది సులభ గ్రాహ్యంగా వచనంలో రచింప బడివుండటం ముదావహం.

దత్తాత్రేయుడు, మన విజ్ఞాన సర్వస్వానికి సంకేతం. యోగ విద్యా సర్వస్వానికి ప్రభవ కారణం. సమగ్రమైన ఆయన చరిత్ర తెలుగులో ఎక్కడా వున్నట్టు కనుపించదు.

శ్రీ గురునాథ శర్మగారు బ్రహ్మాండ పురాణంలోని దత్తాత్రేయ మాహాత్మ్యమును సేకరించి దాన్ని తెలుగు వచనంలోకి అనువదించారు. దీన్లో దత్తాత్రేయావతార చరిత్రే కాక ఉపాసకులకు ఉపయోగకరంగా, అష్టోత్తర శతనామాది కొంత విషయంకూడా చేర్చారు. ఇవిగాక అందులో అనేక ధర్మ సూత్రములు, కర్మకాండకు సంబంధించిన వివరణలు వున్నాయి. విసుగు జనించకుండా చదువుకోవటానికి అనేక ఉపాఖ్యానాలతో నిండివుంది. అయినా పరమ పవిత్రమైన దత్తాత్రేయ చరిత్ర చదవటానికి విసుకేమిటి. ఇంటింటా వుండదగిన పునీత గ్రంథం.

---

## ఆత్మవేదన

గేయ సంపుటి: రచన శ్రీ పొట్లపల్లి రామారావు, ప్రచురణ దేశోద్ధారక గ్రంథమాల 2844, ఇమాంబాడి వీథి, సికింద్రాబాదు. వెల రు 1-25.

ఈ సంపుటిలో 'రాజులుంటేమి' 'ఖైదీ,' నిస్పృహ 'ఆకలి.' 'జనత,' 'రైతు—రాజు' వగైరా శీర్షికలలో 23 రచనలున్నాయి. 'మాదాము' అనే మొదటి గేయం.

ఎవరు ఇక్కడ రైతు
ఎవరు ఇక్కడ రాజు
కష్టించు వాడొకడు
కాజేయు వాడొకడు
భూదేవి నాగటికి
పాదివ్వ బోదు
వరుణ దేవా నీవు
కురియ బోకయ్యా
విత్తనాలు మొలక
లెత్తబోకండి
నదులార మీరింక
కదిలేరు సుమ్మీ!

*　　　*　　　*

అందర్నీ 'స్ట్రైకు' జెయ్యమంటున్నారు. మన 'సోషలిస్టిక్ పాట్రన్' గతేం కావాలి?

## స్వీకారము

రతనాల తండ్రి (గేయ నాటికలు): రచన: శ్రీ రంధి సోమరాజు; ప్రాప్తిస్థానము: రంధి సోమరాజు, C/o. సదరన్ ఏజన్సీస్, మెయిన్‌రోడ్, ఏలూరు. వెల రు 0-5-0.

ధ్రువ విజయము: (నాటకము) రచన: శ్రీ వంగీపురము కృష్ణమాచార్యులు; ప్రాప్తిస్థానము: వి. రామన్, 60. జనరల్ ముత్తియ్య మొదలి వీధి. సాహుకారుపేట, మదరాసు-1.

వేంగి చాళుక్య చరిత్ర పద్యకావ్యము రచన: శ్రీ కొత్త భావయ్యచౌదరి; సంగం జాగర్లమూడి, గుంటూరుజిల్లా; రు 0-5-0.

కృతజ్ఞత: నవల (చరిత్రాత్మకము) రచన: శ్రీ బులుసు సీతారామశాస్త్రి: వీరేశలింగం హైస్కూలు, రాజమహేంద్రవరము: వెల రు 1/.

చంద్రోదయము: నవల చరిత్రాత్మకము రచన: శ్రీ బులుసు సీతారామశాస్త్రి, వీరేశలింగం హైస్కూలు, రాజమహేంద్రవరము. వెల రు 1-0-0.

మాలతి: (కథాద్వయం): రచన: శ్రీ పులిపాక జగన్నాథరావు; ఆంగ్ల భాషాశాఖ, హిందూ కళాశాల, గుంటూరు. వెల రు 0—25.

స్వర్ణకుమారి: పద్యకావ్యము: రచన: శ్రీ పోమంచి సూర్యనారాయణశర్మ; విజయలక్ష్మి ప్రెస్; కాకినాడ. ఆంగ్లంలో 'ది గోల్డెన్ టచ్' అనే పేర ప్రసిద్ధమైన కథ ఆధారంగా వ్రాయబడిన కావ్యం. వెల రు 0-75.

ప్రపంచ కథావళి: అనువాదం: శ్రీ బి. వి. సింగరాచార్య: ప్రచురణ: కళ్యాణీ ప్రచురణలు, 16, 17, గజపతి లాలా లేన్, మద్రాసు-5. వెల రు1-25.

Printed & Published For Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna, at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras—1. Editor: S. Sambhu Prasad.